

సాహిత్య మాస పత్రిక

# భారతి

జూలై
1985

జర్మనుల "ఎడ్డా"! .... వేం. నా. శర్మ

దుద్దెడ శాసనము .... పి. చూడామణి

విష్ణు కుండినులు :
సాంఘిక ఆర్థిక పరిస్థితులు .... కె. రామమోహనరావు

ఇక కావలసిన దేమి? .... మాడపాటి హనుమంతరావు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

జూలై - 1985

సంపుటము : 62 సంచిక : 7

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## జూలై 1985



ముఖచిత్రం :

ప్రముఖ గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి

# శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి

"వాసం"

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నారు. అలాగే ప్రతి శతాబ్దములోను శ్రీ సరస్వతీదేవి అంశము భూలోకమున అవతరించి, ప్రాచీన సాంప్రదాయమును కాపాడి, ప్రజలకు కళలను అందజేయుచున్నది. ఈ శతాబ్దమున అట్టి మహిళ శ్రీమతి మధురై షణ్ముఖి వదివు సుబ్బులక్ష్మి అనుట నిస్సందేహము. నేడు ఆమె వయసు 70 సంవత్సరాలు.

ఉగ్గు గిన్నెలోనే సంగీతమును జుర్రుకున్న అసమాన ప్రతిభాగాయని. చిన్నప్పుడే తల్లి శ్రీమతి మధురై షణ్ముఖి వదివు వద్ద ఆరంభించారు. 1920 లోనే గాయనిగా ప్రసిద్ధి నొందారు. వైణిక విద్వాంసురాలిగా "వీ. షణ్ముఖి వదివు" అని వీరి గ్రామఫోను రికార్డులు నేటికీ లభ్యము.

ఎం. ఎస్. బాలికగా ఉండేటప్పుడే ప్రతి శుక్రవారం వారింట్లో మధురై హనుమంతరాయన్ సమక్షంలో కచ్చేరి చేసేవారు. అప్పుడే ప్రేక్షకులు కిటకిట లాడేవారు !

శ్రీ జి. ఎన్. బి. సన్నిహిత స్నేహితములోను, ప్రముఖ వయలిను విద్వాంసుడు మైసూరు టి. చౌడయ్య సహవాసములోను, సంగీత శాస్త్రజ్ఞానమును అందుకొని, స్వయం కృషి చేత నేడు ఇంతటి సాటిలేని గాయనీ



శ్రీమతి సుబ్బులక్ష్మి, శ్రీ సదాశివం తదితరులు

మణిగా అవతరించారు. వీరికి అందజేసిన బిరుదులు, సన్మానాలు ఎన్నో ఎన్నెన్నో.... తమిళనాడు ఆస్థాన గాయక మణి; తిరుపతి దేవస్థానం ఆస్థాన గాయని.

వీరి కంఠధ్వనికి ఒక ప్రత్యేకత ఉంది. అతి మాధుర్యమేగాక, ఏ స్వర స్థానములోనైనా, ఎంత కాలమైనా నిలిచి, గానము చేయగలరు: తెలుగు, తమిళము, కన్నడము, సంస్కృతము పలుకులు స్పష్టముగా వినిపించుట వీరి సుగుణము. ఒక కచేరీలో పలు రాగాలను, కృతులను, అపూర్వ రచనలనూ పాడేవారు. అన్నమయ్య, పురందర, వాగ్గేయ త్రిమూర్తులు, పాపనాశం శివన్, మీరా, ముత్తయ్య భాగవతార్, వాసుదేవచార్ మొదలైన వారి కీర్తనలు తప్పక వీరి కచేరీలలో వినిపించేవారు. అందువల్ల పలురకాల శ్రోతలకు పరమానందము కలిగేది. స్వరకల్పనలు వీరి ప్రతిభకు తార్కాణము.

ఆకాలములో సినిమాలలో నేపథ్య సంగీత పద్ధతి ప్రారంభంకాలేదు. కనుక, మంచి కంఠముతో స్వయముగా పాడేవారినే సినిమాలలో ఎన్నుకునేవారు. అలా ఎం. ఎస్. 5, 6 సినిమాలలో నటించి పేరు ప్రఖ్యాతులను సంతరించుకున్నారు. జి. ఎస్. బి. ప్రక్కన 'శకుంతల', సినీ దర్శకుడు వై. వి. రావుతో 'సతీసావిత్రి'.

ప్రధాన రైల్వే ఆఫీసరు ఎఫ్. జి. నటేశయ్యరు భార్యగా ఒక సాంఘిక చిత్రములో, "భక్తమీరా" మున్నగు చిత్రాలలో నటించారు. రాయల్ టాకీ డిస్ట్రిబ్యూటర్స్, సినీ సంస్థతో ఎం. ఎస్. కు ముఖ్య కార్యవర్గ పాత్ర ఉండేది. అందులోనే, శ్రీ టి. సదాశివం ఉద్యోగిగా ఉండేవారు. చనువుతో దగ్గరకు చేరి తుదకు ఎం. ఎస్. ను వివాహము చేసుకున్నారు.

సదాశివం కళావంతుల కులమునకు చెందిన ఎం. ఎస్. సుబ్బులక్ష్మిని శాస్త్రోక్తముగా, అగ్నిసాక్షిగా, మను ధర్మ నీతి ప్రకారం వివాహము చేసుకున్నారు. అది 1940 నాటి మాట. ఆనాటినుండి నేటి వరకు వీరిద్దరు ఆదర్శ దంపతులు. భక్తి శ్రద్ధ ప్రేమలతో ఎమ్. ఎస్. గృహిణిగా ఉంటున్నది. వీరికి ఒక గాడ్ ఫాదరుగా శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి ఉంటూ ఉండేవారు.

అఖిల ప్రపంచ సంగీత మేళను ఎడన్‌బరోలో ప్రముఖ వయలిను విద్వాంసుడు మెన్యూహెన్ నిర్వహించారు. ఎమ్. ఎస్. వెళ్లి అక్కడ కచేరీ చేసి యావత్తు ప్రపంచ సంగీత మేధావులను భ్రమింప చేసింది. శ్రీ సి. రాజగోపాలా చారి విరచిత ఇంగ్లీషు పాటను ఎం. ఎస్. అక్కడ వినిపించింది. ఒక ఆశ్చర్యము నేటికీ గ్రామఫోన్ ప్లేటులో ఆ పాటను వినవచ్చు.

ఎం. ఎస్. కు దైవభక్తి అపారము. గ్రామఫోన్ ప్లేట్ల ద్వారా పలు సుప్రభాతములను, శ్లోకాలను, వినిపింప చేశారు, చేస్తున్నారు. నేను అద్వితీయమైన గాయనీమణిగా ఎం. ఎస్. వుండుట ముఖ్యకారణము భర్త సదాశివం, అనుట నిజము. ఎం. ఎస్. సుబ్బులక్ష్మికి సంతానము లేదు. సంస్థలకు, సభలకు, మంచి కార్యక్రమాలకు ఆర్థిక సహాయార్థము కచేరీలను ఉచితముగా చేయుట ఎం. ఎస్.కి వాడుక.

డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# పలనాటి వీరచరిత్ర - శైవ నేపథ్యం

పలనాటి వీరచరిత్రలో శైవ వైష్ణవాల తగాదా వుందన్నది పూర్వ పండితాభిప్రాయం (చూ. పింగళి లక్ష్మీకాంతంగారి పీఠిక 1961)[1] కాని ఆచార్య బిరుదురాజు రామరాజుగారు,[2] తంగిరాల సుబ్బారావుగారు,[3] తమ తమ పరిశోధనల్లో అది దాయాదుల మధ్య అధికారం కోసం వచ్చిన పోరే తప్పా మత దృష్టి ప్రధానం కాదని ప్రతిపాదించారు. ముఖ్యంగా అందరూ గుర్తిస్తూ వచ్చింది. బ్రహ్మనాయడికున్న శైవమత సహనం. నృసింహకుంతాన్ని శివుడే తనకిచ్చాడని బ్రహ్మన్న అనటం; గురిజాల మీదదండెత్తినపుడు (మొదటిసారి) కామేశ్వరుని పూజించటం. ఆయన్ని వైష్ణవుడుగా నిరూపించేది 'నామాల మండపం,[2] అని ఆయన పేరుతో ఈనాటికీ మిగిలిఉన్న తీర్థమండపం-జిడ్డిగాలబావి. ఆయనకు సన్నిహితంగా ఉన్న బాలగోపన్నకు స్వయానా తాను తింటున్న ప్రసాదాన్ని పెట్టి వైష్ణవాన్ని ఇచ్చాడని 'చాపకూడు' ప్రోత్సహించాడని - తినని శైవవీరులు తమ పొట్టల్ని చీల్చి ఆ ఆహార పదార్థాల్ని చూపితే మంత్రజలం చల్లి తిరునామం పఠించి వారి పొట్టల్ని అతికాడని - ఇలాంటి కల్పనలు. కాని పలనాటికథగా చెప్పబడుతున్న సంఘటనలన్నీ 11-12 శతాబ్దుల మధ్యన జరిగాయి.[4] అప్పటికి వైష్ణవం తెలుగునాట ఎంతవరకు ప్రాకిందన్న విషయం స్పష్టంగా లేదు. ఇక ఆ కథలో 'శైవ' నేపథ్యం నిబిడంగా కనిపిస్తోందన్న విషయం అతి స్పష్టంగా నిరూపించవచ్చు అలాంటికొన్ని అంశాల్ని ఈ చిన్నవ్యాసంలో ప్రతిపాదిస్తూ చరిత్ర విమర్శకులు - సాహితీవేత్తలూ ఈ అంశాలపైన తమ గురి నిల్పాలని వాంఛిస్తున్నాను

1. మాచెర్లకు గురిజాలకు ఉన్న చారిత్రక సంబంధం.
2. వీర విద్యలదేవి - సోమేశ్వరుడు - కొమ్మరాజు.
3. బ్రహ్మన్న-సోమేశ్వరుడు-కల్లుప్రతిష్ఠ-వీరగల్లుల విషయం.
4. 'వీర' శబ్ద విచారం - శైవ ఆచార ప్రతిబింబనం.

ఈ అంశాల్ని గురించి ప్రస్తావించేముందు మనం ఒకటి రెండు అదనమైన అంశాల్ని గుర్తుంచుకోవాలి. జానపదులు పాడుకుంటూ వస్తున్న అనేక వీరగాథలలో. పలనాటి కథ ఒకటి. అసలు చరిత్ర ఎలా జరిగిందన్న విషయాన్ని తవ్వి పోయటానికి ప్రయత్నించిన చరిత్రకారులూ ఈ ప్రశ్నలమీద ఆధార పడాల్సివచ్చింది. ఈ కథలో ప్రసక్తులైన ప్రధాన వ్యక్తుల్ని ఆధారంగా ఇది స్పష్టమైన చారిత్రక ఇతివృత్తమేనని ఊహిస్తున్నాం. అంతవరకూ బాగానేవుంది. ఈ కథని జానపదగీతాల ద్వారా వినే శ్రీనాథమహాకవి ద్విపదరూపాన్ని ఇచ్చి వుండాలి. తర్వాత మల్లయ్య కొండయ్యలు కొన్ని భాగాల్ని రాశారని, లేదు పూరించారని పండితులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.[5] ఏమైనా ఒక విషయం స్పష్టం. జానపదులు సృష్టించిందే తొలిరూపం. దాన్నే తరువాత శిష్ట కవులు మలుచుకొన్నారు. ఈ కథను 'చెన్నుడి కథ' అని పంబలు. పిచ్చుక గుంట్లు అంటారు. చెన్నుడి ప్రార్థనతోనే శ్రీనాథుడూ మొదలుపెట్టాడు. అంటే వీరగాథలు సామాన్యంగా ఒక సంఘటన జరిగిపోయిన పిమ్మట పుడతాయి. అలా సుమారు 12వ శతాబ్దిలోంచి ఈ గాథలు - గేయాలు పుట్టాయనుకొన్నా అప్పటికి దేశంలో వైష్ణవం క్రమంగా వ్యాపిస్తూ ఉండటం - జానపదులు తమ సమకాలీనాంశాలను చొప్పించి బ్రహ్మన్న పాత్రను అలౌకికంగా - అవతారరూపంగా - తీర్చిదిద్దుకోవటంలో వైష్ణవం ప్రాధాన్యంవహించి వుంటే ఆశ్చర్యం లేదు గాని - అసలు కథలో ఉన్నవి స్పష్టంగా శైవాంశాలే

ఇక ఈ చరిత్రలోని పౌరాణికాంశాలు - కల్పనలు - వీటిని అట్టిపెట్టి చరిత్రలో ఉన్న లింకుల్ని విడదీసుకొంటూ - కలుపుకొంటూ చూస్తే 'శైవ' నేపథ్యం రూపు కట్టుతుంది. లేకపోతే శ్రీనాథాదులందరూ మొదలుపెట్టినట్టు పాలమాచాపురి - జంభనాపురి - జబ్బల్‌పూర్ -లో కథలు మొదలయినట్టు ఊహించాల్సి వస్తుంది. విద్యలదేవిని కాశీలో అనుగురాజు వివాహమయ్యాడని చెప్పాల్సి వస్తుంది. అంచేత మొదట స్పష్టం చేసుకోవాల్సిన విషయం ఏమిటంటే అనుగురాజు పలనాటిని అరణపు సొత్తుగా సంపాదించక ముందు హైహయులకు గురిజాల - మాచెర్ల - ప్రాంతాలతో ఉన్న సంబంధం. ఇది చరిత్రలో మరుగుపడిపోయిన అసలు రహస్యం - దీన్ని గుర్తిస్తే 'శైవ'నేపథ్యావిష్కరణకు కీలకం దొరికినట్టే.

బెంగుళూరు విశ్వవిద్యాలయ ఆంధ్రాచార్యులు బాడాలరామయ్యగారు బసవేశ్వర వచనాల్ని అనువదించి చరిత్రను సమీక్షించారు.[6] అది వారి డి. లిట్ గ్రంథం. అందులో ఆయన త్రవ్విచూపిన చారిత్రకాంశాలను పలనాటి కథలోని మౌలికాంశాలతో ముడిపెట్టిచూస్తే తెలిసిన అంశాల్నే యిక్కడ నేను రాస్తున్నది. అంతే కాకుండా సుప్రసిద్ధ వీరగాథాగేయ పరిశోధకులు తంగిరాలసుబ్బారావుగారు అందించిన కొన్ని అమూల్యమైన అంశాల్ని కూడా ఆధారంగా తీసుకొంటూ ఈ ప్రతిపాదనలు చేస్తున్నాను

### 1. మాచెర్ల - గురిజాలల సంబంధం

మాచెర్లను 'మాహాదేవిచెర్ల' అని అంటారు. మహాదేవి మారాసపు దేవత. పాలమాచాపురి - అని పిలువబడ్డది మాచెర్లయేనేమో. మాచెర్లలోని చెన్నుడి ఆలయమే ప్రాచీనమైంది - ఇప్పటికీ బ్రహ్మన్న కట్టించినట్టుగా జనశ్రుతిలో మిగిలినదీ. ఇక్కడ మాచా - అన్న మాట ! ఆల - అన్నమాట వరసగా మాచెర్ల - పలనాడు అను మాటల్ని మౌలికంగా తాకుతున్నాయి. మరి ఈ కథ ఎక్కడ మొదలయివుండాలి. చారిత్రకులు బేతరాజుని - అనుగురాజుని గుర్తించారు. గోదావరి యుద్ధం జరిగిందాక పలనాటి హైహయులుగా పిలవబడ్డ బేత రాజువంశంవారు చాళుక్యులకు సామంతులు. గోదావరి యుద్ధంలో తెలుగు చోడులు జయించారు. అలా పలనాతిసీమ చందవోలు వారి వశమయింది. చాళుక్యులపట్టు పోయింది. ఆ దశలో అనుగురాజు తన వద్ద ఉన్న దొడ్డన్న పెద్దన్న, చిన్నవాడైన బ్రహ్మన్న, తెప్పలినీడు - మొదలైన వారి సాయంతో విజృంభిస్తున్నాడు. చందోలురాజు మైలమ్మనిచ్చి పలనాతిని అరణంగా ఇచ్చాడు. గురిజాలకేంద్రమయింది. కాని ఇక్కడ ఒక సమస్యఏమిటంటే - తర్వాతికథలో బ్రహ్మన్న 'మాచెర్ల'నే విద్యలదేవి సంతానానికి తగిన చోటని తీసుకుపోవటం. మాచెర్లలోని 'అంకమ్మ' ప్రసక్తిని దీనికి జతచేసుకొంటే - మహాదేవిగా చెప్పబడ్డది 'అంకమ్మే' అని గుర్తించవచ్చు. ఈ దేవతనే వీరసోముని కుమారుడు కొమ్మరాజు అర్చించేవాడు ఆ దేవతే యుద్ధప్రారంభంలో కొమ్మరాజుకు ప్రత్యక్షమై రణరంగాన్ని ఆవహించింది.

ఈవిషయకంగా తంగిరాలసుబ్బారావుగారు ఇచ్చిన వివరణ ఇది :

'కొమ్మరాజు కొంతకాలము మలిదేవుని రాజ్యమునకు రాజుగా ఉండెనని నాకు లభించిన పల్నాటి కథలలో గలదు, ఈ హైహయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులగుట చేతనే వీరు కొమ్మరాజును అలరాజును మిక్కిలిగా గౌరవించెడివారు. పల్నాటి వారు కొమ్మరాజాదులను 'మహారాజులవారు' అని పిలిచెడివారు, ఈ 'మహారాజులవార'ను శబ్దమే' మహారాజులవారు 'మారాసపువారు' గా మారి యుండునని నాయభిప్రాయము [1993 : 60]

అంటే పలనాటి కథలో శక్తి చక్రకథా బీజాలున్నాయని మరచిపోరాదు. ఈ అంకమ్మను వీరసోముని కొడుకు పూజించడం ఎలా సంభవించింది ? ఈ విషయంగా కూడా తంగిరాల సుబ్బారావు గారే రవద్దేవి రాజు కథను గురించి చెబుతూ:

'ఈ మారాసపురాజులలో జివరి వాడగు వీరసోమరాజు "ఆడదేవతరాలు. అనాధీకురాలు.... దీని ముఖారవిందము మన మారాసపు వారు చూడదోషంబు" అని తలంచి అంకమ్మను గొలుచుట కిష్టములేక, పల్నాటి వారితో గలిసెను. అంకమ్మ కూడా నా వీర సోమరాజుచే గొలిపించుకొనవలెనను పట్టుదలతో పల్నాటి యంకమ్మగా వెలసెను [1988:59]

కాబట్టి పలనాటిని అరణంగా పొందక మునుపు అనుగు రాజాదులకు కేంద్రం మాచెర్ల. అది ఒక శక్తి పీఠం.

### 2. వీరవిద్యలదేవి - సోమేశ్వరుడు - కొమ్మరాజు

'మల్లంపల్లి సోమశేఖర శర్మగారు,[7] పెదమలిదేవునకు పిల్లనిచ్చిన వీరసోముడు కలచూరి బిజ్జలుని కొడుకని అభిప్రాయపడిరి. ఇది నాకు సమంజసముగా తోచుటలేదు. (తంగిరాల సుబ్బారావు 1983 : 61)

'అని అంటున్నా శర్మగారి అభిప్రాయానికి బలంకల్గిస్తున్నది. 'విద్యల' శబ్దం. దీని వికృతే 'బిజ్జల' బెజవాడ అన్న రూపంలో కూడా 'బిజ్జ' అనే మూల రూపంగా నిర్ధరించవచ్చు. దాని సంస్కృతీకృత రూపం 'విజయ' - (విజయవాడ). గాథాకారులు, 'బిజ్జలదేవి' అని కూడా 'విద్యలదేవి'ని అక్కడక్కడా పిలుస్తూ వచ్చారు.

ఈమె పేరులో 'వీర' ఎక్కడినుంచి వచ్చింది. ఆమెను కాశీలో వివాహమాడటం ఏమిటి! జానపద గాథల్లోని అయోధ్య, హిమవంతం, హస్తినాపురి మొదలైన నగరాలు వాటి చారిత్రకార్థాలుండవు. మనమే చరిత్రను తవ్వినపుడు కల్పించుకోవాలి 'కళ్యాణి'నే 'కాశి'గా జానపదులు కల్పించి ఉండాలి.

బిజ్జలునికీ వీర విద్యలదేవికి సగోత్రత లేకపోతే మళ్ళీ పెదమలిదేవునికి సిరాదేవిని కళ్యాణి నుంచీ తెచ్చుకోవాల్సిన అవసరం ఏముంది!

కొమ్మరాజు వీర సోముని కుమారుడు. అతని భార్య చల్లమ్మ. కొడుకు అల్లరాజు. నలగాముని కూతురు పేరమ్మను పెండ్లాడాడు. ఈ అలరాజు (రాచమల్లు)ను చంపారనే 'కులపగ' తీర్చుకోవటం కోసం అసలు వీరులంతా రణభూమి చేరారు తప్ప 'దాయభాగం' కోసమూ కాదు. ఇలాకూడా కథలో శైవనేపథ్యమే వుంది. తంబళ్ళ పెద్ద ఇచ్చిన విషకుసుమ మంజరిని అలరాజు నిరనుమానంగా ఎందుకు ఆఘ్రాణించాడంటే అలరాజు పరమశివ భక్తుడు కాబట్టి.

### 3 బ్రహ్మన్న - సోమేశ్వరుడు - కల్లుప్రతిష్ఠ వీరగల్లులు:

అసలు ఈ కథలో కేంద్ర భూతుడుగా ఉన్న బ్రహ్మన్నకే వీరసోమునితో సంబంధం - మిత్రత్వం - ఉన్నట్టుగా కనిపిస్తున్నది. కల్యాణినుంచి 'కల్లిదేవు'డిని తెచ్చి త్రిపురాంతకంలో కొంతకాలంవుంచి యుద్ధంలో రణరంగ మధ్య భాగాన యుద్ధానికి సాక్షిగా బ్రహ్మన్న నిలిపాడు. కల్లి దేవుడని పిలువబడ్డ నాగారపు స్తంభం - శివలింగమే.

ఇక వీరులపేరిట లింగాల (వీరగల్లులు) ప్రతిష్ఠ యుద్ధానికి ముందు నాగులేటి తీరాన జరిగింది. ఆ సందర్భంలో వీరసోముడు

అడిగాడు; మానాన్న వీరసోముడి శిలను పలికించు - అని. బ్రహ్మన్న పలికించాడు. ఈ అద్భుత కల్పనకు వెనక ఉన్న చారిత్రక వాస్తవికత గుర్తిస్తే వీరసోముడు - బ్రహ్మన్న పరస్పరం తెలిసినవారే.

అసలు బ్రహ్మన్న మతం ఏమిటి? అన్న ప్రశ్నకు ముందుచరిత్ర గుర్తించిన వ్యక్తిగా బ్రహ్మన్న పేరిట శాసనాలు వగైరాలు ఏమీ లేవు. ఒకచోట 'శీలంబ్రహ్మన్న' గుర్తించబడ్డాడు. బాదం వారి వంశమూ ఈ నాటికీ వుంది. పానుగల్లు (తెలంగాణాలోనిది)కి శైవానికి సంబంధం కనిపిస్తోంది. ఎందుకంటే పండితారాధ్యుడు చందవోలు రాజును శపించి పానుగంటికే వెళ్ళి అక్కడ పరమపదించాడని చరిత్ర. అందువల్ల 'బ్రహ్మన్న' వంశంవారిలో శైవమే ప్రాణాంశ. లేకపోతే 'నృసింహ కుంతాన్ని' శివుడు ఇవ్వడం ఏమిటి! మలిదేవుడి పట్టాభిషేకానికి దత్తాత్రేయగురువు (షోలాపూరునుంచి) రావడం ఏమిటి !

దత్తాత్రేయం - వైష్ణవం కాదు. కాకపోతే శివశక్తి సమన్వయ త్రిమూర్తి మతమది. తాంత్రికమే. ఈ నేపథ్యంలో బ్రహ్మన్న పాత్రలోని 'అద్భుత' లక్షణాన్ని అంచనా వేసుకోవచ్చు. దత్తాత్రేయ సంప్రదాయంలో 'గురువు' ప్రధానం. ఆ గురువు లీలా మూర్తిగానే కనిపిస్తాడు. బ్రహ్మన్నలోని 'విష్ణ్వంశ' గా జానపదులు గుర్తించిన అంశం ఈ తంత్ర సంబంధి.

ఇక వీరులున్నారు. వీరందరూ భూతరాట్కంబానికి బలిపూర్వకంగా పూజ చెల్లించారు. లింగప్రతిష్ఠ - అందరూ చేశారు. ఈ వీర కల్లు' సంప్రదాయం ఒక్క 'శైవం' లోనే వుంది.

## 4. "వీర" శబ్దప్రచారం - శైవ ఆచార ప్రతిబింబనం

వైష్ణవం పేరిట మహావీరుడు గా గుర్తించ దగ్గవాడు. ఒక్కడే ఉన్నాడు శ్రీ కృష్ణదేవరాయలు. కాని ఆయన వెనుక పరమ మాహేశ్వరుడు తిమ్మరుసున్నాడు. విద్యారణ్య ప్రభువే ఉన్నాడు. కాగా వైష్ణవం 'భోగ'మతం, శైవం ఒక్కటే 'త్యాగ,' మతం. ఇదికూడా సశక్తికమయితే తంత్రమయిపోతుంది. ఈ శక్తికి మరోపేరే వైష్ణవం' కాని పలనాటి వీరులందరిలోనూ ప్రాణాన్ని తృణంగా త్యజించి ధర్మాన్ని నిర్వర్తించాలన్న 'వ్రత' దృష్టి వుంది. ఈ లక్షణం వైష్ణవంలో ఎక్కడుందో మృగ్యమే. అలాగే కాయకమే కైలాసమన్న దృష్టి ఉన్న కర్షక శ్రామికులు ఈ వీరులందరూ. భోగులుకారు.

> అసలు వీర శైవంలో ప్రధానమయిన విషయం 'వీరవ్రతం,'
> 'వీరవ్రత సహాయోగాద్వీరశైవమితి స్మృతమ్'
> (చంద్రజ్ఞానాగమం)[8]

అన్యదేవతా తిరస్కారణమని మత పరంగా చెప్పబడ్డ విషయం రాజధర్మరీత్యా 'వీరధర్మపాలనం'. అంచేతే 66 మంది పలనాటి వీరులు ధర్మపక్షం అవలంబించి మలిదేవుడిని సమర్థించారు తప్పా భోగాను రక్తి ఉన్న నలగామునిని ఆశ్రయించలేదు. అదే ఇక్కడ వీరవ్రతం.

ఈ వీర వ్రతానికి ప్రతీకగా పుట్టినపేరు 'బ్రహ్మన్న. కాబట్టి 'మానస సరోవరం' లాగా ఇది కూడా చరిత్రచక్షువుకు అందే అంశంకాదు. అందుకే వీరుడు శివత్వప్రాప్తిని ధ్యేయంగా బ్రతుకుతాడు. అది శివుడికున్న అద్వితీయమైన శక్తి ప్రసరణవల్ల వీరుడిలో కలిగే అద్భుత స్పందశక్తిలో వుంది. అందుకే కథల్లో ఎక్కడ చూచినా 'బ్రహ్మన్న'—స్పందాత్మకంగా సర్వే సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. అంత యుక్తిపరురాలు నాగమ్మకి భయమే. నలగాముడూ అదురుతాడు.

లెంకపోతన్న లాంటి భీరువూ; బాలగోపన్న లాంటి అమాయకుడూ—కత్తిబట్టి సమర రంగంలోకి దూకి విచిత్ర సమరం సాగించారు. ఆశక్తి వాళ్ళకి ఎక్కడి నుంచి వచ్చింది ! కేవలం బ్రహ్మన్న చేతి స్పర్శ గా కథ చెబుతోంది. దాన్నే వీరశైవం 'శక్తిపాతం'గా గుర్తించింది. దీనివల్ల ఆయా వీరులందరికీ 'శివైక్యం' సంఘటించింది. అందరూ లౌకికపరిభాషలో - చచ్చిపోయారు. కాని వీరులు - వీర పత్నులు - మాడచి మాంచాల వంటి కన్నెపడుచులూ - ఆనాడు' దాన్ని 'చావుగా' అనుకోలేదు. వీరధర్మంగా పరిగణించారు. ఈ స్పృహ శైవంలోనిది తప్పా వైష్ణవంలో లేదు.

అంచేత పలనాటి 'వీరు' లందరూ 'శివోఽహం' సూత్రానికి భాష్యాలు. మరి నాగమ్మ కూడా శివాలయం కట్టించుకొంది. తంబళ్ళ పెద్ది కూడా శివభక్తుడే (తంబ=శైవ; నంబి=వైష్ణవ)—కాని వారు 'వీర వ్రతులు' కారు—ఆచరణలో.

మరో విషయం బ్రహ్మన్న అన్ని జాతుల్ని - మతాల్ని - మనుషుల్ని - అద్వైతంగాచూడటం. ఈ దృష్టిని మొదట శైవం కల్గించింది. వైష్ణవం భక్తిద్వారా దాన్ని మరొక స్థాయికి చేర్చింది.

ఇక శైవ ఆచార ప్రతిబింబనం - ఈ కథలో నిబిడంగా కనిపిస్తుంది. బ్రహ్మన్నలు - ఏ కథల్లో కనిపించినా (బొబ్బిలి బ్రహ్మన్న కల్పన కూడా పలనాటి బ్రహ్మన్నను నమూనాగా కలిగించే) మాహేశ్వరుడుగానే దర్శనమిస్తాడు. పలనాటి కథలోనే పచకుల బ్రహ్మయ్య ఉన్నాడు. అసలు బ్రహ్మయ్య- అన్న పేరిట శివశరణులున్నారు. (కిన్నర బ్రహ్మయ్య) తప్పా వైష్ణవు లెక్కడాలేరు.

ఇంకా కల్లిదేవుడు, మలిదేవుడు, రాచమల్లు, విద్యలమ్మ ఈ పేర్లలో శైవం - అందులోనూ ప్రధానంగా 'శ్రీశైలం'లోని మల్లికార్జునస్వామి కనిపిస్తారు. అంతే కాకుండా అంతర్వేదిగాని కథ ఒకటుంది. అంతర్వేది సుప్రసిద్ధ శైవక్షేత్రమే. అనుగు - నలగామ - నాగమ్మ - అన్న పేర్లు కూడా శివసంబంధంగానే కనిపిస్తున్నాయి.[9]

అందువల్ల శ్రీనాథుడు రాసిన ఈ పద్యానికి సరైన వ్యాఖ్యానం చెప్పుకోవాలి.

> ఆరువెల్లి నాయురాలి దుర్మంత్రంబు
> కోడి పోరు చాపకూటి కుడుపు
> ప్రథమ కారణములు పల్నాటి యేకాంగ
> వీర పురుష సంప్రహారమునకు
>
> (క్రీడాభిరామం. 119)

ఈ ఏకాంగ వీర పురుష సంప్రదాయం - అంగ : లింగ విషయ చర్చ అంతా శైవ సంబంధం కల్గిందే.[16] అంగుడు – మానవుడు. భవపునర్భవాలు కల్గినవాడు ఏకాంగవీరుడు. శివశరణుడు. మృత్యువును తరించిన వీరుడన్న మాట.

> కులము దైవతంబు గురిజాలగంగాంబ
> కలని పోతులయ్యచెలిమికాడు
> పిటికి కండలేని యఱువది యేగురు
> పల్లెనాటి వీరబాంధవులకు
>
> (క్రీడాభిరామం 118)

ఇక్కడున్న పోతులయ్య - వీరపోతరాజు - వీరభద్రుడు - శైవ సంబంధ దైవతమే. రాచగావు కథలో – భూతరాట్ స్తంభాన్ని కల్యాణి నుంచి తరలించినపుడు వీరులు పోతులయ్యకు బలులిచ్చారని కథ.

వైష్ణవ తత్త్వాన్ని నిరూపించే సందర్భాలు ఏవీ కనిపించటం లేదు.

సూచికలు

1. చూ. పలనాటి వీరచరిత్ర [పదకావ్యము] పింగళి లక్ష్మీకాంతంగారి పరిష్కరణ విశాలాంధ్ర ప్రచురణ : 1961 పు. 1–47
2. చూ. 'తెలుగు జానపదగేయ సాహిత్యము' బిరుదురాజు రామరాజు (సిద్ధాంత వ్యాసం) స్వీయప్రచురణ : 1958. పు. 192.
3. చూ. తెలుగు వీరగాథాకవిత్వము (రెండవ సంపుటము : శక్తికథా చక్రము - పలనాటి వీరకథాచక్రము, తంగిరాల వేంకట సుబ్బారావు : (సిద్ధాంతవ్యాసం) స్వీయప్రచురణ. 1983 పు. 56-61 & 105-300.
4. చూ. పై గ్రంథం పు. 165.
5. చూ. పై గ్రంథం పు. 283-284.
6. చూ. 'బసవేశ్వర వచనాలు : సమగ్రసమీక్ష', బాదాలరామయ్య (సిద్ధాంత వ్యాసం) తరళబాలు జగద్గురు విద్యాసంస్థ సిరిగెరె 1977. పు. 1–497.
7. చూ. 'చాళుక్యచోళులు' (వ్యాసం) మల్లంపల్లి సోమశేఖరశర్మ తెలుగు విజ్ఞాన సర్వస్వము. సం. 1.
8. చూ. బాదాలరామయ్యగారి పై గ్రంథం. పు. 335.
9. చూ. పై గ్రంథంలో కార్తీకశుద్ధపూర్ణిమ (పు. 41); నాగాంబ అన్న పేరు (పు. 92), బిజ్జలుని విషయం (పు, 130), కిన్నర బ్రహ్మయ్య (పు. 138). కామ – సంగమేశ్వర (పు. 143), కల్లిదేవ అన్న శివనామం (పు. 167), బిజ్జలుని కూతురు సిరియాదేవి (పు, 169) రాక్షస సంవత్సర విషయం (పు. 246) పానుగంటి ప్రసక్తి (పు. 257), వెలనాటి చోళుల ప్రసక్తి. సబ్బాంబిక (పు. 259), యూప స్తంభం - శివలింగం (పు 302), కాయకష్టంతో బ్రతకటం (పు.473) మొదలైన అంశాలు చాలా ప్రధానంగా ఈ కథలో అన్వయిస్తాయి.
10. చూ. అంభవేత్వరమం బ్రహ్మతత్పరం తత్పరాయణమ్
 లింగస్థల మితి ప్రాహుః అంగతత్త్వవిశారదా :
 (అనుభవ సూత్రం 4-3)

పై సూత్రాన్ని వివరిస్తూ రామయ్యగారు ఇలా రాస్తున్నారు.

'అం అనగా పరబ్రహ్మము. గం అనగా తదభిముఖముగా పయనించు జీవుడని యందురు. శివాభిముఖముగా పయనించు జీవునకు అంగుడని పేరు. (పు. 322)

'ఏక' శబ్దం - చైతన్య శక్తితో మానవుడికున్న అవినాభావతకు సంబంధించిందిగా కనిపిస్తోంది అనుభవసూత్రమే ఇలాకూడా చెబుతోంది.

> స్వశక్తి క్షోభ మాత్రేణ స్థలం తద్ద్వివిధం భవేత్
> ఏక లింగస్థలం ప్రోక్త మన్యదంగ స్థలం స్మృతం '2-10'

క్షోభ-ష్టుప్-ష్టుభ్-స్తోభ(స్తోక)శబ్దాలు సృజనాత్మక స్పందాన్ని (ఇనిషియల్ స్ట్రెస్-అని జాన్ ఉడ్‌రాఫ్ పరిభాష) - వ్యక్తీకరిస్తాయి- అది శివమానవుల్లోని సమాన ధర్మం. ఏకాంగ వీరులుగా చెప్పబడ్డ వారు- అలాంటి స్వస్పందిత మనోధర్మం ఉన్నవారు. అందుకే క్రీడాభిరామంలోనూ, రామప్పదేవాలయంలోనూ- మనకు అక్షర రూపాన్ని పొంది అభినయ మూర్తులుగా సాక్షాత్కరిస్తారు. (చూ. నటరాజ రామకృష్ణ 'పేరణి' తాండవం మీద రాస్తూ పలనాటి వీరుల వీరవృత్తమే ప్రేరణికి మూలమంటున్నారు.)- ఏకవీర అని శక్తికి నామాంతరం. ఈ ఆరాధనా విశేషంతో 'ఏకాంగవీరు'ల సంప్రదాయాన్ని కలిపి చూసుకోవాలి. ఈ కథలోని శీలమ్మ, ఐతమ్మ, మాంచాల, మాచలి ప్రభృతులందరు ఏకవీరలే. అసలు నాయకురాలు నాగమ్మకూడా ఏకవీరే- వ్యతిరేక ప్రేరణదిశలో. వీరులందరూ ఏకాంగులే.



గబగబా నడుస్తున్నాడు శాస్త్రి. నది వొడ్డు ఇసుకను అతని అడుగులు 'సర్‌సర్'న కోస్తున్నాయి. పెద్దపెద్ద అంగలు వేస్తున్నాడు. చెమట నుదుటి మీంచి కంఠం మీదికి చారిక కట్టి జారుతోంది. పరుగు లాంటి నడకతో భుజమ్మీది తుండు గుడ్డ వాసిలితే — చేతి పిడికెటితో సర్దుకొన్నాడు.

ఎవరో చెప్పారు—

ధర్మకర్త రామనాథంగారు చనిపోయారని ! దహనం చేసి కొడుకులు, అల్లుళ్ళు, చుట్టాలు, పక్కాలు చాలామంది చావురేవు దగ్గరకి చేరారనీను ! అది అశుభవార్త ! అయినా అది శుభవార్త శాస్త్రికి, విన్నదే తడవుగా ఆగ మేఘాల మీద బయల్దేరాడు.

గోదావరి మీద ఎండ తీక్షణంగా ఉంది. గాజు కెరటాలలో ఎండ మెరుస్తోంది.

శాస్త్రికి నలభై ఏళ్లుంటాయి. సన్నగా, పొడవుగా ఉంటాడు. కాల్చి తీసిన గజం బద్దలా నల్లగా ఉంటాడు. మూడు మూర్లగావంచా, మెళ్లో యజ్ఞోపవీతం అతని వొంటి నున్న ఆస్తి. ఆ వేళ అలా ఒంటరిగా నడవడం వల్ల దొంగభయంలేదు. కాకపోతే ఆకలి భయం

అతన్ని పీడించేస్తోంది. రాత్రి పస్తు పడుకొన్నాడు. ఉన్న అటుకుల్ని ఇంత మజ్జిగనూ పిల్లలకి పెట్టి భార్య గాయత్రి కూడ అతనితో పాటే అతనిలాగే పడుకొంది ఓ రాత్రి వేళ—

"ఆకలి వేస్తోంది" అని శాస్త్రి అంటే కంచుగ్లాసుతో గోదావరోదకం తెచ్చి ఇచ్చింది. కడుపునిండుగా గోదావరే! తల్లి గోదావరి చల్లబరిచింది. తెల్లారి లేచేసరికి గోదావరి కూడా అరిగి, కరిగిపోయింది.

పిల్లలిద్దరూ బడికి వెళ్ళిపోయారు. వీధి అరుగు మీద కూర్చుని జంధ్యాలు వొడుకుతున్నాడు శాస్త్రి. చేతుల్లో శక్తి లేకపోయినా తెచ్చుకొంటున్నాడు. కళ్లు తిరుగుతున్నాయి. కళ్ళ ముందు గాయత్రి తిరుగుతోంది.

"బేరాలా" అడిగాడు.

"లక్ష వొత్తుల నోము చేస్తానని వెంకుమాంబ అంది. వొత్తుల్ని చేసి ఉంచమంది. ఇంకా రాలేదు." అందామె.

"బేరం ఎంతకి"

"పాతిక వరహాలు"

"నూరు రూపాయిలే" అన్నాడు. ఆశగా నవ్విందామె. పచ్చ పచ్చగా - పచ్చనోటుని తలచుకొంటూ.

"అంత ప్రత్తి ఎక్కడిది" అనుమానంగా ప్రశ్నించాడు. గాయత్రి కంగులింది. సమాధానం ఏం చెప్పాలో లిప్తపాటు తోచలేదు. మెల్లిగా గొంతు పెగిలించుకొని—

"తర్వాత చెప్తాను" అంది. ఆ మాట పూర్తికాకముందే వెంకుమాంబగారి అబ్బాయి వచ్చాడు.

"అమ్మ బయట కూర్చుంది. నోము పదిరోజుల తర్వాత చేస్తానని, వొత్తుల్ని భద్రంగా ఉంచమని చెప్పింది" అని వెళ్లిపోయాడు.

అప్పుడు

"ఈ పూటా అదమానమే అన్నినూ" నవ్వుతూ అన్నాడు శాస్త్రి. గాయత్రి నవ్వలేదు. కొంగుతో కళ్లను తుడుచుకొంటూ నట్టింట్లోనికి వెళ్ళిపోయింది. గోదావరి పాయకట్టి ప్రవహిస్తోంది. ఆమె కళ్లల్లో?

శాస్త్రి జంధ్యాలను ముడులు వేసి వేరు చేస్తున్నాడు. మూడు ముళ్లు వేసిన వాటిని వడుగ జంధ్యాలని, అయిదు ముళ్లు వేసిన వాటిని పెళ్లి జంధ్యాలని విడదీస్తున్నాడు. వాటిని లెక్క కట్టడం కూడ పెద్ద పరిశ్రమగా ఉందతనికి.

నీరసంగా ఉంది.

ఆకలిగా ఉంది,

ఎండ మొహాన్ని కొడుతున్న వేళ—

ఎవరో చెప్పారు—

ధర్మకర్త రామనాథం గారు చనిపోయారని, దహనం చేసి కొడుకులు, అల్లుళ్లు చుట్టాలు, పక్కాలు చాలా మంది చావురేవు దగ్గరకి చేరారనీను!

అంతే!

చేతి గుప్పిళ్ల నిండా జంధ్యాలు తీసుకొని ఉరుకులు పరుగులు పెట్టాడు శాస్త్రి.

వాకిరేవు దాటాడు.

పశువుల రేవు దాటాడు.

స్నానాల రేవు దాటాడు.

చావు రేవు దగ్గరకి నడుస్తున్నాడు.

అల్ల డొంక మాటున - అదిగదిగో ఆదే చావురేవు! అక్కడి గోదావరి హోరు చెవిన సోకుతోంది. దహన క్రియలు చేసిన తర్వాత ఊరికి అటు వేపుగా పల్లంగా ఉన్నా గోదావరిలో మైల స్నానాలు చేస్తారు జనం. అందువల్ల దానికి 'మైలరేవు' అని పేరు. అత్త ఆరళ్లు తట్టుకోలేని కోడళ్లు, భర్తను భరించలేని భార్యలు, భగ్న ప్రేమికులు, అనాథలు... ఆ కోనలో ఎందరెందరో అదే రేవుని చావు కోసం కౌగిలించు కొంటారు. అందుకని ఆ ప్రదేశానికి 'చావురేవు' అని మరో పేరు!

శాస్త్రి చావు కోసం అక్కడికి పరుగులేయడం లేదు. బతకాలనే కోరికతోను, నమ్ముకొన్న వాళ్లను బతికించాలనే ఆశయం తోనూ పరుగులీస్తున్నాడు. తనవల్ల ఓ మనిషి బతుకుతాడని తెలిసి కాటోలు సంతోషంగా చావురేవు కెరటాలుగా ఎగిసి పడుతోంది. ఆ కెరటాల్లో రామనాథంగారి అయిన వాళ్లంతా ముక్కు మూసుకొని మునిగి తేలుతున్నారు. వాళ్లంతా దూరంలో బొమ్మల్లా కన్పిస్తున్నారు.

మెత్తమెత్తని జంధ్యాలు శాస్త్రి చేతుల్లో నందివర్ధనం పూవుల్లా నలిగి పోతున్నాయి. తెలతెల్లని సీతాకోక చిలుక రెక్కల్లా చిమిడి పోతున్నాయి. రెండు గుప్పిళ్లనిండా కనీసం పాతిక పైగానే జంధ్యాలున్నాయి. తరతరాలుగా అతని వంశం అంత మృదువుగా జంధ్యాలను వడకడంలో నైపుణ్యతను సంతరించుకొంది. అతని తాత అతి చిన్న పొడుం కాయలో జంధ్యం అమరేటట్టు వడికి తయారు చేసేవాడు.

తండ్రి పేరుకనగ కాయలో నిలిచేటట్టు తయారు చేసేవాడు. శాస్త్రి అంతటి ప్రతిభను పొందలేక పోయినా వంశం పేరు ప్రతిష్టలను నిలుప గలుగుతున్నాడు.

మళ్లలేవు. మాన్యాలులేవు. కులవృత్తి జంధ్యాలను వదక్షడమే! ఆడవాళ్లు వొత్తులు చేస్తారు. మగవాళ్లు జంధ్యాలు వడుకుతారు. సంప్రదాయం మనగలుగుతూంటే -అప్పుడప్పుడూ నోటికి నాలుగు వేళ్లూ పోతున్నాయి. అలా పోని రోజున ఊరు విడిచి పోదామంటే మరో వృత్తి చేతకాదు. అందుకే—

గోదావరీ తీరాన్ని—

అగ్రహారాన్ని—

విడిచి పెట్టడు శాస్త్రి.

అతను నడుస్తున్నాడు. అతనిపొట్ట మొగలి పొత్తులా మెత్తగా ఉంది. రెండు ముడతలు పడి చుట్టుకొని నిద్రిస్తూన్న నాగులా ఉంది. రాయి విసిరి కొడితే ముడతలు పాము చెదిరినట్టు- నడుస్తుంటే అతని పొట్ట సాగుతోంది,

ఆకలవుతోంది.

అణుచుకొంటున్నాడు.

నిస్సత్తువుగా ఉంది,

నడుస్తున్నాడు. చావురేవు దగ్గర పడుతోంది. అక్కడి మనుషుల్ని, హంగామానూ చూస్తుంటే చంపుకొన్న కోరికలను తట్టి లేపాలనిపిస్తోంది.

శాస్త్రికి పదేళ్లప్పుడు చాలా కోరికలు ఉండేవి. ఇరవై ఏళ్ల వయసు నాటికి ఆ కోరికల్లో సగానికి సగం తగ్గించుకొన్నాడు. ముప్పై ఏళ్లనాటికి మిగిలిన సగంలో సగభాగం కోరికలు తీరనివిఅని నిర్ణయించుకొన్నాడు. నలభై ఏళ్ల నాటికి కోరికలను చంపుకొన్నాడు. అయినా....

చింత చిగురు పప్పూ అన్నంలో సువర్ణరేఖ మామిడి పండు నంజుకు తినాలని, పాపకి పట్టులంగా వేసి, పూలజడ కుట్టించాలని, బాబుకి గాలి పటం కొనిపెట్టి — గోదావరి ఒడ్డున ఆకాశ మార్గాన అది పయనిస్తూ నక్షత్రాల్ని తాకుతూంటే, బాబు గంతులేస్తూంటే చూడాలని,

ఆ రాత్రి —

పాప, బాబూ పడుకొన్న వేళ —

వెన్నెల వెండి కంచంలా నడి వాకిలిలో మెరుస్తుంటే—

జంధ్యాన్ని గాయిత్రి మెళ్లో కూడ వేసి, వళ్లోనికి లాక్కొని తాతల నాటి బూరుగు దూది పరుపు మీద

వెన్నెల రేఖ ఆమె క్రింది పెదవి లో త్రలో జీరాడుతున్న పుడు ముద్దు పెట్టుకోవాలనీ...

చిన్న చిన్న కోరికలు ఉన్నాయి అతనిలో !

మొదటి రాత్రి గాయిత్రిని చాలా ఆనందంగా, సంతోషంగా భావించాడు. తర్వాత్తర్వాత అనేక సార్లు ఆమె పెదవులతో తన పెదవులు కలిపాడు కాని, ఆ సంతోషం ఆ ఆనందం మళ్లీ మళ్లీ రాలేదు. అంతటి అనుభూతి చెందనూ లేదు. అంతా యాంత్రికం అన్పించేది.

కోరికలు తీరకుండానే చనిపోతానను కొన్నాడు. తీరవని తెలిస్తే పందల జంధ్యాలని తాడులా పేని ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకొందామని కూడ అనుకొన్నాడు. ఇన్నాళ్లగా చచ్చిన కోరికలను తట్టి లేపలేదు. లోలోపల నిద్రపుచ్చాడు ఇప్పుడెందుకో కోరికలకు ప్రాణం వస్తూందని పిస్తోంది. పరుగులు తీస్తున్నాయి.

శాస్త్రికి ఉత్సాహం కలిగింది. ఆకలిని మరిచిపోయాడు. పరుగు తీశాడు. పిచ్చి కోరికలు అతన్ని పరవశుణ్ని చేస్తున్నాయి.

" రావోయ్ ! రారా" అన్నారు గట్టు మీది పంతుళ్లు.

" వచ్చే వచ్చే " అన్నాడు శాస్త్రి.

"కబు రందిందా " అడిగాడు.

అందింది అన్నట్టుగా తలూపాడు.

" చూడండి బాబూ ! మైల జంధ్యాలని గోదావరికి అర్పించేయండి ! శాస్త్రి తెచ్చిన నూతన యజ్ఞోప వీతాలను ధరించండి " నదిలో మునకలేస్తోన్న వారిని ఉద్దేశించి అన్నారు పంతుళ్లు. చెప్పినట్టుగానే చేశారు వాళ్లు.

శాస్త్రి పసుపుతో పవిత్రం చేసిన జంధ్యాలను పేరుపేరునా అందించాడు. ముప్పైమంది! జంధ్యానికి రూపాయి లెక్కన ముప్పై రూపాయలిచ్చారు.

"అన్ని ధరలూ పెరిగాయి బాబూ" అన్నాడు శాస్త్రి సన్నగా నవ్వుతూ, మరో అయిదు రూపాయలిచ్చారు.

"సంతోషం" అన్నాడు.

వెళ్లిపోతూ వాళ్లు —

"మళ్లీ దశదిన కర్మనాడు రావాలి సుమా" అన్నారు శాస్త్రితో.

"తప్పకుండా" అన్నాడు.

మూడుపదులు. ఒక అయిదు రూపాయల నోటు వెరసి నాలుగు సరిక్రొత్త నోట్లు శాస్త్రి చేతుల్లో పేకముక్కల్లా విచ్చుకొన్నాయి. తనివితీరా చూసుకొన్నాడు. సరదా వేసింది. నోట్లని పెదవుల మధ్య నుంచి- గోదావరిలోనికి దిగి, దోసిళ్లతో నీటిని తీసి జల్లుతూ గోదావరిమీద నీటి ముగ్గులు పెట్టాడు. సంతోషం పట్టలేక పోతున్నాడు. కోరికలు తీరినట్టనిపించింది. గట్టు మీదికొచ్చి ఇసుకలో పాదం జొనిపి బలంగా తన్నాడు. ఇసుక తల్రబాలులా లేచి తుళ్లింది.

'హాయి! హాయి' అనుకొన్నాడు. గోదావరి అతని చిలిపి చేష్టలకి కిలకిలా నవ్వుకొంది. ఇంటికి బయల్దేరాడు.

గాయత్రి ద్వార బంధాన్ని ఆనుకొని వీధిలోనికి చూస్తోంది. బడి నుండి వచ్చి పిల్లలిద్దరూ అరుగుమీద అష్టాచెమ్మాలాట ఆడు కొంటున్నారు.

"ఆకలేస్తోందే" అంటే—

"కాసేపు ఆడుకోండి! నాన్నొస్తే అన్నం వండి పెడతాను" అంది.

పాప గవ్వలు విసిరింది.

ఒంటి కన్ను పడింది.

దగ్గరకొచ్చిన శాస్త్రి కన్నుకొట్టాడు. చూసి గాయత్రి తుళ్లి పడింది. సిగ్గుపడింది,

అతని తుండు గుడ్డలో సువర్ణరేఖలు ఉన్నాయి. చింతచిగురు ఉంది. బియ్యం, పప్పుకు కావాల్సిన సరంజామా అంతా ఉంది. మూటని భుజమ్మీద వేసుకొని ఓ చేత్తో పట్టుకొన్నాడు. మరోచేతిలో మల్లెపూలు. గాలిపటం ఉన్నాయి, ఆ అవతారంలో తండ్రిని చూసి పిల్లలిద్దరూ—

"నాన్నొచ్చే! నాన్నొచ్చే" అని చుట్టూ చేరారు,

"పదండి" ఇంట్లోనికి నడిచాడు శాస్త్రి. చోద్యం చూస్తోంది గాయత్రి.

మూటని క్రిందికి దించి మఠం వేసుకొని కూర్చున్నాడు. ఓ తొడ మీద పాపని, మరో తొడమీద బాబుని కూర్చోపెట్టుకున్నాడు.

"మధ్యాహ్నం బడికి పోనక్కర్లేదు" అని ఇద్దరి చెంపల్ని ముద్దిడాడు. పిల్లలు చప్పట్లు చరిచాడు.

"అదేం" గాయత్రి విస్తుపోతూ ప్రశ్నించింది.

"అదంతే" అన్నాడు శాస్త్రి. ఆమె మరి మాటాడలేదు. భర్తలో కొట్టొచ్చినట్టు కన్పిస్తోన్న క్రొత్తదనానికి నవ్వుకొంది. మూట విప్పింది.

"మామిడి పళ్లు" అరిచారు పిల్లలు.

"మామిడి పళ్లే! అయితే ఇప్పుడెవరూ తినకూడదు. పప్పూ అన్నంలో నంజుకొందాం" అన్నాడతను.

సరేనన్నారు.

"గాయత్రీ! పాపకి పట్టులంగా వేసి పూలజడ కుట్టవే" అన్నాడు. ఇప్పుడా? ! అన్నట్టుగా కళ్లెత్తి చూసిందామె.

"అవునే! ఇవాళ నాకెందుకో పాపని పట్టులంగాలో, పూల జడతో చూడాలనిపిస్తోంది."

కాదనలేదామె.

పాప మల్లెపూలను ఎగరేసి పట్టుకొంటోంది.

బాబు గాలిపటాన్ని గుండెకి హత్తుకొని కూర్చున్నాడు.

"దాన్ని ముస్తాబు చేసి - వంట వండి ఉంచు! నేనూ బాబూ గోదావరి ఒడ్డున గాలిపటం ఎగరేసుకొని వస్తాం" లేచాడు శాస్త్రి. బాబుకి పట్ట పగ్గాలు లేకపోయాయి.

"ఇంత ఎండలోనా" అడిగింది గాయత్రి.

"ఎగిరే పటానికి గాలి చల్లదనం, ఎగరేసే మాకు తల్లి గోదావరి చల్లదనం ఉంటాయి లేవోయ్" అని వెళ్లిపోతూ గూటిలోని గుప్పెడు వడక జంధ్యాలను తీసుకొన్నాడు

"ఎందుకో" గాబరా పడింది.

"గాలిపటానికి"

"ఒక్కొక్కటీ రూపాయి" గుర్తు చేసింది.

ఖాతరు చేయలేదతను. బాబుకి సరిజోడులా బయటకు పరుగుతీశాడు. నది వొడ్డును చేరాడు. జంధ్యాలన్నీ ముడివేసి పటాన్ని పైకిలేపాడు. గోదావరి మీద గాలిపటం పావురంలా ఎగురుతోంది. మరి కాసేపటికి కనిపించని నక్షత్రాన్ని తాకిందో లేదోగాని గాలిపటం నక్షత్ర మయిపోయింది. మిణుకు మిణుకు మని కన్పిస్తోంది. ఆకలి మాట దేవుడెరుగు! ఆనందలో శాస్త్రి, బాబూ ఆకలిని మరిచిపోయారు. గాలి దాపుకి పటాన్ని సరిజేస్తూ చాలా సేపు ఆడారు. చమటలు పట్టాయి. అమ్మ, అమ్మతో పాటు ఆకలి గుర్తొచ్చి—

"వెళ్ళిపోదాం" అన్నాడు బాబు. శాస్త్రి కాదనలేదు. పటాన్ని క్రిందికి దించి నదిలో తలారా స్నానం చేసి వచ్చేశారు.

గుమ్మంలో పాప !

పట్టులంగాలో, పూలజడతో —

ఎత్తుకొని ముద్దాడాడు శాస్త్రి. పైకెగరేశాడు. ఇంటి నిండా పరవళ్లు తొక్కిన గోదావరిలా పాప నవ్వు.

భోజనాలు అయ్యాయి.

చీకటి పడింది.

ఆడాడి ఉన్నారేమో పిల్లలిద్దరూ తొందరగానే నిద్రపోయారు. శాస్త్రి చంద్రుని కోసం, గాయత్రి కోసం చూస్తున్నాడు. పెరటిలో అంట్లు కడుగుతూందామె.

చంద్రుడొచ్చాడు.

గాయత్రొచ్చింది.

కాలుమీద కాలు వేసుకొని వెల్లకిలా పడుకొన్న శాస్త్రిని చూసి నవ్వింది. వెన్నెల చంద్రుడు అతని కనుపాపల రెండిటా ముత్యాల్లా మెరుస్తున్నాడు.

"కొత్తగా ఉంది! ఇల్లో పండుగలా ఉంది" అంది అతని ప్రక్కన కూర్చుంటూ. కళ్ళ చివర్లతో చూసాడామెను.

'ఏమిటి విశేషం' అన్నట్టుగా కళ్ళెగ రేసిందామె. నవ్వుతూ జంధ్యాన్ని ఆమె మెడలో కూడా వేసి ముందుకు లాగాడు శాస్త్రి. తూలింది గాయత్రి అతని గుండెల మీద పడింది. ముక్కు ముక్కూ రాసుకొన్నాయి.

కొనదేలిన ముక్కు, నునుపైన చెంపలు, పెద్ద పెద్ద కళ్ళు రేగిన ముంగురులు .... గాయత్రిలో అందం పోలేదనిపించిందతనికి. చేతులు చుట్టి బంధించాడు. ఆమె బెట్టు చూపలేదు. గుట్టుగా వొదిగి పోతోంది.

"పరుపు అన్నాడు మెల్లిగా చెవిలో మంత్రోపదేశం చేసినట్టు గాయత్రి విన్పించుకోనట్టే పూరుకొంది.

"నిన్నే ! పరుపు" అన్నాడు మళ్ళీ. ఆ మాటకి గాయత్రి వణికింది. వణుకును కప్పి పుచ్చుకొంటూ సర్దిచెప్పే ధోరణిలో —

"ఇదెప్పందుకు "అంది.

"పరుపు మీదే పరాచికాలు" అన్నాడు నవ్వి. భయపడిందామె. రహస్యాన్ని దాచి పెడుతున్నట్టుగా దిక్కులు చూసింది.

"అయినా అంత పెద్ద పరుపుని నువ్వు తేలేవులే ! నేనే తెచ్చుకొంటాను" అని లేచాడు శాస్త్రి. గుండెల మీద చేతులుంచుకొంది గాయత్రి. నడిచి నట్టింట్లోనికి వెళ్ళాడు. పందిరి మంచమ్మీది పరుపుని చూశాడు. అవాక్కయి పోయాడు.

పీక్కు తిన్న శవంలా పరుపు !

ఇంకిపోయిన గోదావరిలా పరుపు !

అక్కడక్కడా తప్ప అందులో దూది లేదు.

దూది అంతా ఏమయిపోయింది?

శాస్త్రికి అంతుపట్టలేదు. కోపం వచ్చింది. కళ్ళెర్ర చేసుకొన్నాడు. ఇటు తిరిగాడు. హరికెన్ లాంతరు వెలుగులో —

కుప్పలు పోసిన చెదపురుగుల్లా వొత్తులు!

లక్ష వొత్తులు ! కన్పించాయి. కళ్ళంట నీళ్ళొచ్చాయి. శాస్త్రికి వచ్చిన కోరిక బతకలేదు! బతకలేదు! కోరిక అనుభూతి లేదు! కాలేదు! నిద్రకి సుఖం తెలీదు ! ఆకలి రుచి ఎరుగదు !

అనుకొన్నాడు. గిర్రున వెను తిరిగి గాయత్రి దగ్గరికి వచ్చాడు. అంతలేసి కళ్ళతో వింత వింతగా చూస్తున్న ఆమెను ఏమీ అనలేదు. పొదివి పట్టుకున్నాడు,

సాగర సంగమం కోసం గోదావరి పరుగులు తీస్తోంది. ఆ పరుగులో గమ్యాన్ని చేరుకోవాలనే ఆకలి తపన ఉంది.

* * * * *

# ప్రియురాలు

## "విశ్వన్"

అదుగో — నా ప్రియురాలు !
ఆమె ముగ్ధమనోహర సౌందర్యానికి–
నేనెప్పటికీ దాసుడను ....
ఆ అద్భుత రాశిని,
ఆ అనంత శోభను,
తిలకించి పులకిస్తున్నందుకు -
నేనెంతో అదృష్టవంతుడను ....
సాటిలేని ఆ అనంత లావణ్యం !
ఎల్లప్పుడూ నా ఆరాధ్య దైవం !!
ఇప్పుడిప్పుడే మురిపిస్తున్న ఆ అందం-
ఇంతకు పూర్వం నేనెరుగనిది;
అయినా కాలానుగుణంగా మారుతూ,
ఆమె అద్భుత సౌందర్యానికి-
ఇంకా ఇంకా శోభను చేర్చుకుంటూ-
నన్ను పరవశింప జేస్తుంది !
నా మనసును పరవళ్ళు తొక్కిస్తుంది !!
ఇది ఆమెతో నాకు ఏర్పడ్డ-
ఒక వినూత్న, అద్భుత అనుభూతి !
అయితే, ....
నాకంటే కూడ ఎక్కువ ఆనందాన్ని పంచుకునే
శతకోటి ప్రియులు ఆమెకు ఉండొచ్చు ....
కాని, వాళ్ళలో నేనొకణ్ణి అయినందుకే-
నాకీ పులకరింత !....
అంతులేని ఆమె సౌందర్యాన్ని-
నిష్పాక్షికంగా , -
ఇంకెవరికైనా పంచగలదు !....
అందుకేనేమో !
ఈ సృష్టిలోని అందాలకు-
నేనెప్పుడూ దాసానుదాసుడను !
ఈ అనంతమైన ప్రకృతికి-
నేనొక ప్రియుడను !!

# చీకటి మంచు

## " రఫి "

చలికాలపు చలిమంచు
తెల్లవారని చీకటి రాత్రులు
హైస్కూలు వైరాగ్యం ....
కనుమరుగవుతూన్న తెల్లమంచు
విసుగెత్తిన కాలేజి రోడ్డు ....
తిరుగుతున్న సైకిలు చక్రం
పీక్కుతింటూన్న జ్ఞాపకాలు
అర్థంకాని ఆకలి బతుకు ...
ఎదగని మనస్తత్వాలు-
అదేంటో ? దాన్నేమంటారో ?
సుదూరాన అప్పర్ ప్రైమరీ స్కూలు....
వెళ్ళిపోతూన్న జన 'సందేహం' .... !
రోడ్డుమీద పరిగెత్తే నా లయల చప్పుడు ....
తెరుచుకోని తలుపు ....
అలిసిన చెమట ....
నన్నెవరో వెంటాడుతూ ...
నా కేదో ఆవరిస్తూ ....
నేనేదోఅయిపోతూ ....
నాకే అర్థం కాని పిచ్చినవ్వు
ఏమిటిది .... ఇలా .... ? ....



## డాక్టర్ వేం. నా. శర్మ (వి. ఎన్. శర్మ)

# జర్మనుల - ఎడ్డాకావ్య పరిచయము

ఎడ్డా శార్మణ్యుల (జర్మనులను పూర్వం ఇలాపిలిచేవారు.) ఆదిమ కావ్యము. భాష - శార్మణ్యులు క్రీస్తు శతాబ్దము ప్రారంభములోఅనుదిన వ్యవహారాలకు ఉపయోగించుకుంటున్న గోథిక్ భాషకు సంస్కృతానికి యెంతో అవినాభావము వుండటము గుర్తించవచ్చు. ఆ రోజుల్లో బ్రిటిష్ లంకలవారు కూడా ఈ జర్మను జాతికి సంబంధించినవారే. వారిమాతృభాష కూడా గోథిక్.

కథావస్తువు ఎన్నో వేల సంవత్సరముల క్రిందట ఇప్పటి పశ్చిమ ఆశియాఖండాన్ని రామరాజ్యముగా మార్చి, పరిపాలించిన రాజాధిరాజుల పుట్టు పూర్వోత్తరాల గురించి. ఈ రాజ్యపాలకులు తమ ప్రపంచ మహాప్రస్థాన సందర్భములో ఈ పరిసరాల్లో స్థిరపడిపోయిన భారతీయులు. వీరి ఇష్టదైవము ఇంద్రుడు. ఆ ఇంద్రనామము తోనే ఈ పెద్దలు తమ రాజ్యవ్యవహారాలను చక్కబెట్టుకుంటూ వుండేవారు ఈ సందర్భములో ఈ రాజాధిరాజులను ప్రతిఘటిస్తుండే వర్గమొకటి వుంటుండేది. ఆ వర్గపు ధ్యేయము క్షుద్ర మంత్రతంత్రాలతో లోకాన్ని తమ వశపరచుకొనటమే. వీరికి భారతీయరాజులకు ఘర్షణలు ఉండేవి.

భారతీయుల సామ్రాజ్యాలు పశ్చిమ ఆశియా పరిసరాల్లో అస్తమించడముతోనే, అక్కడి రాజకుటుంబాలు పడమటిదిశకు చారిత్రకులు చెపుతుండే మహాప్రస్థానములో పశ్చిమదిశకు తిన్నగా ప్రయాణమయ్యారు. వారిలో ఒకజట్టు ఉత్తరఐరోపా ప్రాంతాలకు నడిచారు. ఇంకొకజట్టు బ్రిటిషులంకలకు చేరుకున్నది. తమ పూర్వుల పుట్టు పూర్వోత్తరాలను జ్ఞాపకముంచు కొనటానికి ఎడ్డాకావ్యము జానపద రూపములో ఆ కాలములోనే వెలిసింది.

"ఎడ్డా అంటే తెలుసు కుంటావా!" అన్నమాట. కాకపోతే "మీ పూర్వుల పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకొనటానికి ఉత్సాహపడుతున్నావా?" అని.

ప్రాచీన సాహిత్యంలో ఒకనాడు విశ్వవిఖ్యాతి పొందిన కావ్యాలలో ఎడ్డా అగ్రస్థానం పొందింది. పాశ్చాత్య ప్రపంచంలో ఎడ్డా పొందిన పేరు ప్రఖ్యాతులు. అధికృత ఎల్లకాలాలకు సుస్థిరమైనది. యూరప్‌లోని ఉత్తరప్రాంతాలు అనగా స్కాండినేవియన్ దేశాలూ, వీటితో సంబంధం కలిగిన అయిస్‌లాండ్ ద్వీపంలో ఈ కావ్యం బైబిలుగ్రంథానికి వున్నటువంటి ప్రాముఖ్యత పూజనీయత కలిగివుంది. కథావస్తువు స్కాండినేవియన్ పరిసరాలకు సంబంధించినది కాకపోయినా అందులోని పాత్రలూ, వాటి స్వభావాలూ -తమస్వంతముగా భావించి తరతరాలుగా ఉత్తేజితులవుతున్నారు ఆ ప్రాంతపు ప్రజలు.

ఈ గ్రంథానికి అనాదికాలంలో ఎటువంటి నామధేయమూ లేదు. పదిహేడవ శతాబ్దం నుంచీ అక్కడి పండితులు. యీ గ్రంథాన్ని 'ఎడ్డా'గా పేర్కొనటం ఆరంభించారు.

ఈ గ్రంథాన్ని ఏ పేరుతో పిల్చినా చరిత్రకారులకి సులభంగా లభ్యంకాని ప్రాచీన ఆర్య సంప్రదాయాలు యీ గ్రంథంలో ప్రతిబింబిస్తూ వున్నాయని అందరూ వొప్పుకుంటున్నారు. గత మూడు శతాబ్దముల నుంచీ - ఉత్తర ప్రాంతాలకి చెందిన పండితులూ, అనగా స్కాండినేవియన్, జర్మన్ దేశాలకి చెందిన చరిత్ర పరిశోధకులూ ఈ కావ్యాన్ని అన్ని కోణాలనుంచి - పరిశీలన చేయటానికి ప్రయత్నిస్తున్నారు. ఎడ్డాకావ్యంలోని రచనా శిల్పం, ఆ శిల్పానికి కారణ భూతులయిన వ్యక్తులు, తమ పాత్ర చిత్రణకు, రచనా రీతికి ఆదర్శవంతముగా రూపొందుటకు - యీ మానవప్రపంచాన్ని ఒక వేదికగా తీసుకున్నారు - అంతటితో తృప్తి పడక ఈ ప్రకృతికి, మానవ జీవితానికి మూలాధారమైన స్వర్గ నరక లోకాల నుంచి - తమకి కావలసిన ఆధార వస్తువుని, పాత్రలనీ కూడా తీసుకున్నారు. కరుణ క్రోధం, మాత్సర్యం యిత్యాది - మానవ సహజమైన గుణాలని కూడా పొందుపరిచారు. ఇలా దేవమానవ గుణ విశేషాలు - అనాటి వారికి ఎలా అందుబాటులో వున్నాయి? ఎలా ఊహించగలిగారు. అన్న ప్రశ్న యీనాటి సాహిత్యకారులని ఆశ్చర్యపరుస్తూ వుంది. అయితే యిటువంటి ప్రశ్నలూ సందేహాలూ, ప్రాచీనులకి రాలేదు.

మన భారతీయులకి రామాయణ, భారతకావ్యాల్లోని -పాత్రలు ఎలా చిరపరిచితములో, ఉత్తర స్కాండినేవియన్ ప్రాంతీయులకి కూడా ఎడ్డాలోని పాత్రలు అంతదగ్గరివి. ఈ కాలపు కొలబద్దతో, ఆధునిక దృష్టితో ఆనాటి పాత్రల స్వభావాన్ని ఇదమిద్ధమని నిర్ణయించటం సులభంకాదు. ఈ కాలపు పరిశోధకులలో - ఒక శ్రేణికి చెందిన వారికి యీ విషయం తెలుసు కాబట్టి, తమకి - గ్రాహ్యం అవని, అనూహ్యమైన ఘట్టాలని 'చీకటి కోణాలు,గా పేర్కొంటూ,

వాటిని వెల్తురులోకి తీసుకొని వచ్చే బాధ్యతను ముందు తరాలవారికి వదిలి పెడుతున్నారు.

కవులూ, గాయక బృందాలవంటి వారి చేతుల్లో పడి - మూల మాతృక - కొంత వరకూ దెబ్బ తిన్నదని ఇప్పటి పరిశోధకులు ఒప్పు కుంటున్నారు. వీరిలో ముఖ్యంగా ఉత్తర ఐరోపాఖండంలో. విశ్వ విద్యాలయ పండితులు యీ వాదాన్ని పూర్తిగా బలపరుస్తున్నారు. కథావస్తువు స్కాండినేవియా దేశాలకూ, జర్మనీకి సంబంధించినది కాక పోయినా, పరిస్థితుల మూలాన అక్కడికి ఎంతో దూరంలో వున్న అయిస్ లాండ్‌కి వలస పోయినా, గాయక బృందాల వల్ల మాతృ కలో మార్పులూ, కూర్పులూ చోటు చేసుకున్నా, మత శక్తుల ప్రభావం కొంత వరకూ వున్నా, దీనిని ప్రాణ ప్రదంగా చూసుకొనటం చేత, దీని శిల్ప విన్యాసం యథాతథంగా నిల్చి వుందని బల్ల గుద్దినట్లు చెప్పవచ్చు. పంధొమ్మిదో శతాబ్దపు చివరికాలంలో, ఈ యిరవయ్యో శతాబ్దిలో జరిగిన పరిశోధనల వల్ల, పండితులూ, విమర్శకులూ ప్రక టించిన విషయాలలోని సంగతిని స్పష్టం చేశాయి. జర్మన్ భాషలో, స్కాండినేవియన్ దేశాల్లో - ఈ ప్రాచీన గ్రంథం విశ్వవిద్యాలయ స్థాయిలో, పాఠ్య గ్రంథంగా ఆదరింపబడుతోంది.

దీని కావ్య శిల్పం ఉత్తర ఐరోపాకి, అయిస్‌లాండ్‌కి చెంది ఉన్నా దీని పునాదులు తూర్పు ఖండానికి చెంది వున్నాయని అతి సులభంగా చెప్పవచ్చు. ఇప్పుడు ప్రచారంలోవున్న 'ఎడ్డా', కావ్యంలో రెండు భాగాలు వున్నాయి. ఒకటి దేవతలకి సంబంధించింది రెండవది వీరులకి సంబంధించింది. వీర గాథలకి సంబంధించినదాన్ని "వీరుల ఎడ్డా" అంటారు. దేవతల ఎడ్డా - దేవతల ధర్మ సూత్రాలకి వారి జన్మ రహస్యాలకి సంబంధించినది. ఈ కావ్యంలో చిత్రించ బడిన వీరులు ఉత్తర ఐరోపాకి అయిస్‌లాండ్‌కీ చెందినవారనీ, దేవతల ఆదిమస్థానం యిదమిద్ధమని నిర్ణయంగా చెప్పలేనిదనీ ఒక వాదం వున్నది పండిత లోకంలో. ఈ సందర్భంలో ఆనాటి ఉత్తర ఐరోపా ఖండమూ అంటే జర్మను జాతీయులు ఆనాడు ఆక్రమించుకున్న ప్రాంతాలు - అనగా బ్రిటిష్ ద్వీపములూ, హాలాండ్, యిప్పుడు మనం పేర్కొంటున్న బెల్జియం, ఫ్రాన్సు, స్పెయినులోని భాగాలు కూడా వున్నాయన్న మాట. ఈ ప్రాంతాలకి ఈ కథ చెంది వుండవచ్చునని భాషాశాస్త్రజ్ఞుల అంచనా. వీరి వాదాన్ని మనమూ అంగీకరించాల్సి వుంటుంది.

ఇంకా లోతుకి దిగిచూస్తే-ఈ క్రీస్తుశకపు కాలమానాన్ని దాటి, క్రీస్తుకి వెనకకు వేల సంవత్సరాలు వెళ్లి ఎడ్డాని చూడాల్సి వస్తుంది. కట్టుకథలూ. పుక్కిటి పురాణాలూ - అని చెప్పుకుంటున్న ఈజిప్టు, సుమేరియన్ సంస్కృతులు పుట్టింది క్రీస్తుశకానికి పూర్వమే. అనగా యిప్పటికి అయిదారు వేల సంవత్సరాలకి ముందు, యివి లోకానికి ఆదర్శ వంతముగా వుండేవని చరిత్ర పరిశోధకులు, భూగర్భ శాస్త్రజ్ఞులు ఒప్పుకుంటున్నారు. అయితే ఈ నాగరికతలకి కొన్ని వేల సంవత్సరాలకి ముందే - మరి కొన్ని సంస్కృతులు యీ భూప్రపం చాన్ని వుత్తేజపరిచి ఉండాలని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. ఇప్పటి పాశ్చాత్య నాగరికతకు మాతృస్థానం వహించినవి గ్రీసు, రోమన్ నాగరికతలు అని చెప్పే, పెద్దలుకూడా తమ అభిప్రాయాలని మార్చుకుని యింతకంటే అతి పురాతనమైన కాలానికి చెందినది యీ "ఎడ్డాకావ్యం" అని ఒప్పుకొంటున్నారు.

భారతీయులు -తమ నిత్యసంకల్పంలో "జంబూద్వీపే, భరత వర్షే, భరతఖండే" అని పేర్కొంటారు. యీ దేశపు ఎల్లలు దాటి ఎంతదూరములోవున్నా. దీనిని బట్టి జంబూద్వీపము అన్నపుడు ఐరోపా ఆసియా ఖండాలు కలసివున్నాయని మనం అర్థంచేసుకోవాలి. ఇదే గాక కాలమానంలో కల్పాలు, యుగములు కూడా మానవ జాతిలో అంతులేని మార్పులు కలిగించినవని శాస్త్రజ్ఞులు, సత్యా న్వేషులు సూక్ష్మంగా వొప్పుకుంటున్నారు. ఇది మానవ పరిణామ దశలో అనంతమైన చలనం. ఈ చలనాన్ని - యీ పయనాన్ని అంగీకరించి, విశాలదృష్టితో చూసినపుడు "ఎడ్డా" కావ్యంలోని అతి ప్రాచీనత మనకి అవగాహన అవుతుంది. కలియుగమూ, త్రేతాయుగము, ద్వాపరయుగమూ, వీటిని దాటుకుంటూ - భూత కాలంలోకి పయనించి కృతయుగంలోకి అడుగుపెట్టినపుడే మన పంచాం గాన్ని అర్థం చేసుకోగలము. 'ఎడ్డా' కావ్యం నాటి కాలం ఈ కృత యుగానికి కూడా పురాతనమైనది. అని - మనం సులభంగా వొప్పు కోవలసి వస్తుంది, పరిశీలించి చూసినపుడు.

ఈ కృతయుగానికంటే ప్రాచీనమైన కాలంలో, మానవ జాతి యేకాక, కాలగర్భంలో అదృశ్యమైన అట్లాంటిస్ లెమూలియన్ ఖండాలుకూడా లోక కళ్యాణార్థం తమ తమ ప్రాంతాలని నిర్వహించా యని వొప్పుకోవాలి. జలప్రళయంలోనించి బయటపడి భూప్రాంతా లకి మానవ జాతిలో కొందరు జేరుకున్నట్లు శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. ఇలా అప్పుడప్పుడు వచ్చే జలప్రళయాలూ, హిమపాతాలూ, భూకం పాలమూలమున యీ భూప్రపంచ స్వరూపమే ఎంతో మారిపోయింది. ఈ భూమాత తన ఒడిలో తలదాచుకున్న- మానవులని లాలించి- పాలించటముతో తృప్తిచెందక వారిలో అద్భుతశక్తులని ప్రోదిచేయ టానికి తోడ్పడింది ప్రకృతి మాత. ఆ పరిణామదశలోని మంచిచెడ్డలు- రామాయణ భారతభాగవతాదులు,పురాణేతిహాసాలు మనకు తెలుపుతూ వున్నాయి.

అనంతమైన శూన్యంనుంచి - ఈ భూమండలం అవతరించింది. ఆ అద్భుతసృష్టికి శోభనివ్వటానికి జలనిధులూ, పర్వతాలూ, వృక్ష సంపదలూ వెలిశాయి. ప్రకృతి వివిధరూపాలలో దర్శనమిస్తూ - ఆ వివిధరూపాలనుంచి వివిధ నైజములు గల మానవులు, జీవరాసులు జన్మించాయి. రామాయణ - భాగవతాదులలో రాక్షస జాతుల

గురించీ,వారి ఆచార వ్యవహారాల గురించి మన అందరికీ పరిచయమే. రాక్షసులు - అసురులు అని చిత్రింపబడిన వీరూ మానవులే. మానవులకి కాస్త దూరంలో వున్నా వారి ప్రవృత్తిలో తేడావున్నా - వారూ ఆధ్యాత్మిక విషయాల్లో మానవుల కంటే ఒక అడుగు ముందున వున్నవారే ! రాక్షస జాతి కంటే ఆకృతిలో క్రింద శ్రేణిలోవున్న ప్రాణుల గురించి. మన పురాణాలలో అక్కడక్కడ చెప్పబడటం వుంది. అదే కోవలో ఎడ్డాలో ఆ కాలంనాటి జాతులగురించి, వారి వారి ప్రవృత్తుల గురించీ చిత్రించడం జరిగింది. మానవజాతిపై ఆధిక్యత దేవగణాలదే. కాని అప్పుడప్పుడు మానవుని కంటే క్రింద శ్రేణిలో వున్న కొన్ని జాతుల సహాయం కోరటమూ వుంది.అంతే కాదు ఇచ్చి పుచ్చుకోటాలు, క్రింద శ్రేణిలోవున్న ఆర్యులయిన వారికి - తమతో సరిసమానమగు స్థానం యిచ్చి, దేవగణాలలో జేర్చుకోవటమూ కూడా కనిపిస్తుంది.

ఐహిక ఆముష్మిక విషయాల్లో దేవతలెప్పుడూ ధర్మ మార్గాన్నే ప్రబోధిస్తూ వుంటారు. పరిస్థితులు విషమించినా దర్మచ్యుతులు కారు. ఇక ఇతరులకు మంత్ర తంత్రాలు, క్షుద్ర విద్యలూ పరిపాటి. ఆనాటి ప్రపంచం ఒక ప్రాంతానికీ, ఒక బాటకీ చెందింది కాదు. ప్రకృతి వైవిధ్యం - హిమ పాతంలో, సకాల వర్షాల్లో దర్శన మిస్తూండేది. సూర్యరశ్మి కూడా సోకని - మంచు ప్రాంతాల జీవించే వారి జీవన విధానం వేరు. సస్యశ్యామలమై - ఎండవానలకు ఆలవాలమైన సమశీతోష్ణ ప్రదేశాలలో జీవించే వారి జీవన విధానం వేరు. ఈ రెండు ప్రాంతాలవారు - శిల్పకళలో సిద్ధహస్తులు. ఆనాడు నిర్మించిన కట్టడాలు , వారి వారి జీవన విధానాలని ప్రతిబింబించే శిల్ప ఖండాలూ - కాల గర్భంలో కలిసిపోక అవశేషాలుగా నిల్చివున్నవి. ఆనాటి దివ్యచరిత్రను చాటి చెపుతున్నాయి - యివి. ఆ కాలపువారి జీవిత విధానాన్ని, వారి ప్రాచీన చరిత్రను అవగాహన చేసుకొనటానికి - ఈ కళా ఖండాలే మనకు యీనాడు సహాయ కారిగా వుంటున్నాయి.

అంటే - మన 'రామరాజ్యం' అని పిలుస్తున్న ఒకానొక అత్యున్నతమైన ఆదర్శ ప్రపంచం ఎడ్డాకావ్య కాలంలో వున్నదన్నమాట.

దేవతలు అంటే ఈ మన మహా ప్రపంచంలో కదులాడే మర్త్యలోక వాసులుకారు.వారూ మానవులే.జనన మరణాలకు తలవంచిన వారే, అయితే పుట్టుట గిట్టుటతో సమాప్తం కాక, తిరిగి తిరిగి పునర్జన్మను పొందుతూ,ఒక జన్మలో పూర్తి చేసుకోలేని కర్తవ్యాలని- మరుజన్మ ఎత్తి పూర్తి చేసుకొనే నిరంతర జన్మవాసులు. ఇక యితర జాతులు తమ తమ కార్యాలను సాధించటానికి మానవ రూపంలో. వివిధ జంతువుల దేహాకృతిలో ప్రత్యక్షమవటం ఆనాడు సర్వ సహజమైనవి. కర్తవ్యసాధనకి మానవులూ-దేవతలూ కూడా మంత్రశక్తిని వుపయోగించటం - ఎన్నో సందర్భాల్లో కనిపిస్తూ వుంటుంది.

"ఎడ్డా" కావ్యంలో ఈ దేవతలని 'అసన్' అని పేర్కొనడం జరిగింది. ఈఅసన్‌ల దృష్టి ఎప్పుడూ తూర్పుదిశ వైపుకే వుంటుంది. వీరి జన్మ భూమి 'ఆర్యావర్తము' అని చెప్పుకోవటం కూడా కనిపిస్తూవుంటుంది. 'అసులు' అంటే - గౌరవనీయులు. అలాటి వారనే ఆర్యులని ఆరోజులలో పరిగణిస్తూ వుండేవారు. ఇతర జాతులని తమలో కలుపు కొనటమూ అంటే - వారికిఆర్యత్వాన్ని కట్టబెట్టడం అన్నమాట. మనకి తెలిసిన ఆర్య సంప్రదాయం యిదే.

ఆర్య జాతికి జన్మస్థానం ఏది, అన్న ప్రశ్నకి — రకరకాల వివరణలు వినవచ్చు. ఆర్యుల జన్మస్థానం—హిమాచల పరిసరాలని కొందరి పెద్దల అభిప్రాయం. ఈ సిద్ధాంతాలన్ని - తిలక్ మహాశయుడు ఖండించి, ఉత్తరధృవ ప్రాంతం ఆర్యుల ఆదిమ భూమి అని, ఆయన జ్యోతిష నిదర్శనాల నెన్నిటినో వ్యక్తపరిచారు. 19-శతాబ్దపు పాశ్చాత్య పండితుల తీర్పు ఆర్యుల జన్మస్థానం అయిరోపా ఖండపు వుత్తర భాగంలోని బాల్టిక్ ప్రాంతం అని ఎడ్డా కావ్యాన్ని బట్టి, అందులోని సంఘటనలనిబట్టి నిర్ణయించినపుడు. ఇప్పటి ఐరోపా ఖండంలో కాక, తూర్పు పడమరలని గలిపిన ట్రాయ్ పరిసరాలని కూడా వొప్పుకోవలసి వస్తుంది. గ్రీకు కావ్యాల మహా రచయిత "హమర్" కవి ట్రాయ్‌నగర విశిష్టత గురించి చెబుతూ,ఆ నగరం ఆ కథా కాలం నాటికి ఎన్నోవేల సంవత్సరాల క్రితమే వీరాధి వీరులకి ప్రముఖ స్థానమై వుండేదని పేర్కొన్నాడు. బైబిల్‌లో చిత్రించిన ఉద్యానవనము - ఏడెన్ ఉద్యాన వనం - యీ బాల్టిక్ ప్రాంతాలలో వున్నదని-బైబిల్ పరిశోధకులు వొప్పుకుంటున్నారు. ఎడ్డా కావ్యంలో - యీ వుద్యానవనం గురించి, అందులో ప్రత్యేక ఆటవిక జాతి వుండే వారనీ, వారు అద్భుత శక్తులు గలవారిని పేర్కొంటూ, వారి సహాయము కోరుతూ, దేవతలని పిలువ బడుతున్న ఆర్యులూకూడం, యీ రెండు జాతులమధ్యనా ప్రారంభ కాలంలో విభేదాలు, అటు పైన మైత్రీ-వగైరాలు వర్ణింప బడినవి. వివిధ పరిశోధకుల మాటలని బట్టి చూస్తే - ఈ ఆర్యులు ప్రపంచం అన్ని మూలలకి మహాయాత్రగా తరలి వెళ్ళారని - కొన్ని కొన్ని చోట్ల వేలాది సంవత్సరాలుగా వున్నారని వొప్పుకోవాలి.

ఎడ్డా కావ్యంతో రచనా శిల్పం చాలా వరకూ వేద సాంప్రదాయంలోనే రూపొందినదని చెప్పుకోవచ్చు. ఆర్య జాతి చలన రహితంగా ఎంత కాలం ఒకే ప్రాంతంలో వుండి పోయిందో యిదమిద్ధమని తేల్చి చెప్పటం కష్టం. ఆర్యులు ఎక్కడున్నా తమ జన్మస్థానపు సంస్కృతినీ, ఆచారాలను విస్మరించే వారుకారు. ఇతర ప్రాంతాలకి తరలి వెళ్ళినకొద్దీ, తమ సత్ సంప్రదాయము మీదనున్న

అభిమానం వదిలిపెట్టే వారుకాదు. వలస వెళ్ళిన ప్రాంతపు ప్రజలని ఆర్య సంస్కృతిలో కలుపుకునే వారు. తప్ప - తమ సంస్కృతిని విస్మరించలేదు.

అయిదువేల సంవత్సరాలకు పూర్వం తరలి వెళ్ళిన సుమేరియనులూ, ఈజిప్టు ప్రాంతాలకు తరలివెళ్ళిన వీరంతా ఒక నాటి భారతీయులే. తూర్పు ప్రాంతాన్నుంచి – మహాప్రస్థానానికి వెళ్ళిన ఈ ఆర్యులలో భారతీయ చిహ్నాలు— యీజిప్టు, సుమేరియన్ శిల్పాల్లో చూడవచ్చు. ఎడ్డా కావ్యంలో వర్ణించ బడిన 'యూనన్' అను సంకేత చిత్రాలు-యివి శిలా ఫలకాల మీదను, వృక్షాల మీదనూ, రేకులమీదనూ చిత్రింప బడినవి. వీటి ఛాయలు సుమేరియన్, ఈజిప్షన్ శిల్పకళలో యీ నాటికి కనిపిస్తాయి. అదేకాదు ఎడ్డా కావ్యంలోని — కొన్ని సంకేతాలు సుమేరియన్ లిపికి పోలికలు కలిగి వున్నాయని కూడా యిప్పటికి పరిశోధకులు వొప్పుకుంటారు.

ఆర్యులు - అత్యధిక సంఖ్యలో - ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వలసవెళ్లేవారు మానవ జాతి చరిత్రలో - యిటు వంటి అపూర్వమైన వలస జాతి మరెవ్వరూలేరు. ఈ యాత్రని బైబిల్‌లో - 'ఎక్సోడస్‌కి' పోల్చవచ్చు. ఈ యాత్రలని జర్మన్ భాషలో 'ఫార్కర్ వాండరుమే' అని పేర్కొంటారు. ఇటు వంటి యాత్రలు చేస్తూ- వలస వెళ్ళిన వారే ఎడ్డా కథానాయకులు. ఈ కథానాయకులు తమవారిని, ఈ కావ్యం తమ జాతి గురించేనని నేర్వే దేశస్తులూ, జర్మన్ దేశస్తులూ, అంటూంటారు. వీరిలో కొందరు నార్వే జర్మనీల నుంచి వలసవెళ్ళిన - ఇది తమ జాతి వలసని గురించి చిత్రించిన మహాకావ్యమని అంటూంటారు. ఈ ఎడ్డా కొన్ని వేల సంవత్సరాల నాటి తమ పూర్వీకులు మహాప్రస్థానమని ఈ మూడు దేశాలవారు పేర్కొనటంలేదు. ఆధునిక బ్రిటిష్ శాస్త్రజ్ఞులు వొప్పుకోరుకాని, ఈ ఎడ్డాకావ్యం తమ గురించే పూర్వకాలపు బ్రిటిష్ పౌరులు, అనటంకూడా వినిపిస్తూ వుంటుంది. అంతే కాదు 'బ్రిటిష్' ఎడ్డా' అని ఒక కావ్యం యిప్పటికీకూడా ప్రచారంలో వుంది.

ఆర్యుల జన్మస్థానం గురించి యిద మిద్ధమని తేల్చి చెప్పలేక పోయినా, పశ్చిమ యిరోపా ఖండానికి ఎప్పుడు చేరుకున్నారు—అన్న ప్రశ్నకి. చరిత్రలో కొన్ని ఆధారాలు కనిపిస్తున్నాయి. ఈ మహా ప్రస్థానికుల గురించి— క్రీస్తు. శక ప్రారంభంలో "టాసిటస్" అను రోమన్‌రాజ ప్రతినిధి ప్రస్తావించారు. రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక విషయాలలో ప్రఖ్యాతి వహించిన " జర్మానియా" జాతి. ఆ పరిసరాలలో ఎన్నో శతాబ్దులకి పూర్వమే— తూర్పుదేశం నుంచి వచ్చిస్థిరపడి వున్నట్లు పేర్కొంటారు. వీరు, యీజర్మానియా జాతి ఒక్క లౌకిక విషయాల్లోనే గాక—ఆధ్యాత్మికవిషయాలలో కూడా వున్నత శ్రేణిలో వున్నారనినొక్కి-నొక్కి చెబుతాడు. ఈ జర్మానీయులు-తమ పూర్వీకుల దివ్యచరిత్రలని వింటూ – తన్మయత పొందేవారు -సంపన్నులూ-రాజ వంశీకులే కాదు సామాన్యజనులు కూడా ఈ పాటలని పాడుకుని ఆనందించే వారని - రాశాడు ఈ రోమన్ రాజ ప్రతినిధి. ఆనాటి పాటలే నేటి ఎడ్డా.

తొమ్మిది పది శతాబ్దులలో క్రీస్తుమతం వెల్లువలో ఎడ్డాకావ్యం కాలగర్భంలో కలిసిపోయే స్థితికి వచ్చింది. బైబిల్‌గ్రంథమే నిత్య సత్యమూ, పూజనీయమూ అన్న ప్రచారంలో, మతాచార్యుల వత్తిడిలో -ప్రాచీన శిల్పాలు ఆరాధానాలయలూ, చాలా మటుకు నాశనం అయాయి. అటువంటి సమయంలో ఎడ్డాకావ్య పఠనాన్ని వినగూడదని ప్రజలు దీనిని గానం చేయకూడదని, ఇది మంత్ర తంత్రాలతో గూడిన క్షుద్రగ్రంథమని, మతపరమైన వొత్తిడికిలోనయి. యించుమించు నాశనమై పోయే స్థితికివచ్చింది. ఆసమయంలో ఆయిస్‌లాండ్‌లో -సామాన్యరైతు కుటుంబంలో పుట్టిన ఒకవిద్యార్థి, క్రీస్తుమతాన్ని ఒప్పుకుంటూ, తనపూర్వ సంప్రదాయాన్నీ,సంస్కృతినీ నిలబెట్టాలన్న తృష్ణతో పారిస్ విశ్వవిద్యాలయంలో -విద్యార్జనకు వెళ్లాడు. అక్కడ గ్రీకు వాఙ్మయాన్ని- పరిశోధించే పద్ధతులు అధ్యయనం చేస్తూ, తమ సంస్కృతికి నిలయమైన ఎడ్డాకావ్యం గురించి, కొత్త దృష్టితో పరిశోధన ప్రారంభించాడు. అటు తరువాత స్వదేశానికి వచ్చి పల్లెలూ- పట్నాలు అన్నిచోట్లా తిరిగి, జానపద రూపంలో వున్న -ఎడ్డాకావ్యాన్ని -ఆ పాటలని సేకరించటం ఆరంభించాడు. సేమండు (1056-1133) తానువిన్న అన్ని పాటలని గాథలని స్వయంగా-ప్రత్యేకమైన కాయితంపై లిఖించి- జాగ్రత్త పరిచాడు. ఈ సేకరించిన వ్రాత ప్రతులని ఏమి చెయ్యాలో తెలియక కట్టల రూపంలో వుంచాడు. ఇదే ఎడ్డా కావ్యపు. ప్రప్రథమ వ్రాతప్రతి. ఆనాటి భాష- ఎట్లా వుండేదో యీ ప్రతినిబట్టి తెలుసుకోవచ్చు.

ఎడ్డాకావ్యం ప్రప్రథమవ్రాతప్రతి అని ఏర్పడిన వెనక షుమారు యాభై ఏళ్ల- సేమండ్‌కి బంధువైన స్నొరీ అన్న యువకుడు-ఎడ్డాకావ్యాలగురించి మరి కొన్ని పరిశోధనలు చేశాడు. ఆసమయంలో ఆనాటి కవులు క్రమక్రమంగా యీ ఎడ్డా కావ్యంలో ఘనతని గుర్తించి ఆ బాణీలో కవితలల్లడం మొదలు పెట్టారు. స్నొరీ పండితుడు, కవి, వచనరచన తెలిసినవాడు. ఈతను పద్యకావ్యానికి బాణీ చందస్సూ వంటి నియామము ఏర్పరచి ఆనాటి కవులకి ఒక కొత్త బాటవేశాడు. అంతేకాదు ఎడ్డా కావ్యంలోని సంఘటనలని కథలూ గాథలూ రూపంలో అందరికి అర్థమయేరీతిలో వచనరచన చేశాడు. ఎడ్డా కావ్యం తొలివ్రాత ప్రతిని 'ఎల్డర్ ఎడ్డా' అని 'పద్యకావ్యము' అని-వచనరూపంలో వున్న రెండో గ్రంథాన్ని గద్యకావ్యము - అని పేర్కొంటారు.

చాలాకాలం దాకా ఎడ్డా గద్య కావ్యము ఒకటి ప్రజలకు తెలుసు. ఈ ఈస్నోరి రాసిన వచన రూపంలోని అసలు ఎడ్డా అని పండితలోకం అనుకుటూ వుండేది. అయితే పదిహేడవ శతాబ్దంలో "బిషప్ గర్నఫ్" అను డెన్మార్కుకి చెందిన - మతాచార్యుడు ఎడ్డా కావ్య గ్రంథం ఒకటి వుంది — అని వెలికి తీశాడు. అదే సెమండ్ రాసిన పాటల రూపంలో అసలు గ్రంథం. ఈ గ్రంథం రాజుకి వొప్ప జెప్ప బడి,దాని వ్రాతప్రతి కోపెన్ హాగన్ గ్రంథాలయంలో యీనాటికీ భద్రపరచబడి వుంది. ఈ ప్రతిని గురించి విన్న వెనుక - అన్ని దేశాల పండితులు పరిశోధనలు ఆరంభించారు.

నేను "ఎడ్డా" గ్రంథాన్ని జర్మన్ విశ్వవిద్యాలయంలో వున్నపుడు అధ్యయనం చేశాను. సుమారు యాభైఏళ్ళుగా నాకీ గ్రంథాన్ని తెలుగులో చెప్పాలన్న కోర్కె వుంది. ఈనాడు అది సఫలీకృత మౌతున్నందుకు నాకు చాలా ఆనందంగా వుంది.

[రచయిత మదరాసులోని సుప్రసిద్ధ విద్యాసంస్థ చిల్డ్రన్స్ గార్డెన్ హైస్కూల్‌ని తమ సతీమణి కీ. శే. ఎల్లెన్ శర్మతోపాటు స్థాపించారు. వీరు హెయిడెల్‌బర్గ్ విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేటు తీసుకున్నారు.]

# రాగం నా అంతరంగం

## శ్రీ పి. వి. రామకుమార్

నా గుండెల్లో నిశ్శబ్దం ప్రసరిస్తోంది.
నిశ్శబ్దపు వేడికి గుండె నీరై స్రవిస్తోంది
నిశ్శబ్దం చేసే శబ్దానికి
నిలువెల్లా ధమనులు కంపిస్తున్నాయి.

శబ్ద నిశ్శబ్దాల మధ్య కంపనం_
అది ఒక గమకం.

నా మనసు నుంచి మేధస్సు వరకూ
కాశం ఎత్తులో వేసిన నిచ్చెన -
అది ఒక ఆరోహణం.

ధ్వని ఇంద్రియాలను దాటి వికసిస్తోంది
ధ్వని పరిమళం నా గుండె లోతుల్లో
కాంతి సంవత్సరాల దూరం వ్యాపిస్తోంది.

అది గ్రహాన్యాసాల మధ్య
ఒక విసుగులేని సుదీర్ఘ చుంబనం.

వాది సంవాదుల గాఢ పరిష్వంగంలో
మధ్య నలిగి పోతున్నాయి -
మనో గతపు అంచులు.

సంగతులు వేసే అసంగత వర్ణ చిత్రాలు
ముదురు చీకటి నుంచి లేత వెలుగులోకి జారుతున్నాయి.
అది ఒక అవరోహణం.

నిన్నలోనుంచి రేపును చూస్తున్న నేడులా
పారదర్శకంగా ప్రకృతిని విశద పరుస్తున్న రాగం -
అది నా అంతరంగం.

# "కర్తవ్యమే దైవమాన్వికమే.."



డాక్టర్ గుమ్మనూరు రమేష్ బాబు

**మం**త్రాలయం....
పవిత్ర తుంగభద్రా తీరం....
నిర్మల నిశాంత సమయం
ప్రశాంత మధుర వాతావరణం....
ఎవరూ లేరు !
ఏకాంతం అందించే నిశ్చల నిశ్శబ్దం !

ఏదో తెలియని అనుభూతి.... ఎంతో హాయిని జుర్రు కొంటున్నట్లు అనిపిస్తున్న రీతి....

హృదంతరంలో నినదిస్తున్న రసార్ద్ర మవున గీతి !

సుమకోమల వెన్నెలకిరణాలు, నక్షత్రాలు, దూరాన ఆకాశంలో దోబూచులాడే నీలమేఘాలు, తుంగభద్రకి ఆవలిగట్టున గుబురుగుబురుగా కనిపించే మామిడితోపులు....

అంతా అద్భుతంగా ఉంది.

మనస్సుకి రెక్కలువచ్చి విచిత్రమైన ఊహలతో రసానంద ప్రకృతిలో తేలిపోతోంది.

భావం, భాష అందడం లేదు.

రాతిగుట్టమీద కూర్చొని వేదాంతిలా!

గుండు కల్లుమీద నవ్వుకునే అవధూతలా!

చదువుకీ సంపదకీ అందని ఆరాటమది.

అందానికి బంధానికీ అందుబాటులో లేని అనుభవమది.

ఆత్మ తాదాత్మ్యం చెందినట్లు

తాదాత్మ్యంలో రసతాండవం చేస్తున్నట్లు

నటరాజ పదాలు లయలు లయలుగా వినబడుతూ!

కాళింగుని మర్దించే కృష్ణుని పాదాల సవ్వడి తడబడుతూ !

అంతా సంబరంగా ఉంది.

పర్వదినం నాది పుణ్యకాల ముహూర్తంలా ఉంది.

యజ్ఞోపవీతం... కౌపీనం.... సంధ్యావార్చడం.... గాయత్రి చదవడం....

ఎంత హాయిగా ఉందో !

ఎన్నడూ కలగనంతటి సంతోషం ఎంతగా ఉబుకుతోందో !

గొంతువరకు తుంగభద్రలో దిగి

గుండె నిండేవరకు దివ్యానుభూతిని నింపుకొని

ముక్కుపట్టుకొని

కళ్లు మూసుకొని

"హరేరామ హరేరామ రామరామ హరేహరే

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే"—

అని అంటూ మూడుమునకలేసి ఊపిరి భారంగా వదిలినప్పుడు ఎంత ఆనందం!

పాదరసంలా మెరుస్తున్న తుంగభద్ర సౌందర్యం ఒంటినంతా అంటుకొని శుద్ధిచేస్తుంటే ఏమి పరవశం !

కన్నతల్లి ఒడిలా, కన్నతండ్రి లాలనలా, ప్రియురాలి వలపులా, పరమగురువు ఆశీస్సులా....

ఆ క్షణం మోక్షదర్శనం చేసినంత మనోహరం !

ఆ ఒక్కక్షణం సాక్షాత్కారాన్ని పొందినంత స్ఫుర్మానందం !

పరమపురుషుని ఆలింగన సుఖం!

ప్రకృతిమాతలో ఐక్యమయిన నైగనిగ్యం !

ఆ మధుర ప్రవాహంలో సుళ్లుతిరిగే భావసుడిలో కొట్టుకొనిపోతుంటే....

ఆవహించిన రసోధృతిలో కళ్లు తేలిపోతూ వడివడిగా గుండె కొట్టుకొంటుంటే...

ఎవరిదో గంధర్వ గానం !

ఏ ఊర్ధ్వలోకాలదో ఆ అమరగీతం !

"పూజ్యాయ రాఘవేంద్రాయ

సత్యధర్మ రతాయచ !

భజతాం కల్పవృక్షాయ

నమతాం కామధేనవే !" —

నా కళ్లు విప్పుకొన్నాయి.

నా దృష్టి ప్రసరించ సాగింది.

దూరంగా ఎత్తైన రాతిపలక మీద ఎవరో భిక్షువు !

తంబుర మీటుతూ తదేకధ్యానంలో తనువుమరచి పాడుతున్న సిద్ధుడు !

అనర్ఘము, అనర్ఘ్యమూ అయిన ఆదినారాయణుని హంస గీతాన్ని ఆలపిస్తున్నాడు.

అపూర్వము, అపురూపమూ అయిన ఆదికేశవుని క్షీరార్ణవ నికేతాన్ని కొనియాడు తున్నాడు.

"కనులు చెమరి

చెంగలువలై విప్పారి

సురగంగ లేవో పొరలి

ఎదదన్నె లేవో కదలి

తడిసిన చెక్కిటి మెరుపులో

తడబడిన రెప్పలమాటు నీలి ఎరుపులో

విచ్చుకొన్న పెదవులే మందారాలై

సింధుర రాగబంధుర మధుర కాసారాలై

విరిసిన నగవులే పారిజాతాలై

పరమానంద భవబంధ సంబంధ చంద్ర జలపాతాలై

దివ్యాను భూతి పురుడు పోసుకొన్నప్పుడు

మోహన మవునగీతి ఒళ్లంతా తడిమినప్పుడు

అవ్యక్త మధుసిక్త మానస మౌక్తికము

ప్రభు ! నీ పాద పద్మము !

స్నిగ్ధ సంసిద్ధ ముగ్ధ మోహనాంగికము

దేవా ! నీ పదసేవలో చరితార్థము !"—

ఆ గానం వింటూ ఉంటే

ఆ అనుభవం ప్రాకుతూ ఉంటే

ఎవరో గారడి చేస్తున్నట్లు అర్థంకాని ఆరడి నాలో బయలు దేరింది.

నాకు తెలియకుండానే నా కళ్లు ఒడ్డుకు చేరుకొన్నాయి.

ఏదో మంత్రశక్తి ఆవహించినట్లు శబ్దం వస్తున్న వైపుగా నడవసాగాను.

తమకమో మైకమో తెలియని సందిగ్ధస్థితిలో నా దేహం యాంత్రికంగా కదులుతోంది.

ఏమిగానమది?

ఎదలోతులలోంచి పుట్టుకొచ్చిన ఓంకారమది !

ఏమిస్వరమది ?

అలబృందావనమంతా విహరించిన మురళీరాగమది !

"సజల హృదయక్షేత్రం

నీ సుక్షేత్రమై

అంతర్యరాగ చరణాలు

నీ శరణు చరణాలై

రసగానంలో తానం చేయించి

ఆహ్వానంలో జీవం కరిగించి

పావనమై

పరమపద సోపానమై

అమర భావనమై

మధురభక్తి సంభావనమై

వెలుగొందినప్పుడు

వేడుకై వేదికెక్కినప్పుడు

ప్రభు! రాఘవేంద్రా !

నేనెంతటి ధన్యుడనో! భాగ్యవంతుడనో !

స్వామీ! రామచంద్రా !

నేనెంతటి అదృష్టశాలినో ! సంతుష్ట జీవినో !

గురురాజా! పాహి !

ప్రాణతేజా! పాహి పాహి"

వెన్నెలలో మేఘగంభీర మూర్తిలా, రాశిపోసిన రసస్ఫూర్తిలా భాసిస్తున్న ఆ మహాగాయకుని పాదాల ముందు నిలబడ్డాను.

నిర్మల పారాయణంలో అపార పారావారాలని మధిస్తున్న నిశ్శబ్ద సమయంలో మాటలు ఎంత గింజుకొన్నా పైకి రావటం లేదు.

దర్శన భాగ్యానికే ఇంత సుఖమైతే....

స్పర్శిస్తే ? సంభాషిస్తే ?

పదధూళి కళ్ళకద్దుకొన్నాను.

ఓంకారం తంబుర మీటినట్లు అనిపించింది. భరతపక్షి నారాయణ గీతాన్ని పాడినట్లు ఎదలో తోచింది.

"స్వామీ!" అన్నాను.

మవునముద్ర దాల్చిన ఆ మహామనీషి అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్లు ఉంది. తేనెచినుకులు కురిపించినట్లు,మాణిక్యవీణ మ్రోగినట్లు నెమ్మదిగా అన్నాడు -

"ఎవరు బాబూ! నీవు?"

"మానసిక వత్తిడి నుంచి తప్పించుకొని మనశ్శాంతికోసం మంత్రాలయానికి వచ్చిన అసంతృప్త జీవిని!"

"మనశ్శాంతి లభ్యమైందా? మానసిక వత్తిడి తగ్గిపోయిందా?"

"అదే అర్థం కావటంలేదు!"

అతడు నవ్వాడు.

"అసలు మనశ్శాంతి అంటే ఏమిటి?

అతని ప్రశ్నకు సమాధానం నా దగ్గరలేదు. ఉంటే ఇంత దూరం ఎందుకు పరిగెత్తుకుంటూ వస్తాను?

"హృదయంలేని మనుష్యుల మధ్య బ్రతకడం దుర్భరంగా ఉంది. ఉందీ, లేదూ అనుకొనే ఆర్థిక సమస్యలు ఎదలో చిచ్చు పెడుతున్నాయి. స్వార్థం, స్వప్రయోజనం పరమార్థంగా గల దుష్టశక్తులు సమాజాన్ని నాశనం చేస్తుంటే చూడలేక, ఏమీ చేయలేక – సేద దీరడం కోసం, ఉపశాంతికోసం ఇక్కడికి వచ్చాను. మానవత్వం, మమత విడిచిమనుష్యులని మనుష్యులే చంపుకు తింటుంటే భరించలేక, సహించలేక - దైవసన్నిధిలోనైనా కాసింత ఉపశమనం పొందుదామని ఇక్కడికి వచ్చాను."

వచ్చి సాధించిందేమిటి ? నీవు ఉపశమించ గలిగావా ? సేదదీరావా ? దైవం నిన్ను కటాక్షించాడా ?"

"అదే సందిగ్ధంగా ఉంది. అర్థం కాకుండా ఉంది."

"లేదు. దైవం నిన్ను కటాక్షించలేదు."

"ఎందుకని ?"

"నీ వంతు పనిని నీవు నిర్వర్తించలేదు. కనుక."

"ఏమిటి నాపని ?"

"అది కూడా తెలియని అజ్ఞానివా నీవు ?"

నేను మాట్లాడలేదు. సందేహంగా చూచాను.

అతడే అన్నాడు. ఆ మాటలు వింటుంటే వెన్న కరిగినట్లు కరుగుతోంది హృదయం.

ఏ శక్తి పని చేస్తోందో అందడం లేదు కాని, నా దేహానికీ మనస్సుకీ అందకుండా ఆత్మ అవలోకిస్తోంది.

"చూడు నాయనా ! హృదయం లేని మనుష్యుల మధ్య బ్రతకడం కష్టంగా ఉంది అన్నావు కదూ ! అసలు నిజం చెప్పాలంటే అలాంటి మనుష్యుల నడుమ నివసించాలంటే ఎంతో ఔదార్యముండాలి. హృదయాలని మరచిపోయిన శిలల వంటి వారి నడుమనే ఉండి, వారిని శిల్పాలలాగా మలచడానికి నేర్పు, ఓర్పు ఉండాలి.

నీలో ఆ ఔదార్యం కానీ, ఆ సహనం కానీ లేవు, మనుష్యుల స్థాయిని బట్టి, వారి ఆలోచనా స్రవంతిని బట్టి సర్దుకొని పోవడమే సంస్కార మవుతుంది కాని, వాళ్లు రాక్షసులనీ, వీళ్లు పశువులనీ దూరంగా వెళ్లిపోతే ఒనగూడే దేముంది? నీవు ఏకాకిగా మిగలడం తప్ప?"

అతడు మంత్రం వేసాడేమో! అతని మాటలని అలాగే వింటున్నాను, స్తబ్ధంగా అవాక్కునయి!

"పశుబలం కన్నా రాక్షసబలం కన్నా గొప్పది నైతికబలం! ఆ బలాన్ని అందించే ఆత్మబలం ముందు ప్రపంచంలోని ఏ శక్తి నిన్నేమీ చేయలేదు. నీవు వ్యక్తిగతంగా నష్టపడవచ్చు. ఓడిపోవచ్చు. దారుణంగా దెబ్బతినవచ్చు. మూర్ఖులచేతిలో పడి అపహాస్యం పాలు కావచ్చు. మరణించనూవచ్చు. నీ మరణంతో ఈ సృష్టి గతి మారదు. నీవు లేనంత మాత్రాన ఈ మానవజాతి ఉండకుండాపోదు. కాబట్టి నీవు చనిపోయే చివరిక్షణం వరకు ఆత్మబలంతో ఎదురీదు! కష్టమైనా సుఖమైనా ఫలితం నీది కానట్లే ప్రవర్తించు! అవినీతి, అక్రమం, అన్యాయం, అధర్మం అంతటా నిండుకొని పోయిందని ఆక్రోశించడం కన్నా నీతిని, క్రమాన్ని, న్యాయాన్ని, ధర్మాన్ని నీవైనా పాటించడం నేర్చుకోవాలి. చుట్టూ చీకటి ఉందని భయపడి, ఉపశాంతి కోసమని భ్రమపడి నీకుగా నీవే వేరుపడిపోతే ఎలాగా? చీకటిని చూచి భయపడ కూడదు. చిన్న గుడ్డి నక్షత్రమున్నాచాలు! సూర్యోదయం వరకు దారి తీయవచ్చు. ఏమంటావు? ఇప్పుడు చెప్పు హృదయం లేనిది ఎవరికి? వారికా? నీకా? నీవారు చెడిపోతుంటే వారిక బాగుపడరని నిశ్చయించుకొని ఇక్కడికి వచ్చేసావంటే నీవెంత నిర్దయుడవై ఉండాలి? నీ హృదయమెంత కాఠిన్యాన్ని వహించి ఉండాలి? చెప్పు. నేనన్న దాంట్లో ఏదైనా తప్పుఉందా? నిన్ను బాధపెడుతున్నానని అనుకోవద్దు."—

అతడు ఆగాడు. నావైపు చూచాడు. నాకంతా ఆశ్చర్యంగా ఉంది. అదీ అందకుండా ఉంది.

ఈయనెవరు? ఏమిటి ఈయన చెప్పేది. నామనసులోని భావాలని ఎలా పసిగట్టాడు? ఆయన భావాలని ఎంత స్పష్టంగా స్ఫుటంగా వివరిస్తున్నాడు. ఏమిటిదంతా?

నేను ఆ రాత్రి పలకకి క్రిందగా కూచొన్నాను. తడిగుడ్డలతో! తడిసి ముద్దయిపోయిన గుండెలతో! అతడు సాలోచనగా ఆకాశంలోకి చూచి మళ్లా అందుకొన్నాడు. నేను శ్రోతనయ్యాను. కాలంనడుస్తోంది. "ఆర్థిక సమస్యలు ఎదలో చిచ్చుపెడుతున్నాయి అన్నావు. అసలు ఈ సమస్యలు లేనివి ఎవరికి? కోటీశ్వరులకి ఉండవనుకొంటే నీవెఱ్ఱి! వాళ్ళకి నీకంటే ఎక్కువే ఉంటాయి. ఆకలి చావులు నేడు ప్రపంచమంతటా ఉన్నాయి. దీనికి ఎన్నో కారణాలు ఉంటాయి. అందులో పేదరికం ఒక్కటి! అంతేకాని పేదరికంవల్లే ఇవి రావడం లేదు. కోరికలని పెంచుకొంటూ పోయేకొద్దీ ఉంది,లేదూ అనే తారతమ్యాలూ పెరుగుతాయి. అలా అని కోరికలే లేకుంటే సర్వసంగ పరిత్యాగం చేయమని చెప్పడం లేదు. ఉన్నదాంతోనే తృప్తి పడటం నేర్చుకోవాలి. ఇలా ఎవరికి వారు తృప్తిపడితే ఆర్థిక సంక్షోభం సమసిపోకుండా ఉంటుందా? కట్నాలు ఇవ్వకపోతే పెళ్ళిళ్ళు జరుగుతాయా? లంచాలు ఇవ్వకపోతే పనులు అవుతాయా? అనే ఆలోచన నీలో కనిపిస్తోంది. ఇలాంటి సమస్యలకి కాలం సమాధానం చెబుతుంది. మనుష్యులంతా ఒక్కటే నన్న భావంతో, సమాజం అంటే వ్యక్తులే అన్న ధోరణిలో కలసికట్టుగా కూడినప్పుడే ఇలాంటి సామాజిక సమస్యలు పరిష్కరించ బడుతాయి. అలాంటి అవగాహన అందరిలో వచ్చేలా జాగృతి కలిగించడానికి శాయశక్తులా అహర్నిశలూ తోడ్పడాలి కాని, ఇలా ముఖం చాటు చేసి వచ్చివేస్తారా? డబ్బుతెచ్చి అత్త మొహాన కొట్టినా కోడళ్ళని మంటల పాలు చేసే కిరాతకులు లేరా? ఎంత కట్నమిస్తేనేం సంసారం సవ్యంగా జరపకుండా వ్యసనాలపాలై వీధులకెక్కేవారు లేరంటావా? కాబట్టి డబ్బు బ్రతకడానికి అవసరం కాని, డబ్బే జీవితం కాదు! కారాదుకూడా!! ఇలాగే లంచం విషయం. లంచగొండితనం నేరం అన్న సంగతి హృదయానికి హత్తుకొనేలా ప్రతీ ఒక్కరికీ తెలియపరిచే ప్రయత్నం చేయాలి. అవకతవకలవల్ల లాభపడినవారు ఉండవచ్చు. అవినీతి పనులవల్ల బాగుపడినవారు ఉండవచ్చు. అంత మాత్రాన వ్యవస్థని నిందించవలసిన అవసరం లేదు. పొరపాట్లే లేకపోతే చరిత్ర ఎలా ఉంటుంది? రామరాజ్యంలో కూడా ఇల్లాంటి సంఘటనలు జరిగాయి. అంతకు ముందూ జరిగాయి. ఇప్పుడూ జరుగుతున్నాయి. భవిష్యత్తులో కూడా జరుగుతాయి. నీతికి అవినీతికి నిత్యసంఘర్షణ తప్పదు. చీకటి ఉంటేనే తప్ప, వెలుగు విలువ తెలియదు. అధర్మానికి హారతి పట్టేవారు క్షణకాలం వెలిగినా, చరిత్ర హీనులై కాలగర్భంలో కలసిపోతారు. ధర్మంకోసం అసువులు బాసినా, అమర జీవులై చరిత్రలో నిలిచిపోతారు! నీవు ఏమి కోరుకుంటావు? ఎలా ఉండాలని అనుకొంటావు? నిన్ను ఉద్ధరించడానికి ఎవడూ రాడు. నీకు సహాయం చేయడానికి ఇంకొకడు వస్తాడని ఆశించకు. నిన్ను నీవే రక్షించుకోవాలి. నీ వ్యవస్థని నీవే సరిదిద్దుకోవాలి. అర్థమయిందనుకొంటాను.

నాలో ఆలోచన మొదలైంది. వివేచన మేలుకొంటోంది. నాలో విచక్షణ కన్ను తెరచింది. సత్యం గోచరిస్తోంది. చూడునాయనా! స్వార్థం, స్వప్రయోజనం భరించలేనన్నావు కదా! మరి నీ మాటేమిటి? సమాజం రుగ్మతతో అలమటిస్తున్నా బాధ్యతగల పౌరుడిగా ఆ రుగ్మతకి ఆనకట్ట వేయవలసింది పోయి, స్వార్థంతో ఉపశాంతిని ఆశించి ఇక్కడికి వచ్చావు కదా! స్వప్రయోజనం కోసం సమాజాన్ని సైతం మరచి ఏదో హాయిని జుర్రుకోవాలని ఇక్కడికి రావటంలో ఏమిటి

అర్థం? నీవు వేటినైతే అసహ్యించుకొంటున్నావో వాటినే నీవుకూడా నీకు తెలియకుండానే చేస్తున్నావు. తెలియని తనాన్ని క్షమించడం గొప్పతనం కాదు. తెలిసికూడా తప్పు చేస్తున్నా, వారిని కూడా క్షమించి, సరిదిద్దటం గొప్పతనం! కాబట్టి తప్పులనేవి మానవ సహజాలు. ఒక రకంగా లోకధర్మాలు కూడా! ఆ తప్పులని క్షమిస్తూ, సరిదిద్దుతూ తిరిగి అవే తప్పులను చేయకుండా జాగ్రత్త పడుతూ ముందుకు ప్రయాణించడం విజ్ఞుల లక్షణం! జాతిని పవిత్రకాలాల పాటు భద్రపరచడం నిజమైన పౌరుల ప్రథమ ధర్మం కావాలి. నీవే ఇతరులకి ఆదర్శం కావాలి. ఆదోరణి నీ అణువణువులో కదలాడాలి. అప్పుడే నీ జన్మ సార్థక మవుతుంది. ఏ మానవత్వమైతే కనిపించ లేదని నీవు బాధ పడుతున్నావో అదే మానవత్వంతో తోటి మనుష్యులని ప్రేమించడం నేర్చుకో. ఒక్క ప్రేమకే క్షమించడం కూడా తెలుసు! ఏ మమత అయితే కనుమరుగై పోయిందని విలపిస్తున్నావో అదే మమతతో తోటివారిని ఆదుకో. ఆదర్శ సేవలోని పరమాత్ముని సాక్షాత్కారం లభ్యమవుతుంది మానవసేవే మాధవసేవ! సమాజసేవే ఈశ్వరసేవ! ఈ సత్యాన్ని తెలుసుకోవాలి కాని మూఢభక్తితోనో భయంతోనో, వ్యక్తిగత లాభాపేక్షతోనో, పరలోక సుఖప్రాప్తి లభ్యమవుతుందనే ఆశతోనే దైవార్చన చేయడం తగనిపని. ఇలా చేయడంవల్ల భక్తుడికి సంతృప్తి కలుగుతుందేమోకాని, భగవంతుడికి ఎప్పటికీ కలుగదు. ఈ విషయాన్ని గుర్తు పెట్టుకొని కర్మఫలాన్ని త్యాగం చేసి విశ్వకళ్యాణం కోసం పాటు పడటమే ప్రతి మనిషీ చేయవలసిన పని"

అతడి వాక్ప్రవాహానికి అడ్డు పెట్ట లేకున్నాను. పెట్టాలని లేదు కూడా ! మతి స్థిమితపడటమే కష్టంగా ఉంది. పడుతుందో లేదో !

"ఏ ప్రకృతిని చూచి నీవు ఆరాధించావో ఆ ప్రకృతిలో అంత ర్భాగమైన మానవ ప్రకృతిని కూడా ఆరాధించాలి. తుంగభద్ర తరంగం కావాలని, బృందావన సేవాకుసుమం కావాలని, మంత్రాలయ సమీరం కావాలని, రాఘవేంద్రుని కటాక్షం కలగాలని ఎలా అయితే ఆశపడుతున్నావో—అలాగే ప్రతిమనిషిహృదయంలోనూ కరుణ, ప్రేమ, సానుభూతి, త్యాగం, భక్తి, వినయం, సేవాగుణం, దీక్షా దక్షత, సాహసం, సామర్థ్యం నింపాలని కూడా ఆశపడాలి ! మానవ ప్రకృతినే అర్థం చేసుకోలేనివాడికి ప్రకృతి ఎలా అర్థమవుతుంది ? ఏ స్వార్థాన్ని ఆశించి గంగాజలం దప్పిక తీరుస్తోంది ? ఏ స్వంత ప్రయోజనాన్ని కోరి మలయమారుతం ప్రాణవాయువుని అందిస్తోంది? ఎవరికోసం భూమి పండుతోంది ? ఎవరి శ్రేయస్సుకోసం ఆకాశం వర్షిస్తోంది ? ఈ ప్రకృతి సత్యాలేమిటి ? వీటి వెనుకన దాగిఉన్న అంతర్యం ఏమిటి? అర్థం చేసుకోలేవా ? అర్థాన్ని తెలుసుకొని జన్మని ధన్యం చేసుకోలేవా ?"

అతడు బరువుగా ఊపిరి పీల్చుకొన్నాడు.

నేను అతని వైపే కళ్లార్పకుండా చూస్తున్నాను.

"నేనెవరిని? నేను చేస్తున్న పనేమిటి? అనికదా నీకు సందేహం వస్తోంది. నేను నీలాగే మామూలు మనిషిని ఎందరో మహర్షులు పుట్టిన పుణ్యభూమి ఈ భరతఖండంలో పుట్టినందుకు గర్విస్తున్న ఒక పౌరుణ్ణి. ఈ ముసలితనంలో ఏమీ చేయలేకపోయినా నీలాంటి వారికి ధైర్యాన్ని ఇస్తున్న వాణ్ణి. బడుగుబాపడినైనా నా తరతమ విభేదంలేక అందరూ ఒక్కటేనన్న పచ్చి వాస్తవాన్ని అందరికీ చెప్పాలనుకొంటున్న నిత్యసాధకుణ్ణి. ప్రకృతిని, మానవప్రకృతిని ఆరాధిస్తూ వ్యవస్థని కాపాడుకోవాలనే సందేశాన్ని నాకు చేతనైనట్లు చెప్పాలని ప్రయత్నం చేస్తున్న విద్యార్థిని, నీ మనోభావాలని ఎలా కనిపెట్టగలిగానని అనుమానిస్తున్నావు. నీ సందేహాలని ఎలా తెలుసుకోగలిగానని ఆరాట పడుతున్నావు. ఆ శక్తి నాది కాదు. జాతిపట్ల నాకుండే అనురక్తి అది. మహా మహా మహర్షుల పాదధూళికి నిలవలేని నాకే ఇంతశక్తి ఉందని నీవు అనుకొంటున్నప్పుడు ! అంత మందిని కన్న ఈ వేద భూమికి ఉండే శక్తి ఎంతటిదై ఉండాలి ? బలహీనుడనా, బలవంతుడనా అనే ప్రశ్న వద్దు. రామాయణంలో ఉడుతలా, దేశసేవలో తల దూర్చితేచాలు. నీవంతుపని నీవు నిరాశచెందకుండే, ఏ విధమైన సందేహాలూ లేకుండా చేయవలసిందే ! అదే నీ ధర్మం ! నీవు ఆచరించవలసిన మొట్టమొదటి సాంఘికధర్మం ! చరైవేతి చరైవేతి నడు, ముందుకు నడు !"—

అతడు దిగి గబ గబా వెళ్ళిపోయాడు. ఆ వెన్నెలలో,ఆ కోవెలలో కలిసి పోయాడు.... !

నేను మాటా మంతీ లేకుండా ఉండిపోయాను. సూర్యోదయ మయింది. నేను అలాగే నిలబడి ఉన్నాను.

నాభార్య వచ్చి నన్ను కదుపుతూ అంది.

" ఏమిటి ! ఇక్కడున్నారా? మీ కోసం మూడుగంటల నుంచి వెతుకు తున్నాము. అయినా అంత ప్రొద్దున్నే స్నానానికి రావాలా? అబ్బ! ఎంత తడిసి పోయారు? ఊఁ! త్వరగా తుడుచు కోండి. జలుబు చేస్తుంది"

నేను ఒళ్ళు తుడుచు కొంటున్నాను.

ఈలోగా ఒక విప్రుడొచ్చి ఆ రాతిఫలకం వద్ద పూలని, పళ్ళని ఉంచి నమస్కరించి, కొబ్బరికాయ కొట్టాడు. నాకు చిత్రంగా అనిపించి...

ఆ " రాతికి మ్రొక్కటం ఎందుకు ? అన్నాను.

ఆ విప్రుడు నావైపు చూచి

" అపచారం ! అలా అనకూడదు. ఈ రాతిఫలక పైనే రాత్రిపూట రాఘవేంద్రస్వామి కూర్చొని భక్తులని కటాక్షిస్తూ ఉంటాడు. ఆయనని చూచినట్లు ఎంతోమంది చెప్పారు కూడా ! "

ఆ విప్రుడు వెళ్ళిపోయాడు.

అయితే నాకు కనిపించినవ్యక్తి—

ఆవేశమో, ఆనందమో, ఆందోళనో, ఆరాటమో తెలియలేదు.

శ్రీ కె. రామాంజనేయులు

# రాయవాచక భాషలో వ్యావహారికత

(గత సంచిక తరువాయి)

**4.0 నామం— నామవిభక్తులు:**

**4.1** పదాంత 'ము' వర్ణకంలోని స్వరం లోపించి 'ం' (పూర్ణ బిందువు)గా మారుతుంది.

ఉదా : భారతం భాగవతం రామాయణం (2-12)
సైవిశారణ్యం పుష్కరక్షేత్రం (3-6)

కాని రాయవాచకంలో ఇది సర్వత్ర వర్తించదు.

**4.2** పదాంతంలోని మువర్ణం లోపించి దానికి ముందున్న స్వరం దీర్ఘం కావటం.

ఉదా : ప్రారబ్ధానకు (7-1)
ముహూర్తాన (2-9)
వచనాలున్ను (6-2)
దేవస్థలాలకున్ను (3-14)
పట్టానకు (41-6)

**4.3** ద్వితీయాది విభక్తులు చేరినపుడు గ్రాంథిక భాషలో డుమంతనామం యొక్క 'డు' లోపించి నకారం వస్తుండగా వ్యావహారిక భాషలో 'డు' లోపించకుండా ఔపవిభక్తిక రూపమేర్పడుతుంది.

ఉదా॥ సుక్కల నాయడికి(84-19)(<సుక్కలనాయనికి)
(పరశురామ నాయడితెగాను (64-19)'(<-నాయని తెగాను)

కొన్నిచోట్ల ద్వితీయావిభక్తి 'ని' చేరినపుడు దాని ప్రభావం చేత డకారం ణకారంగా మారి వర్ణసమీకరణం (ఎసిమిలేషన్) జరుగుతుంది.

ప్రతాపరుద్రుడు+ని >ప్రతాపరుద్రుణి+ని >ప్రతాపరుద్రుణ్ణి (66-7)

**4.4.** తెలుగులో ఏకవచనానికి 'లు' ప్రత్యయం చేర్చడంవల్ల బహువచన రూపమేర్పడుతుంది. బహువచన ప్రత్యయం చేరడంవల్ల (నామ) ప్రాతిపదికలో కొన్నిమార్పులు వస్తాయి.

**4.4.1** 'ల్లు' అంతంలో వచ్చే నామ పదాలకు 'ండ్' ఆదేశమవుతుంది.

ఇల్లు+లు> ఇండ్+లు >ఇండ్లు (115-4)
విల్లు+లు >విండ్+లు >విండ్లు (25-15)

**4.4.2** దీర్ఘ స్వర పూర్వకమై అనునాసిక సహిత డువర్ణాంత శబ్దాల తుది ఉకారం లోపిస్తుంది.

ఉదా : వాండు+లు >వాండ్+లు >వాండ్లు (86-8)
యేండు+లు >యేండ్+లు >యేండ్లు (15-8)

ఇలాంటి రూపాలు సమకాలీన శాసనాల్లో కూడా కనిపిస్తాయి.

**4.4.3** పదాంత టి, టు, రి, రు లపైని అచ్చు లోపిస్తుంది.

చీటి + లు < చీట్ +లు < చీట్లు(38-22)
బంటు +లు < బంట్ + లు బంట్లు(65-7)
తలారి + లు < తలార్లు(4-15)
వారు + లు < వార్ + లు < వార్లు (42-10)

**4.4.4** 'అణ్ణగళు' అనే తమిళ (గౌరవ) బహువచనపదానికి మరల తెలుగు బహువచన ప్రత్యయం 'లు' చేరింది.

అణ్ణగళులున్ను (38-15)

**4.4.5.** రాయవాచకంలో గౌరవ బోధక ప్రత్యయాలుగా-లు,-గారు అనేవి చేరుతాయి.

ఉదా : శింగిరిభట్లు (7-17)
ప్రభాకర శాస్తుర్లు (16-10) ఇట'శాస్త్రి' అన్న పదం స్వరభక్తి (ఎనాప్టిక్సిస్) వల్ల 'లు' చేరినపుడు 'శాస్తుర్లు' అయింది.
కొండ మరసుగారు (50-9)

గారు అనేది ఉర్దూనుండి తెలుగులోనికి ప్రవేశించి బాగా స్థిరపడింది.

**5.0** భాషకు కారకం (కేస్) చాల ప్రధానం. ఈ 'కారకమ్' అన్న పదం 'కృ' ధాతువుకు 'అక' ప్రత్యయం చేరినపుడు స్వరభక్తివల్ల 'కారక' అని ఏర్పడి, (అనుహద్వాచక) ప్రథమైక వచన ప్రత్యయం 'ము' చేరి కారక మేర్పడుతుంది. వ్యావహారిక భాషలో పదాంతాచ్చు లోపిస్తుంది.

5.1. రాయవాచకంలో కొన్ని విభక్తి ప్రత్యయాలు విలక్షణంగా ఉన్నాయి. తృతీయా విభక్తి ప్రత్యయం 'తోడ' కు నియతంగా తోడట్టు కన్పిస్తుంది.

ఉదా : వినయము తోడట్టు (4-6)
వైభవము తోడట్టు (4-17)
కన్నీరు తోడట్టు (27-9)
అముస్తీదు తోడట్టు (41-1)
'చేతో' కు "చాత" అనడం కూడ కద్దు.
ఉదా : చారుల చాత (108-19)
పరిమెళముల చాత (115-2)

5.2 తెలుగు వైయాకరణులు సంస్కృత విధానాన్ననుసరించి నామవిభక్తిని వర్ణించారు. తెలుగు విధానం, సిస్టమ్ సంస్కృతం, కంటె సువిశాలమైంది. తెలుగులో విభక్తిప్రత్యయాలుగా రూపొందిన వాటిలో డు, ము, వు, లు, ను, కు, న అనేవితప్ప తక్కినవన్నీ స్వతంత్రపదాలు. అయితే అవన్నీ ఇప్పుడు విభక్త్యర్థాల్లో వాడబడడం చేత ఆ అర్థాల్లోనే రూఢియైపోయి స్వతంత్ర ప్రయోగార్హతను కోల్పోయాయి. ఉదాహరణకు కొఱకు, 'కొఱ' అనగా ప్రయోజనమని అర్థం, దీని మీద సంప్రదానార్థంలో 'కు' చేరి 'కొఱకు' (=చతుర్థీ విభక్తి) అయింది. ఇది ఇప్పుడు కేవలం విభక్తి ప్రత్యయం మాత్రమే. అలాగే 'వలన' దీని అర్థం పార్శ్వం లేక దిక్కు, దీని సప్తమ్యంత అర్థం 'వలన(న్)' ఇది ఇప్పుడు పంచమ్యర్థంలో స్థిరపడిపోయింది. ఇలాగే తక్కిన విభక్తులు కూడ. తర్వాత ఈ 'వలన' అనేది వర్ణ సమీకరణం జరిగి 'వల్ల' అయింది. వలన> వల్న> వల్ల రిగ్రెసివ్ ఎసిమిలేషన్.

ఉదా : ప్రతాపం వల్ల (39-20)
దోషము వల్ల (15-6)

నుండి/నుంచి అనేది ప్రదేశ,కాల "స్పేషియోటెంపరల్" బోధకాలకు సోర్సు అనే అర్థంలో సాధారణంగా వాడబడుతుంది. కాని రాయవాచకంలో మహద్వాచక సర్వనామాలకు విశేషం.

నిన్నుండి అయ్యే ప్రయోజనులేమియున్నది ? (27-12)
మమ్మునుంచి నీకు అయ్యే ప్రయోజనమున్ను (27-15)

ఈ ప్రయోగాలు కన్నడ భాషా ప్రభావంచేత తెలుగులో ప్రయోగించినట్టు తెలుస్తుంది. కన్నడంలో నిన్నింద (=నిన్నుండి), నమ్మింద (=మమ్మునుంచి) అని ప్రయోగింపబడుతున్నాయి.

## 6.0 సంఖ్యావాచకాలు :

సంఖ్యావాచకాలకు విశేషణ విశేష్యరూపాలు ఉన్నాయి. వీటిలో సంగ్రహ విశేషణరూపాలే ప్రాచీనాలు. వాటినుండి ప్రత్యయాదుల చేరికతో విశేష్యరూపాలు ఏర్పడినాయి.

సంఖ్యా వాచక పదాల్ని మనుష్యేతర సంఖ్యా వాచక పదాలని మహన్మహతీ సంఖ్యావాచక పదాలని, పూరణార్థక సంఖ్యావాచక పదాలని మూడు విధాలుగా విభజింపవచ్చు.

### 6. 1 మనుష్యేతర సంఖ్యావాచక పదాలు :

ద్రావిడ భాషల్లో ఒకటినుంచి పదివరకు (తెలుగులో 100కి, 1000కి కూడ) ప్రత్యేక పదాలున్నాయి. 20, 30, 40, మొదలైన సంఖ్యా వాచక పదాలు 10రూపానికి 2, 3,4 మొదలైనవాటి విశేషణ రూపాలను ముందు చేర్చడంవల్ల ఏర్పడుతాయి.పదిపైన ఉండే అంకెలు 1,2,3, మొదలైన పదాల్ని చేర్చడం వల్ల ఏర్పడుతాయి. తెలుగులో నూరు, వెయ్యి అనేవి దేశ్య పదాలే, లక్ష కోటి అనేవి సంస్కృత పదాలు.

6.1.1. రాయవాచకంలో 'ఒక' లేక ఒకటి అనే పదానికి అనేక రూపాంతరాలు కనిపిస్తాయి.

ఉదా : వొఖ కార్యం (36-13), వొఖ్కంటికి (34-17)/
వఖ్కంటికి (34-20)
వఖపాలున్ను (42-8), వక్కంటికి (44-17)
వక కార్యములు (55-1), వక్కప్రదేశాన (59-18)
వొక మాని కొంమ్మ (78-17)

6.1.2. రెండు యొక్క విశేషణ రూపం 'ఇను' ఈ 'ఇరు' రాయవాచకంలో

'మారు' వచ్చినపుడు 'ఇను' గా మారింది.
ఇనుమారు (33-8)
'పది'కి రూపాంతరమైన 'వై' వచ్చినపుడు ఇరు ఇరగా కూడ మారింది.
ఇరవై నాలుగు లక్షల రాజ్యాన (34-16)
యిరువై నాలుగు లక్షలున్ను (34-20)

6.1.3. మూడుకు విశేషణరూపం 'ము'
ముమ్మారు (33-8), మున్నూరు (15-11)
ముప్పై (101-21), ముప్పై (44-19)
ముక్కాలు (58-10) ఇక్కడ 'కాలు' అనేది కన్నడ భాషాప్రభావం వల్ల వచ్చిచేరింది.

6.1.4. కావ్యభాషలో 'నాలుగు' యొక్క విశేషణ రూపం 'నలు' అనేది ఉండగా వ్యావహారికంలో అది నాలుగు / నాల్గుగానే ప్రయోగింపబడుతుంది.

ఉదా : నాలుగు దిక్కులు చూడగా 12-13)

నాల్గు విధంబుల (25-13)

' నూరు' విశేష్యంగా వచ్చినపుడు ' నన్' అనేది విశేషణంగా ఉంటుంది.

నన్నూరు (76-18)

6.1.5. ' అయిదు / ఐదు' విశేషణంగా వచ్చినపుడు వర్ణ వ్యత్యయం జరిగి యే, యాలుగా మారుతుంది.

యేనూరు (76-18), యాభై (44-19)

6.1.6. ' ఆరు' కు విశేషణ రూపం 'అరు' అయినా విశేష్య రూపాన్ని కూడ విశేషణంగా కొన్నిచోట్ల వాడవచ్చు.

అరువై (101-21) / అరవై (34-15)

అర్నూరు (15-6)

6.1.7. ' పది' విశేష్యంగా ఉన్నపుడు ' ఏడు' రూపం వర్ణ వ్యత్యయం జరిగి, గుణీభూతమై' డబ్బై ' రూపమేర్పడుతుంది.

డెబ్బైరెండు. (2-21)

6.1.8. రాయవాచకంలో పదికి రూపాంతరాలుగా సమస్త పదాల్లో వై, ప్ఫై, ప్పై, ఫై, బై, భై భైలు కన్పిస్తున్నాయి.

ఇరువై (34-19), ముప్పై (101-21),
యాబై (35-8), తొంభై (34-8)
అరవై (34-15), ముప్ఫై (10-13), యాభై (44-19)
ముఫై (44-19), యెనభై (43-14)
యాభై (45-2)

6.1.9 'పది'కి విశేషణరూపాలుగా పన్, పదున్ ఇత్యాదిగా కనిపిస్తాయి.

పన్ + రెండు > పంద్రెండు (34-22) ఇట 'ద్' ఆగమంగా వచ్చింది.

పన్ + తొమ్మిది > పందొమ్మిది (34 + 12) ఇట నరళాదేశం వచ్చింది.

పదున్ + ఎనిమిది > పదునెనిమిది (83-6)

6.1.10. వెయ్యికి బహువచన ప్రత్యయం 'లు' చేరినపుడు చివరి అక్షరం లోపించి, ఆద్యక్షరం దీర్ఘమౌతుంది.

వెయ్యి + లు > వేలు(35-5)

6.1.11. సంఖ్యావాచకాలకు విభాగ వాచకంగా 'ఏశి' వస్తుంది. అలాగే చొప్పున అని రావలసిన చోట్ల 'లెక్క వంతున' అని వస్తున్నాయి.

ఉదా : రోజు గుర్రంవొక్కంటికి నూరేశి ఫెట్లలెక్క గుర్రములు వెయ్యంటికి....(34-18)

రోజు వెయ్యేశి ఫెట్లలెక్క (34-21)

బంట్లు వెయ్యంటికి రెండువేల వంతున (35-2)

6.1.12 విశేషణం బహువచనంలో ఉండగా విశేష్యం ఏకవచనంలో చెప్పటం.

నాలుగువేల గుర్రం చాపకట్టుగాబడగా (87-20)

## 6.2 మహన్మహతీ సంఖ్యావాచకాలు :

సాధారణంగా మహన్మహతీ సంఖ్యావాచకాలు (7దాక) సంగ్రహ విశేషణ రూపాలకు-గురు చేర్చడంవల్ల ఏర్పడుతాయి.

ఉదా : ముగ్గురు (78-14), ఆరుగురు (44-7)
నలుగురు (44-6)

6. 2. 1. విశేషరూపకమైన సంఖ్యావాచకానికి తర్వాత సామాన్యంగా వచ్చే సామూహిక వాచకమైన 'మంది' లోపించుట.

ఉదా : ముప్పైన్నృపతులు (10-13)

తొంమ్మిది సంప్రతుల వారితోనున్న (83-19)

6. 2. 2. మహద్వాచక విశేష్యాలకు అమహద్వాచక విశేషణాలు వాడటం.

రెండు మనిషి నిలువున (79-10)

నాలుగు మనుష్యుల నిలువున (78-22)

6.2.3. శక్తిహీనులైన ప్రజలని చెప్పటానికి అరపేద, కాలుపేద అని చెప్పటం విశేషం.

అరపేద కాలుపేద మనుష్యులైనవారికి పోను రాను శక్యమా అని. (61-16)

## 6.3. పూరణార్థక సంఖ్యావాచకాలు :

దీని విశేష్యం మనుష్య, మనుష్యేతర వాచకాల్లో ఏదైనా కావచ్చు. గ్రాంథిక భాషలో పూరణార్థక ప్రత్యయం 'అవ' ( <అగు) కాగ, వ్యావహారికభాషలో అది 'ఓ'గా మారుతుంది.

రెండో తేప (15-1), మూడో నగరా (84-12)

7.0 సముచ్చయ ప్రత్యయాలు :

రాయవాచకంలో సముచ్చయ ప్రత్యయాల్లో బహురూపత, వైవిధ్యం కనిపిస్తాయి.

రాయవాచకంలో కనిపించే సముచ్చయ ప్రత్యయాలు :

ఉదా : ∅ పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్ర మోక్షం భారత సావిత్రి దధివామన స్తోత్రము.... (2-10)
(∅ అంటే సముచ్చయ ప్రత్యయం లేదని అర్థం) ఇక్కడ సముచ్చయార్థం ఉచ్చారణలో గోచరిస్తుంది.

వ్యవహారంలో సముచ్చయం లేని చోట్ల ఆ రూపాలమీద ఊనికపడి సముచ్చయార్థం ద్యోతక మవుతుంది.

-ను : నాలుగువిధంబుల నారులును నాలుగు విండ్లును(22-15)
-యు : దీర్ఘ సూత్రతయు, యెరుక గలవారల యెరుంగమియు (20-14)
-న్ని : కాశీ విశ్వనాథులనున్ను, విశాలాక్షనిన్ని (10-18) ఢిల్లి సురధాణికిన్ని. వోరగంటి ప్రతాపరుద్రుని కిన్ని (65-21)
-న్ను : రాజ ధర్మత్వమున్ను, ఐశ్వర్యమున్ను. జేశిన పుణ్య మున్ను.... (26-18)
-అను : పరశురామనాయుడితెగాను అమరగాలఙ స్థానా పతులలో వీరభద్రయ్య అనే ఆయనాను.... (64-20)

గ్రాంథిక భాషలో -ను - యు అనే ప్రత్యయాలుండగా వ్యావహారిక భాషలో -న్ని, న్ను, అను అనేవి వాడబడుతున్నాయి. వీటిలో 'న్ని' ఇకారాంత పదాలకు 'న్ను' ఉకారాంతపదాలకు 'అను' అకారాంత పదాలకు తర్వాత వస్తున్నాయి.

8.0 సమాసాలు : అర్థవంతాలైన రెండు పదాల కలయిక సమాసం. రాయవాచకంలో ఎక్కువగా ఏకార్థ బోధకాలైన రెండు పదాల్ని ప్రయోగించటం చాల ఎక్కువగా కన్పిస్తుంది. ఈ విధమైన ప్రయోగాలు నేటి వాడుకభాషలో (ఎక్కువగా శిష్టేతరుల్లో) కూడ ఉన్నాయి. ప్రయోగించిన రెండు పదాల్లో ఒకటి దేశీయం, ఇంకోటి అన్యదేశీయం రెండూ దేశీయాలుగా వుండవచ్చు, అన్యదేశీయాలు కావచ్చు. ఉదా : కుట్రంకుపెట్టె, గేటు వాకిలి, సంతమార్కెట్, బ్యాగ్ సంచి లాంటి ప్రయోగాలు రాయలసీమలో వాడుకలో ఉన్నవే. ఇంకా మిశ్రమ సమాసాలు కూడ మనకు రాయవాచకంలో దర్శన మిస్తాయి. అతి సన్నిహిత సంబంధం కల్గిన పదాలు ద్వంద్వ సమాసాలుగా కూర్చబడతాయి. అవికూడ రాయవాచకంలో ఎక్కువేనని చెప్పవచ్చు.

8.1 ఏకార్థ బోధికాలు :

ఉదా : బంటు బయలు (37-22) కీర్తిఖ్యాతులు (89-22)
యాది హెచ్చరికలు (82-10)
రసుమ్సామాగ్రీలు(49-21) రొక్కరూపాయలు (33-15)
మాట పలుకులు (36-8) కోకతాకలు (109-12)
కోట కొత్తళములు (28-20), దగడప్పులు (86-7)
ధాన్యదవసములు. (85-13)
సంబళం సారికెలు (44-5) కడ్డికవళములు (44-6)
బొక్కసభండారములు (98-6)

8.2 వైరిసమాసాలు లేక మిశ్రమ రూపాలు :

ఇవి దేశ్యపదాలతో అన్యదేశ్యపదాలు వచ్చి చేరటం వల్ల ఏర్పడతాయి.

ఉదా : బీగ ముద్రలు (4-8)
ప్రహరిబదగరములు (4-8)
చే ఖండ్డము (98-12)
గొండారణ్యం (75-9)
నిత్యాసారి (70-20)

8.3 ద్వంద్వ సమాసాలు :

ఉదా : కలిమి బలములు (29-13)
పండిత పామర జనులు (29-14)
పల్లెల పట్ణములు (29-14)
రేయు పగలు (34-5)
రాత్రి పగళ్లు (4-14)
కాళ్ళు చేతులు (99-2)
వక్కలాకుకలు (99-10)
కీర్తి అపకీర్తులు (99-7)
సాహస పరాక్రమములు (98-9)

9.0 క్రియలు :

వ్యాపారాన్ని బోధించే శబ్దాలు క్రియలు. ఆయా కాలాన్ని బోధించడానికి క్రియా ప్రాతిపదికలకు కాలబోధక. ప్రత్యయాలు చేరుతాయి. పురుష బోధక ప్రత్యయాలు, చివర వస్తాయి. అసమాపక క్రియలకు పురుషబోధక ప్రత్యయాలు చేరవు. రాయ వాచకంలో కొన్ని క్రియా ప్రయోగాలు విలక్షణంగా ఉన్నాయి.

9.1 వర్తమాన కాలంలో వచ్చే-తునా అనే ప్రత్యయం నేటి భాషలో కూడా చాల అరుదుగా వినిపిస్తుంది.

అంపుతునాను (116-11) } ఇట ఊనిక లేక పోవటంవల్ల
వస్తు నావు (54-19) } ద్విత్వం లోపిస్తుంది.

9.2 తద్ధర్మార్థకంలో-తు, సు, – అనే ప్రత్యయాలు వస్తాయి.

ఉదా : వ్రాతురు (68-19), విడుతురు (56-1)
కురుసును (26-7)- చేసును (31-5)

9.3 విధ్యర్థక ప్రత్యయాలుగా -డా/ండా, మూ, అనేవి కని పిస్తాయి. వీటిలో '-డా/ండా' మధ్యమపురుష బహువచనంలోను, '-మూ' మధ్యమపురుష ఏకవచనంలోను వస్తాయి.

శేయుడా (75-6)
చిత్తం వచ్చినవారికి వెచ్చబెట్టండా (42-21)
నిద్రపోయ్యేటప్పుడు చూడండా (66-17)
నిద్రపోయ్యేటప్పుడు చూడుమూ అని (66-15)

సాధారణంగా ఇట దీర్ఘం చేయటం ఉండదు. కాని వ్యావహారిక భాషలో నొక్కిచెప్పట ఉద్దేశ్యమై దీర్ఘం చేయటం జరిగింది.

9.4. భవిష్యదర్థంలో '-ఏ-', ఈ' అనేవి కాలబోధక ప్రత్యయాలుగా వాడబడినాయి.

ఉదా : నెరవేర్చేము (=నెరవేర్చెదము) (8-21)
కలిగీని (=కలిగెడను) (8-20)

9.5. చేదర్థకంలో -తే, -తేను, -ఇతేను, -టే, -అయితే, -ఆయనా' అనే ప్రత్యయాలు కన్పిస్తాయి.

ఉదా : వస్తే (55-1), వుంస్తే (90-17)
సమరమిస్తేను (53-12), ఆనతిస్తేను (62-11)
చూపితేను (55-4), తెలిసితేను (59-4)
వింటే (101-2)
యున్నట్లయితె (29-2)
నడిపిస్తిరాయనా (8-18)

9.6. వ్యావహారిక భాషలో అత్మార్థక '-కొని' ప్రత్యయం -క'గా మారుతుంది.

ఉదా : తెప్పించుక (36-19), రప్పించుక (5-9)

9.7. అన్యదేశ్య ప్రాతిపదికలకు తెలుగు సహాయక క్రియలు చేరి ఏర్పడిన కొన్ని శబ్దపల్లవ క్రియలు మనకు రాయవాచకంలో కనిపిస్తాయి.

ఉదా : మోర్చావేయు (85-6), సలాముశేయు (56-6)
భేటి చేసుకొను (110-21), కుర్నీసులుశేయు (110-21)

10.0 వాక్యం : కొన్ని వర్ణాల సమాహారం పదమైతే ఆ పదాల కలయికే వాక్యం. తెలుగులో పదక్రమం 'వర్డ్ ఆర్డర్' మౌలికంగాకర్త 'సబ్జెక్ట్,' కర్మ 'ఆబ్జెక్ట్,' క్రియ 'వర్బ్'–ఈ విధంగా ఉంటుంది. ఈ క్రమం సందర్భానుసారంగా మారవచ్చు. ఈ మార్పు కర్త, కర్మల ప్రాధాన్యతను బట్టిజరుగుతుంది. తెలుగులో వాక్య పరిమాణం ఎంత చిన్నదిగానైనా, ఎంత దీర్ఘంగానైనా ఉండవచ్చు. కొన్ని సందర్భాల్లో కేవలం ఏకపదం కూడ వాక్యం కావచ్చు. సాధారణంగా అనేక అసమాపక క్రియలతోను, సముచ్చయ ప్రత్యయాలతోను వాక్య పరిమాణం పెరుగుతుంది. చివర సమాపక క్రియతో అంతమవుతుంది. రాయవాచకంలో వాక్య నిర్మాణ పద్ధతిలో కొంత విలక్షణత గోచరిస్తుంది.

10.1.1 చేదర్థకంలో ఒకేచోట–తే, - ఆయనా అనే ప్రత్యయాలు రెండూ ప్రయోగించటం గమనించవచ్చు,

ప్ర. రాజులైన వారలు అనువైన పురుష రత్నాన్ని సంతరిస్తే ఆయనా (45-14) (ప్ర= ప్రయోగం)

10.1.2 వ్యావహారిక భాషలో – చేదర్థకంలో తే (ను), ఇతే (ను)ప్రత్యయాలుండగా రాయవాచకంలో-ఆయనా /- ఆయెనా అనేది విలక్షణం

ప్ర. నే జెప్పినట్టు నడిపిస్తిరాయనా (8-18)
ప్ర. తృణమని యెంచి గ్రహించక వున్నట్టాయెనా (39-19)

10.1.3. చేదర్థక ప్రత్యయమైన - ఆయనా భూతకాల బోధక క్రియపై రావడం విశేషం.

ప్ర. నే జెప్పినట్టు నడిపిస్తిరాయనా (8-18)

10.2. కొన్నిచోట్ల కర్మ్రవచనానికి వ్యస్తమైన క్రియాపదం వాడుట.

సురక్షితము గలవా (3-7)
నిత్యోత్సవములుగా నడుస్తా వున్నది (3-10)
రాచకార్యములుగా విశేషముగా లేదు (4-9)
ప్రయోజనము లేమి యున్నది ? (27-12)

10.3. కొన్నిచోట్ల మహద్ మహతీ వాచక బహువచనానికి అమహద్వాచక సర్వనామం ప్రయోగించుట.

పీఠాధరులు ఇవి మొదలగు (5-16)

10.4 మహద్విశేష్యాన్ని పూజార్థంలో వాడి, దానిక సంబంధించిన క్రియను ఏకవచనంలో ప్రయోగించటం.

ప్ర. గజపతివారు గుర్రాలతోదట్టు గోదావరి స్నానానకు వచ్చినాడని (76-5)

10.5 రాయవాచకంలో అవసరమైన పదాల్ని లోపింపజేసినందువల్ల అర్థం స్పష్టంగా అవగాహన కాని కావ్యాలు కూడ ఉన్నాయి.

ప్ర. పూర్వమందు అర్జునుండు ఉత్తరగోగ్రహణమందు దుర్యోధనాదుల మీద నడచి యుద్ధంశేశీ ఆవుల త్రిప్పుక వచ్చేటప్పుడు అందరి వొగలును శిరోవేష్టనలున్న వొడశి వచ్చినట్టుగా గలరు.(93-19)

ఇట 'వొడశివచ్చినట్టుగా గలరు' అన్నచోట అర్థం అస్పష్టంగా ఉంది. అర్థస్పష్టత కోసం 'అర్జునుడు చేసినట్లు మీరును చేయగలరు' అని కొన్ని పదాల్ని కలుపుకోవలసి ఉంది.

ఈ విధంగా రాయవాచకంలో వ్యావహారికత అన్ని అంశాల్లో స్పష్టంగా గోచరిస్తుంది.

## సూచికలు

1. చూడు, బూదరాజు రాధాకృష్ణ (వ్యాసం) "ఆధునిక యుగం : గ్రాంథిక వ్యావహారిక వాదాలు," తెలుగు భాషాచరిత్ర, (సం) భద్రిరాజు కృష్ణమూర్తి (1979)
2. డా॥ సి. వి. రామచంద్రరావు (సం), రాయవాచకము (1982)
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1914, ఆనంద, పు. 11.
4. రాయవాచకము (ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ 1933), పు.4
5. అదే : పు. 4
6. కె. గోపాల కృష్ణారావు, పు. 68.
7. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం 9. 81
8. భారతి, 1954, ఫిబ్రవరి, పుట, 148.
9. విజ్ఞాన సర్వస్వము. 8, పు. 832
10 ఎ ఎమ్ కులశేఖరరావు, ఆంధ్ర వచన వాఙ్మయము, పు. 512
10 బి. అదే, పు. 516, 517.
11. రాయవాచకము (1982) పీఠిక 29
12. చూడు, కే. రామాంజనేయులు, 'రాయవాచకం-భాషాపరిశీలనం' ఎం. ఫిల్. సిద్ధాంతవ్యాసం (అము) 1981.
13. చిన్నయసూరి. బాలవ్యాకరణము, సంజ్ఞా. 1,-1 5
14. చూడు, పైదే, సంధి. 1, 4, 5.
15. పైదే, సంధి 1, 4, 5,
16. రామచంద్రరావు, రాయవాచకము (1982) పీఠిక 36

## రెఫరెన్సులు


1. కృష్ణమూర్తి, భద్రిరాజు; తెలుగుభాషా చరిత్ర, (1979) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాసమితి హైదరాబాదు-4.
2. చిన్నయసూరి పరవస్తు; బాలవ్యాకరణము (1 టీకా) విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి (1967). వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
3. రామచంద్రరావు, సి.వి. (సం) : రాయవాచకము (1982) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాద్-4
4. రామయ్యపంతులు, జయంతి (సం); రాయవాచకము (1933) ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రచురణ, సంఖ్య 33, కాకినాడ.
5. రామాంజనేయులు, కె. 'రాయవాచకం-భాషాపరిశీలనం' (ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసం) అముద్రితం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.
6. సుబ్రహ్మణ్యం, పి.యస్ : ద్రావిడభాషలు, సత్యవతీ పబ్లికేషన్స్ అణ్ణామలై యూనివర్శిటీ అణ్ణామలై నగర్. (1977)


[ రచయిత అనంతపురంలో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో పరిశోధక విద్యార్థి ]

# కరప్టెట్ కళ్యాణి

## శ్రీ ఏలూర్చెరి విజయరాఘవరావు

సంసార సాగరంలో
సముద్రమంథన చేస్తూ
ఉప్పొంగిన విషమంతా
'గప్పున' మింగిన యోధను !-
గరళకంఠుడను !-
నాకే
కలికాలపు అంచులపై
కనిపించిన కలల వలలు
కావ్యంలా అల్లుకుంటూ
కాలం గడపాలంటే
కష్టంగా వుందిప్పుడు....
పాతసీసా కొత్తమధువు.
కొనేదెవరు నా కావ్యం ? !
పాడేవాళ్ళు పాడుతున్నా
వినేవాళ్ళు వింటున్నా
కంచు గుండెలో
కించిచ్చలనంలేని
సమాజంలో
ఎవరికోసమీగానం ? !
చెవిటికి శంఖ ధ్వానం !
బ్రతికున్న శవాలెన్నో

చచ్చిన బ్రతుకులతోనే
కడుపుకాలి, కాళ్ళీడ్చుకు
సేవచేసి, చేసి, చేసి
పెంచిన "ఆఫీసుల్లో"
కుర్చీకొక "యాస్"
అతడు "బాస్"
మనకు "భగవంతుడు" !
కర్మయోగి కర్మంతా
బీర్వాలో చదలుపట్టి
బ్రతుకు "ఫయిల్"
బండిగాళ్ళు
బండల్లా కదలనపుడు
చెత్తలోంచి పెకలించిన
చెల్లని, నల్లని, చిల్లుల
బండకాసునైనా సరే
'బిర' "బిర" నడపాలంటే
"బాస్" తోనే బాసలాడి
బల్లకింద చెయ్యిజాపి
బక్షీసును పంచు, చాలు.
బ్రహ్మరాత మార్చి
పరబ్రహ్మలా సుఖించవచ్చు !

జితమన్యుడు, జ్ఞానయోగి
దివిని, భువినిసృష్టించిన
దేవుడు, ఆ రోజుల్లో
జగన్నాటకాన్ని వ్రాసి
ఎల్లా ప్రచురించాడో ! !
(ఈ రోజున అసంభవం...
అది 'తప్ప'ని —
"తిరిగి వ్రాసి
అచ్చువేయగల" మనడం
తాతలు, ముత్తాతలకే
తరంగాని పని యిప్పుడు
ఎవరికోస మీగీతం ? !
శృతికుదరని సంగీతం ?!
అవినీతి ప్రవాహంలో
కుళ్ళిన వేదిక ముందర
కొత్తవీణపై మీటిన
పాత రోదనాలాపన ! ...
ఎవరికోస మీరాగం ? !
వినేదెవరు నా వేదన ? !
ఎవరికోస మీగానం ? !
చెవిటికి శంఖ ధ్వానం ? !

డాక్టర్ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

# తెలుగులో సాంకేతిక పదాల ప్రామాణీకరణ

బోధన భాషగా తెలుగు డిగ్రీస్థాయివరకు అన్ని సబ్జక్టులలో వచ్చేసింది. తెలుగులో ఇంటర్మీడియట్ గ్రంథాలు దాదాపు 15సంవత్సరాలుగా అధ్యాపకులు, విద్యార్థులు ఇతోధిక సంఖ్యలలో వాడుతో ఉన్నారు. డిగ్రీస్థాయిలో 13 సంవత్సరాల నుంచి తెలుగులో విజ్ఞాన, మానవీయ, సామాజిక, వాణిజ్య శాస్త్రాలలో గ్రంథాలు వాడుకలో వున్నాయి. ఇన్ని శాస్త్రాంశాలలో డిగ్రీస్థాయివరకు గ్రంథరచన జరిగిందంటే అనేక వేలసాంకేతిక పదాలు తప్పని సరిగా ఉపయోగించడం కూడా జరిగింది. అయితే ఇన్ని వేలసాంకేతికపదాలు తెలుగులోకి ఎలా వచ్చాయి అనే సందేహం చాలా మందికి రాకమానదు. ఎంమకంటే అంతకుముందు మనకు తెలుగులోవున్న సాంకేతికపదజాలం చాలాతక్కువ. ఇప్పటికీ భారతీయభాషలలో సాంకేతిక పదాలు లేవనుకొనేవారు కూడా లేకపోలేదు.

## పూర్వరంగం

తెలుగులో సాంకేతిక పదజాలాన్ని కూర్చిన అగ్రగాములలో ఒకరైన దిగవల్లి వెంకటశివరావుగారు తాము అర్థశతాబ్దం కిందట ప్రచురించిన "విజ్ఞానశాస్త్ర సాంకేతిక పదావళి" అనే చిన్న పుస్తకానికి పీఠిక వ్రాస్తూ అప్పట్లో తెలుగు సాంకేతిక పదావళి విషయంలో నెలకొని ఉన్న పరిస్థితిని గురించి ప్రస్తావించారు. అప్పట్లో తెలుగులో వైజ్ఞానిక రచనలు చేసిన వారికి సాంకేతిక పదాలకు ముఖ్యంగా హిందీ, మరాఠి పండితులు తయారుచేసిన పదజాలమే మూలం. ఆ రోజుల్లోనే అన్ని భారతీయ భాషలకు పనికివచ్చేటట్లుగా సాంకేత పదాలను రూపొందించాలని హిందీ మరాఠి పండితులు గుర్తించి సాధ్యమయినంత వరకు తమ సాంకేతిక పదాలకు సంస్కృత మూలాలనే తీసుకొన్నారు ఈ సందర్భంలో ప్రత్యేకించి అర్.బి . రానడెగారి "ట్వంటియత్ సెంచరి ఇంగ్లీష్-మరాఠి నిఘంటువు (సాహిత్య; వైజ్ఞానిక, సాంకేతిక" ను, కాశీలోని నాగరి ప్రచారిణీసభవారు ప్రచురించిన హిందీ వైజ్ఞానిక పదజాలాన్ని పేర్కొన వలసి వుంది. ఆ రోజుల్లో ప్రచురితమయిన తెలుగు పాఠ్య గ్రంథాలలో వాడిన వైజ్ఞానిక పారి భాషిక పదాలు, అప్పటి మద్రాసు ప్రభుత్వం వారు ప్రచురించిన చిన్న చిన్న పారిభాషిక పదకోశాలుకూడా చాలా వరకు ఈ ప్రచురణల ఆధారంగా రూపొందించినవే.

తెలుగులో సాంకేతిక పదాలను ప్రామాణీకరించడానికి 1968 వరకు ఎటువంటి ప్రయత్నం జరగలేదు. కాని ఈ శతాబ్దారంభం నుంచి తెలుగులో వైజ్ఞానిక రచనలు అడపాదడపా వెలువడుతూనే వచ్చాయి. కొన్ని విజ్ఞాన సర్వస్వాలు ప్రచురించడం జరిగింది. వీటిలో ముఖ్యంగా పేర్కొనవలసినవి కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రారంభించినది. (అసంపూర్తిగా వుండిపోయింది); ఆచార్య ఖండవల్లి లక్ష్మిరంజనంగారి అధ్వర్యంలో వెలువడినది; తెలుగు భాషా సమితి వారు అనేక సంపుటాలలో వెలువరించినది; ప్రభుత్వంవారు,ప్రయివేటుసంస్థలు హైస్కూలు స్థాయివరకు పాఠ్య గ్రంథాలు ప్రచురించారు. అనేకమంది రచయితలు తెలుగులో సామాన్య పాఠకులకోసం వైజ్ఞానిక విషయాలను గురించి జనరంజక గ్రంథాలు, వ్యాసాలు ప్రచురించారు. పైన పేర్కొన్నరచనలన్నింటిలోను రచయితలు అప్పుడు అందుబాటులో వున్నకొద్దిపాటి సాంకేతిక పదాలను వాడుకోవడం, ఇంకా అవసరమయితే కొత్తపదాలు సృష్టించుకోవడం చేసారు. ఇలా చేయడం వల్ల కొంతఅయోమయపరిస్థితి ఏర్పడక తప్పలేదు. ఎవరిష్టమొచ్చినట్లు వారు పదాలుసృష్టించుకోవడం వల్ల ఒక భావానికి, ఒకే వస్తువుకు వేరువేరు పదాలు వాడటం జరిగింది. ప్రభుత్వం వారు ప్రకటించిన పాఠ్య పుస్తకాలలో కూడా ఇలా జరిగింది.

ఇదే పరిస్థితి ఆ సమయంలో ఇంచుమించు ఇతర భారతీయ భాషలలోకూడా సంభవించిందని చెప్పవచ్చు. ఉదాహరణకు బెంగాలీ భాష తీసుకుంటే, వంగదేశీయులు వారి భాషలో శాస్త్ర రచనలు చేయడంలో మనకన్న చాలా ముందే కృషి ప్రారంభించారు. 1817లో వెలువడిన 'దిగ్దర్శన్' అనే పత్రికలో అనేక వైజ్ఞానిక వ్యాసాలు ప్రచురించారు. అదే సంవత్సరంలో "మే" అనే పాశ్చాత్యరచయిత వ్రాసిన గణిత శాస్త్ర గ్రంథాన్ని బెంగాలీలోకి అనువదించారు. కనక బెంగాలీ వైజ్ఞానిక సాహిత్యావతరణ 19వ శతాబ్దారంభంలోనే జరిగింది. అప్పటి నుంచి ఈనాటి వరకు బెంగాలీ భాషలో అనేక వైజ్ఞానిక గ్రంథాలు, పత్రికలు వస్తూనే వున్నాయి. దాదాపు అన్ని వైజ్ఞానిక, సాంకేతిక రంగాలు వంగసాహిత్యంలో చోటు చేసుకున్నాయి. ఈనాడు వంగ భాషలో ప్రచురిత మవుతున్న వైజ్ఞానిక, సాంకేతిక పత్రికలు 30కి పైనే వుంటాయి. బి. ఎస్‌సి, ఎమ్. ఎస్‌సి, ఎమ్. బి.బి. ఎస్. తరగతులకు కావలసిన గ్రంథాలన్నీ వంగ భాషలో వున్నాయి. చాలా మంది అధ్యాపకులు ఈ తరగతులలో వంగ భాషలో బోధిస్తున్నారు.

అంటే వంగ భాషలో సాంకేతిక పదజాలం చాలా అభివృద్ధి చెందిందన్నమాట. అయితే ఈ పదాలను ఏ ప్రభుత్వసంస్థగాని, ఇతర సంస్థలుగాని తయారు చేయలేదు. రచయితలే వారి అవసరాలనుబట్టి సృష్టించుకొన్నారు, వీటిలో కొన్ని ఇతర రచయితలు కూడా వాడడం వల్ల జనరంజక మయ్యాయి. కొన్ని కాలక్రమేణ నశించి పోయాయి. ఒకేమాటకు అనేక రకాల సాంకేతిక పదాలను వివిధ రచయితలు వాడడం పరిపాటయిపోయింది. వంగ భాషలోని సాంకేతిక పదాలన్నింటినీ ఒకచోట చేర్చి ప్రామాణీకరించాలనే ప్రయత్నం ఇటీవలే ప్రారంభమయింది.

## ప్రామాణీకరణ ప్రక్రియ

1969-70 విద్యా సంవత్సరంనుంచి ఇంటర్మీడియట్ స్థాయిలో తెలుగు బోధన మాధ్యంగా ప్రవేశపెట్టడం జరిగింది. ఇందుకు కావలసిన పాఠ్యగ్రంథాలను అన్ని సబ్జక్ట్‌లలోను తయారుచేయించి, ప్రచురించే బాధ్యతను తెలుగు అకాడమీకి అప్పగించారు. పాఠ్యగ్రంథాల తయారీ కార్యక్రమాన్ని చేపట్టేముందు సాంకేతిక పదాల సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. ఇందుకు మొదటి చర్యగా 1910నుంచి ప్రచురితమయిన సుమారు 215 ప్రచురణలనుంచి సాంకేతిక పదాలను సేకరించడం జరిగింది. సాంకేతిక పదాలను స్వీకరించడానికి వినియోగించిన విభిన్నమూలాలను కింది విధంగా వర్గీకరించవచ్చు.

1. భారత ప్రభుత్వం, మద్రాసు ప్రభుత్వం మొదలైన సంస్థలు ప్రచురించిన సాంకేతిక పదపట్టికలు.
2. కాశీపట్నం కొండయ్య, బాలాంకేశ్వరరావు, దిగవల్లి వెంకటశివరావు, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైనవారు వారి వ్యక్తిగత కృషి ఫలితంగా కూర్చిన సాంకేతిక పద పట్టికలు, నిఘంటువులు.
3. తెలుగు నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు.
4. పాఠ్యగ్రంథాలు— ప్రభుత్వ, ప్రభుత్వేతర ప్రచురణలు.
5. జనరంజకశాస్త్రగ్రంథాలు, పత్రికలు, వార్తాపత్రికలు మొదలయినవి.

ఈ విధంగా 1968 సంవత్సరాంతానికి 1,25,000 సాంకేతిక పదాలు సేకరించడం జరిగింది. 1969 జనవరిలో జరిగిన ఒకసదస్సులో సాంకేతిక పదాల ప్రామాణీకరణకు కొన్ని మార్గదర్శక సూత్రాలను రూపొందించడం జరిగింది. వీటిని కింది విధంగా సంక్షిప్త పరచవచ్చు.

1. అప్పటికే పాఠ్యగ్రంథాలలోను, జనసామాన్యంలోను వాడుకలో వున్న తెలుగుపదాలను సాధ్యమయినంత వరకు తీసుకోవాలి.
2. తెలుగుభాష ప్రత్యేక లక్షణాలకు అనుగుణంగా వున్నంత వరకు కమీషన్ ఫర్ సైంటిఫిక్ అండ్ టెక్నికల్ టర్మినాలజీవారు రూపొందించిన పదాలను సాధ్యమయినంత వరకు యథాతథంగా వాడడంగాని, కొద్దిపాటి మార్పులతో ఉపయోగించు కోవడంగాని చేయాలి.
3. మూలకాలు, రసాయన సమ్మేళనాలు, భౌతికస్థిరాంకాలు, గణిత సమీకరణలు, సూత్రాలు, కొలమానాలు, పేర్లు, ప్రకృతి శాస్త్రాలలోని ద్వినామీకరణ, సంఖ్యలు, సంకేతాలు— వాటికి సంబంధించిన అంతర్జాతీయ సాంకేతిక పదాలను, రేడియో, టెలిఫోన్ మొదలైన సామాన్య పదాలను ప్రతి లేఖనం చేయాలి.
4. కొత్తపదాలు సృష్టించడం సాధ్యమయినంత వరకు చేయకూడదు.

ఈ మార్గదర్శక సూత్రాలను అనుసరించి ఇంతవరకు డిగ్రీ స్థాయివరకు కావలసిన పాఠ్యగ్రంథాలలో వివిధ సబ్జక్ట్‌లలో అవసరమైన సాంకేతిక పదాలను ప్రామాణీకరించి వాడడం జరిగింది. ఈ పదాలు విద్యారంగంలో అధ్యాపక, విద్యార్థి లోకంలో బహుళ వ్యాప్తంగా ప్రాచుర్యం పొందాయి. 1974లో వివిధ సబ్జక్ట్‌లలో నిపుణుల సంఘాలు ఈ పదాలను పునఃపరిశీలించి అవసరమైన సవరణలు చేయడంకూడా జరిగింది.

## సాంకేతిక పదాలు– కొన్ని విమర్శలు, సూచనలు

ఇటువంటి బృహత్తరమైన ఏ కృషిలోనైనా కొన్నిలోపాలు దొర్లకపోవు; విమర్శలు రాకమానవు: సాధారణంగా తెలుగు అకాడమీ రూపొందించిన సాంకేతిక పదాలను గురించి వినవచ్చే విమర్శలను, సూచనలను ఈ విధంగా సంక్షిప్త పరచవచ్చు; పదజాలం కఠినంగా వుంది. ఇంకా సరళంగా వుండాలి. పాఠ్యగ్రంథాలలో వాడిన సాంకేతిక పదాలలో ఏకరూపత వుండాలి. భారతదేశ మంతటా ఒకేరకం సాంకేతిక పదాలుండాలి. సాంకేతిక పదాలను అప్పుడప్పుడు సవరణకు గురిచేయాలి. ఇంగ్లీష్ పదాలస్థానే ప్రామాణీకరించిన తెలుగుపదాలను దశల వారీగా ప్రవేశపెట్టాలి. ఇప్పుడు ఈ విమర్శలు, సూచనలు ఎంత వరకు సమంజసమైనవో పరిశీలించడం భావ్యంగా వుంటుంది.

తెలుగు సాంకేతిక పదాలు కఠినంగా వున్నాయనడం సమంజసంకాదు. ఇంగ్లీష్‌లో వాడుతున్న పదాలు ఏవీ సులువుగా లేవు. కాకపోతే ఇంత కాలంగా మనం వాటికి అలవాటు పడ్డాం. కొత్తదేదైనా కఠినంగానే కనిపిస్తుంది. ఇంగ్లీష్‌లో వాడుతున్న సాంకేతిక పదాలు చాలావరకు గ్రీక్, లాటిన్, ఇతర భాషలనుంచి వచ్చినవే. ఇవి పాఠకులకు సులువుగా అర్థంకావనటం సత్య దూరం కాదు, ఉదాహరణకు వృక్షశాస్త్రంలో సామాన్యంగా వాడే కాంబియం అనే పదానికి అర్థం

చాలామందికి తెలియదు.తెలుగులో దీన్ని విభాజ్యకణావశిష్టాంటున్నాం. ఇది అందరికీ సులువుగా బోధపడుతోంది. అలాగే గామీట్, స్పోర్, జైగోట్ అనే పదాలకు సంయోగ బీజం, సిద్ధ బీజం, సంయుక్త బీజం అనే మాటలు వాడుతున్నాం. వీటినుంచి గామీటోఫైట్ అనే పదానికి సంయోగ బీజదం అనీ, స్పోరోఫైట్ అనే పదానికి సిద్ధబీజదం అనీ వ్యుత్పన్నం చేశాం. ఉవి అర్థవంతంగా, ఉండి జ్ఞాపకం పెట్టుకోడానికి సులువుగా వున్నాయి. కొన్ని సందర్భాలలో ఇంగ్లీష్ పదాలకన్న తెలుగు పదాలు ఎక్కువ సంతృప్తికరంగా ఉన్నాయి. ఉదాహరణకు గ్రీక్‌పదం హైడ్రోఫిలీ అంటే నీటిని ప్రేమించడం అని అర్థం. కాని వృక్షశాస్త్రంలో జలపరాగ సంపర్కం అనే పదంసరి అయినది. అలాగే ఎంట మాఫిలీ. అంటే కీటకాలను ప్రేమించడం. కాని దీనిని తెలుగులో కీటక పరాగ సంపర్కం అంటున్నాం. వృక్షశాస్త్ర రీత్యా ఇదే సరిఅయిన పదం.

కొన్ని తెలుగు సాంకేతిక పదాలు క్లిష్టంగాను, కఠినంగాను వున్నాయనేది వాస్తవమే. కాని సాధారణంగా అటువంటి సందర్భాలలో వాటికి అనురూపమైన ఇంగ్లీష్‌పదాలు కూడా క్లిష్టంగానే వుంటాయి. ఉదాహరణకు "ఆంఫిఫ్లోయిక్ సైఫొనోస్టీల్"అనేఇంగ్లీషుపదానికి తెలుగు సమానార్థం ఉభయపోషక కణజాల నాళాకార ప్రసరణ స్తంభం. ఇటువంటి చోట్ల అధ్యాపకులు, విద్యార్థులు వారి వీలునుబట్టి తెలుగు పదంగాని, ఇంగ్లీష్ పదంకాని వాడవచ్చు.

అయితే సాంకేతిక పదాలన్నీ సరళంగా సామాన్య ప్రజలకు అందుబాటులో వుండాలనేవాదం సమర్థనీయం కాదు.ఇది ఏభాషలోనైనా సాధ్యమయ్యేది కాదు. ఆధునిక శాస్త్రవిషయాలను అధ్యయనం చేసే వారికోసం రూపొందించినవే కాని ఈ పదాలు సామాన్యుల కోసం కాదు సామాన్యుల కోసం జనరంజక రచనలు చేసేవారు సాంకేతిక పదాలుసాధ్యమయినంత వరకుతగ్గించి విషయం సులువుగా బోధపడేటట్లు, చేయవలసిన అవసరం వుంది. అంతే కాని సామాన్యపాఠకులను దృష్టిలో వుంచుకొని సాంకేతిక పదాలను రూపొందించాలనటం సమంజసం కాదు.

సంస్కృత పదాలు వీలైనంత వరకు తగ్గించాలనేవారు కొందరున్నారు. అయితే మన సాధారణ నిత్యజీవిత భాషలోనే సంస్కృత పదాలు, అన్య భాషా పదాలు కొల్లలుగా వున్నప్పుడు, సాంకేతిక పదాలలో వాటిని విసర్జించడం ఎందుకో అర్థంకాదు. పైగా భారతీయ భాషలలో సాంకేతిక పదాలలో కొంతలో కొంత ఏకరూపత కావాలంటే సంస్కృత పదాలను విరివిగా వాడక తప్పదు. లేకపోతే ప్రాంతీయ వ్యత్యాసా లెక్కువయి అయోమయ పరిస్థితి ఏర్పడుతుంది. ఒక ప్రాంతంలో విద్యాభ్యాసం చేసినవారు వేరొక ప్రాంతంలో ఉద్యోగం చేయవలసి వచ్చినప్పుడు వారికి క్లిష్టసమస్య లెదురవుతాయి.

## అనువాదమా? ప్రతి లేఖనమా?

సాంకేతిక పదాలన్నీ ప్రతి లేఖనం చెయ్యాలనీ తెలుగుపదాలు అసలు వాడకూడదనే వారివాదం పరిశీలిద్దాం. చాలామంది ప్రొఫెసర్‌లు ఏదో ఒకరూపంలో ఈ వాదాన్ని బల పరుస్తోవచ్చారు. ఇప్పటికే చాలా పదాలు ప్రతి లేఖనంచేసి వాడుతున్నాం. ఉ:- ఎలక్ట్రాన్, ప్రోటాన్, అయాన్ మొస్పిరామీటర్, ఫోటోమీటర్, రెస్పిరోస్కోప్, వెర్నియర్ కాలిపర్స్ బ్యూరెట్, పైపెట్‌వంటి పరికరాల పేర్లు ప్రతిలేఖనం చేస్తూనే ఉన్నాం. బెరామీటర్, థర్మామీటర్, లక్టోమీటర్‌వంటి పదాలు సామాన్యుల వాడుకలోకి కూడా వచ్చేసాయి. అందువల్ల వాటిని అనువదించ వలసిన అవసరంలేదు. ఈ రోజుల్లో సామాన్యులుకూడా. దైనందిన జీవితంలో ఎన్నో వైజ్ఞానిక విషయాలు తప్పని సరిగా తెలుసుకొంటున్నారు. రేడియో, టి వి, వార్తాపత్రికలు, మాగజైనులు వంటి ప్రచార సాధనాలద్వారా వెలువడే వ్యాపార ప్రకటనలలో, ప్రసంగాలలో, వ్యాసాలలో ఎన్నో సాంకేతిక పదాలు వస్తున్నాయి, వ్యవసాయం, పోషణ, ప్రజారోగ్యం, పశుసంరక్షణ, కుటుంబ సంక్షేమం మొదలైన విషయాలను గురించి గ్రామస్తులకు కూడా ఈ ప్రచార సాధనాలద్వారా అధునాతన సమాచారం అందుతోంది. పోలిఎస్టర్, టెరిలిన్, పెనిసిలిన్, క్లోరోమైసిటిన్, ఆరోమైసిన్. టెట్రాసైక్లిన్ డి.డి.టి., గమాక్సేన్, ఫినైల్, క్వినైన్, మలాథియాన్, యూరియా, పొటాష్, ఫాస్ఫరస్ వంటి పదాలెన్నో నిత్యం వాడుకలోకి వచ్చాయి. జనరంజక మయ్యాయి.అందువల్ల ప్రతిలేఖనం చేసిన పదాలు వాడడంలో ఎవ్వరికీ ఎటువంటి సందేహంకానీ, సంకోచంకానీ ఉండనవసరంలేదు. పాఠకులు తప్పకుండా వాటిని ఆదరిస్తారు. వారిభాషలోకి ఇముడ్చుకుంటారు. మన భాషలోకి ఈ విధంగా ఎన్నో కొత్తపదాలు చేరుతున్నాయి. నిజానికి ఈ విధంగా రేడియో, టి వి, వార్తాపత్రికలు, మాగజైన్‌లవంటి ప్రచార సాధనాలలో వాడుతున్న సాంకేతిక పదాలను సేకరించి, క్రోడీకరించడం వల్ల సాంకేతిక పదాల రూపకల్పనకు దోహదం కలుగుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అయితే అంతకంతకు ఎక్కువ సాంకేతిక పదాలను ప్రతి లేఖనం చెయ్యడం వల్ల కొంత ప్రయోజనం కనిపించినా అన్ని సాంకేతిక పదాలను ప్రతిలేఖనం చేస్తే చదవడంలోను, బోధించడంలోను సౌలభ్యం కుంటుపడుతుంది. ఒకవిధంగా హాస్యాస్పదంగా కూడా తయారవవచ్చు. ఉదాహరణకు ఈ వాక్యాన్ని చూడండి: బార్ విషయంలో హోమోజైగస్ అయిన కల్చర్‌లో వైల్డ్‌టైప్ మ్యుటేషన్‌లు 1600లో ఒకటి చొప్పున వస్తాయి. ఇది అసలు తెలుగువాక్యం లాగే కనిపించదు. ఇంకా ఎక్కువ సాంకేతిక పదాలున్న వాక్యాలు చదవడానికి ఇంకా ఎబ్బెట్టుగా వుంటాయి. పాఠకుల, శ్రోతల సౌలభ్యాన్ని దృష్టిలో వుంచుకొని ఇప్పటికే ప్రచారంలోవున్న తెలుగు సాంకేతిక

పదాలను అలాగే వుంచేసి, తెలుగు సమానార్థకాలను రూపొందించడం కష్టంగా వున్న కొత్తపదాలను ప్రతిలేఖనం చేయడం సమంజసంగా కనిపిస్తుంది. కొన్ని సందర్భాలలో మూలభాషలో వున్న పదాలను పోలివుండి, దాదాపు అదే అర్థాన్నిచ్చే పదాలు దొరకడం తటస్థిస్తుంది. ఉదా॥కు "కరోటిడ్" అనే ఇంగ్లీష్‌పదానికి కారోటఅని, "ప్లెక్సస్" అనే పదానికి ప్లక్షంఅని, మ్యాట్రిక్స్ అనేపదానికి మాతృకఅని వాడుతున్నాం.

ఇప్పుడు ప్రతి లేఖనంచేసివాడుకుంటున్న ఇంగ్లీష్ పదాల స్థానంలో క్రమంగా తెలుగుపదాలను ప్రవేశపెట్టాలనే వాదం పరిశీలిద్దాం. ఈ విషయలో కేవలం శాస్త్రీయ దృక్పథంతో, ఆచరణలో వుండే ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని నిర్ణయాలు తీసుకోవాలి గాని స్వభాషాదురభిమానానికి తావివ్వకూడదు. తెలుగులోకి అనేక రకాల అన్యభాషాపదాలను సులభంగా ఎరువు తెచ్చుకోవచ్చు. ఇదిమన భాషగొప్పతనం ఇది మన అదృష్టంగా భావించాలి. అలాకాకుండా అన్ని భావాలను తెలుగులోకి అనువదించాలంటే వాటిసరిఅయిన ప్రాముఖ్యాన్ని పూర్తిగా తీసుకురాలేక అవకతవకలు జరిగే ప్రమాదంవుంది. కనక ఇటువంటి మౌలిక సత్యాలను గుర్తించి ప్రతి సందర్భాన్ని జాగ్రత్తగా పరిశీలించి అనువాదమా, ప్రతిలేఖనమా అనే నిర్ణయం తీసుకోవాలి. ఈ విధంగా ఈ రెండువిధానాల మధ్య చక్కని సామరస్యం సాధించవచ్చు. జపాన్‌వారు కూడా సాంకేతిక పదాల విషయంలో అనువాదం, ప్రతిలేఖనం అనే విధానాలను ఇంచుమించు సమపాళ్లలో వుపయోగించారనే సంగతి పేర్కొనవచ్చు.

( ఇంకా వుంది )

# అమృత కిరణం

## తార

చీకటి
వెలుగు
సంగమించేటప్పుడు
అమృతకిరణం
కిటికీరెక్కలు వెనక్కువిరచి
హృదయాన్ని నూటిగా తాకాలనుకొంది
గదిలో
మదిలో
శూన్యాన్ని తిలకించినపుడు
కాళీదుప్పటి కౌగిలివిదిల్చి
కరకుగుండెను నరకాలనుకొంది
ఇప్పుడో
నాకంటికి
కిరణరూప మదృశ్యం
అది వదలిన చైతన్యం
తరతరాల అనుభవాల్ని
సంఘటిత పరుస్తుంది

# రాగకింకిణి

## శ్రీ బుద్ధన్న

ప్రతి పుష్పమ్మొక ముగ్ధమోహన వధూ రత్నాకృతిన్ ఈమృదూ
ర్జిత లావణ్య లతాప్రతానముల నుత్సేకించి, శోభాప్రహా
సిత భాస్వద్దళదర్పణమ్ములవనీసీమంతినీ స్వాంతమున్
ప్రతిబింబించుచు నున్నదంచిత మధుప్రక్షాళితోస్మిలమై.

క్రముకము విచ్చునప్డె, క్రముకమ్ముల తమ్ములపాకు తీవియల్
తమిగొని ప్రాకునప్పుడె,సుతారపు టంగ లవంగవాయుపో
తములివి సోకునప్పుడె, మిథఃపరిచుంబన యోగ్యమైన యీ
ప్రమదలతానికుంజ వనవాస మొనర్తుమదర్కవిస్మృతిన్.

ఆరజమైన యీ నవవనాంతరసీమలలో సమీరవం –
శీరవముల్ నరాగపరిషిక్తములై సలిథవ్రజాంగనా
కారలతానికుంజ సుముఖమ్ములుగా రవళించె, దూరసిం
దూరపథమ్ము సుప్రణయతోరణ పూరణమై చెలంగగన్.

నడకలలో నొయారములు నవ్వులలో నవమాలికారుచుల్
బుడగలలో నిరీక్షణలు లోల తరంగములందు కోరికల్
సుడియ పచేళిమ ప్రణయ సుందర సంస్కృతులట్లు ఫేనముల్
ముడివడ నీ వనాంతమధు మోహన వాహిని స్వాగతంబిడున్.

వనముల వాగులన్ దిశల వాయుపథమ్ముల నిర్విరామ ని
స్వనములు నివ్వటిల్లి శ్రుతిపర్వ మొనర్చి, పురాతనస్మృతుల్
మనసున రేపుచున్ సతము మైమరపించును. సర్వవిశ్వ జీ
వన మనురాగ ముగ్ధమయి ప్రబ్బుకొనన్ సుభగప్రసంగతిన్.

కుమారి పి. చూడామణి

# దుద్దెడ శాసనము

సూర్యుడు చంద్రుడు

శివలింగము

## మొదటి వైపు

1. స్వస్తి శ్రీ జయాభ్యుదయశ్చ
2. శ్రీ శక వర్షణములు ౧౨౧౮ (1218)
3. అవునేంటి దుమ్ముఖ సం
4. వత్సర శ్రావణ శుద్ధ
5. ౧౫ [15] నో 1 శ్రీ మన్మహా
6. మండలేశ్వర కాకెత ప్రతా
7. ప రుద్ర దేవమహారాజు
8. లు ప్రిద్విరాజ్యము సేయుచు
9. ండంగా పొనుంగొపుర
10. వరాధీశ్వరుండైన నాచ
11. య రడ్డింగారి సుపు
12. త్రుండు కాకెత రాజ్యస్థా
13. పనా చాయ్యులైన స్వస్తి
14. శ్రీమతు మాదయ ర
15. డ్డిగారు దుద్దెద స్వయం
16. భు దేవరకు ఆ ఊరి అడ్డ
17. వట్టు సుంఖంది నాయం

## రెండవ వైపు

1. పుట్టిదం వల్ప ఏండాది
2. నెలలు ౧౨కి రంగభోగా
3. నకు పంటను ౮౦ ఎనభ
4. యి మాడల లెక్కను అచ
5. ంద్రాక్కణముగాను ఇచ్చినవి
6. ఎనభయి మాడలు రోధ
7. ధమ్మువు ప్రతి పాదించిన వా
8. రు తమ యిరువమి ఒక్క
9. తీరము పిత్రు (తృ) వగ్గణ మున్ను
10. స్వగాణనకు [వా] త్తురు స్వదత్త
11. . ం ద్విగుణం పుణ్యం పరద
12. త్తాను పాలనం పరదత్తా ప
13. హారేణ స్వ దత్తం నిష్ఫలం
14. భవేత్ ॥

ఈ శాసనము మెదక్ జిల్లా సిద్ధిపేట తాలూకాలో హైదరాబాద్-సిద్ధిపేట రోడ్డులో సిద్ధిపేటకు 12 కి.మీ దూరమున స్థానిక స్వయం భూదేవాలయములో నున్నది. శాసనము స్తంభమునకు రెండు వైపుల లిఖించియున్నది. మొదటివైపు సూర్యచంద్రులు వానికి దిగువగా శివ లింగము చెక్కబడినది. శాసనము మొదటివైపున 17 పంక్తులు, రెండవవైపున 14 పంక్తులు గలవు. ఒకటి రెండు అక్షరములు మినహా యించి శాసనమంతయు చక్కగా నున్నది.

ఇందలి లిపి 13 వ శతాబ్ద మందు ప్రచారమందున్న తెలుగు లిపి. భాష తెలుగుభాష. లేఖకుడు "ృ" త్వమునకు బదులు క్రావడిని, చెక్కినాడు. పంక్తి 8లో పృథ్వీకి బదులు ప్రిద్వీ అని, పంక్తి 9లో "పితృ"కు బదులు పిత్రు అని చెక్కినాడు. నేడు తెలంగాణములో బహుళముగా వాడుకలో నున్న "ఇరువమి" (ఇరువది) "ఎనబయ్యి" (ఎనుబది) అని ప్రయోగాలను శాసనము రెండవ వైపు పంక్తి 8, 3-4లలో మాడగలము. శాసనమంతయు చక్కగా నున్నది.

## శాసనవిషయము

శాసనము "స్వస్తిశ్రీ జయాభ్యుదయశ్చ" అను సంస్కృత మంగళాచరణముతో ప్రారంభమగుచున్నది. శాలివాహనశకము 1218 దుర్ముఖ సంవత్సర శ్రావణశుద్ధ 15 సోమవారం శ్రీ మన్మహా మండలేశ్వరుండైన కాకతీయ ప్రతాపరుద్ర దేవమహారాజులు. పృధ్వీ స్సామ్రాజ్య మేలుచుండగా, పొనుంగొపురాధీశ్వరుడైన నాచయరడ్డిగారి సుపుత్రుడైనవాడు, కాకతీయరాజ్యస్థాపనాచార్య బిరుదము దాల్చిన వాడును యైన మాదయరెడ్డిగారు దుద్దెద గ్రామములో నున్న స్వయం భూదేవుడికి ఆ ఊరిపైన వచ్చు పట్టసుంఖనాయం వలన వచ్చు ఆదా

యమున ప్రతివర్షము పంట ఒకిందికి 80 యెనుబది మాడలు లెక్కను ఆ దేవుడి రంగభోగములకు ఆ చంద్రార్కముగా సమర్పించిరి. ఇట్టి ధర్మము నెవరు ప్రతిపాదించెదరో అట్టివారు తమ 21 తరము పితృ వర్గముతో స్వర్గమునకు వెళ్ళుదురని అభిలషింపబడినది. ఇటుపై దాన ఫలమును, దాని అపహరణ మూలమున గలుగు నిష్ఫలమును గూర్చిన (సంస్కృత) శ్లోకముతో శాసనపాఠము పరిసమాప్తి యగుచున్నది.

ఈ శాసనము యందు పెద్దగా చర్చించవలసిన అంశములు కానరావు. అయినను ఈ శాసనమందుగల స్థానిక మాండలికులైన రెడ్ల ప్రస్తావన వారి బిరుదము దానికి గల రాజకీయకారణము, మరియు నాటి ఆర్థిక వ్యవస్థను దెల్పు కొన్ని అంశములు, వివరణములు అట్టి వానిని సంగ్రహముగా పరికింతుము.

**దానకర్త:—** ఈ శాసనమందు దానకర్త మాదయరడ్డి అతని వంశ క్రమము బిరుదావళి యిట్లున్నది.—

నాచయరడ్డి — పౌనుంగొపురవరాధీశ్వరుడు
మాధయరడ్డి — కాకెత రాజ్య స్థాపనాచార్యుడు

ఇంతకు మించి వీరి యితర వివరము లెవ్వియు కానరావు. మొదట పౌనుంగొపుర వరాధీశ్వరుడైన యీ నాచయరడ్డి యెవరు? ఇందలి పౌనుంగుపుర మెచట గలదు? అట్టి నాచయరడ్డి సుపుత్రుండైన మాదయరడ్డికి కాకెత రాజ్య స్థాపనాచార్య" అను బిరుదమెట్లు గలిగెను అను అంశములను పరిశీలింతుము—

ఇంతవరకుపలబ్ధమైన శాసనములందెచటను యీ పౌనుం గొపురముగాని, ఆ పురవరాధీశ్వరుడైన నాచయరెడ్డి ప్రస్తావనగాని, అతని సుపుత్రుడైన కాకతీయ రాజ్య స్థాపనాచార్యుడుయైన మాదయ రడ్డిని గురించిగాని యెట్టి వివరములు కానరావు. పౌనుంగొపుర మనునది గాని అట్టి నామసామ్యమున్న గ్రామముగాని, దుద్దెడ ప్రాంతములందు గాని, సిద్ధిపేట తాలూకాలోను, కానరావడము లేదు. పూర్వ సాంప్రదాయమున మాదయరెడ్డిగారు, తమ పౌనుంగుపురమునకు గల సంబంధమును సూచించినారు. దాని వునికి, నిర్దేశము యీస్థితిలో వలనుపడదు. భావిపరిశోధనవలన సమ్యక్ నిర్ణయమున కవకాశము గలుగవచ్చును.

ఇక మాదయరడ్డిగారికి యే సందర్భమున "కాకెతరాజ్య స్థాపనాచార్య" బిరుదము సంక్రమించియుండెనో తెల్పవలసియున్నది. —కాకతీయరాజ్యముతో సంబంధమున్న నాటి మాండలికులు పలు వురు యీ బిరుదము ధరించినవారు కనబడుచున్నారు — పద్మనాయ కులోద్భవులైన రేచర్ల వెలిమలు, అందులో రేచర్ల ప్రసాదిత్యునికి "కాకతీయ రాజ్యస్థాపనాచార్య, రాయపితామహాంక," బిరుదములు చార్య రాయపితామహాంక బిరుదములు గలవు[1]— అట్లే ప్రస్తుత శాసనములోని మాదయరడ్డికి కాకతీ రాజ్యస్థాపనాచార్య బిరుదము గలదు. అట్టి బిరుదము లెట్లు వచ్చెనో యిచట విచారింతుము.

కాకతి గణపతి దేవ చక్రవర్తి తదనంతరము తన కూతురు రుద్రమదేవి రాజ్యమునకు రావలెనని కోరి పట్టము గట్టెనను విషయము ఎల్లరెరిగినదే.[2] కాని కాకతిరాజవంశములోని కొందరు, సామంతులు స్త్రీ పరిపాలనమున కిచ్చగించలేదు. వెలుగోటి వారి వంశావళి యందు రేచర్ల ప్రసాదిత్యుని వర్ణించిన ప్రస్తావన మిట్లున్నది[3]. అదెట్లన" ఆ ప్రసాదిత్యుడు కాకతిగణపతి దేవరాయలు చనిన, నతని కొమరిత రుద్రమదేవికి బట్టముఁగట్టి కాకతిరాజ్యస్థాపనాచార్యం బిరుదును, రాయ పితామహాంక బిరుదును [బొంది] డెబ్బది యేడురు నాయంకులం దానొనరించి భైరవ ప్రసాద లబ్ధంబగు పచ్చధయించి నెగడె మహిని" ఈ గ్రంథము సమగ్ర వివరములో చర్చించిన శ్రీ. శ. నేలటూరి వెంకటరమణయ్యగారు, గణపతి దేవుని యనంతరము ప్రసాదిత్యుడు రుద్రమదేవికి కాకతీయరాజ్య పట్టము గట్టి చుట్టుముట్టిన శత్రుమూకల నిర్జించెనని అందుకు ప్రత్యామ్నాయముగా ఆ రాణి అతనికి "కాకతి రాజ్యస్థాపనాచార్య, రాయపితామహాంక" బిరుదముల నిచ్చి సత్కరిం చెననని నుడివినాడు.[4] నాటి పరిస్థితి పరికించి చూడ వెలగోటివారి వంశావళి వాస్తవమునే ప్రకటించు చున్నదని తోచక మానదు.

ప్రతాపరుద్ర చరిత్రలో[5] (ఏకామ్రనాథుడు) గూడ నాటి విప్లవ పరిస్థితిని వర్ణించినాడు. అందు గణపతిదేవునికి ఒకానొక రాణి యందు జన్మించిన హరిహర, మహాదేవులనే కుమారులు అతని కెదురు తిరిగి రాజధానిని ముట్టడించిరని గలదు. అట్టి కుమారులు గణపతి దేవునికి యున్నటుల శాసన ప్రమాణమేదియు లేదు. బహుశః బంధువర్గము వారై యుండవచ్చును. నాటి సాంప్రదాయాను సారము స్త్రీకి రాజ్యార్హత లేదనుట గలదు. తత్కారణమున స్త్రీ రాజ్యమునకు వారసురాలగుటకు ప్రతిఘటన తప్పదాయెనని డా॥ శ్రీ:పి.వి.పి. శాస్త్రిగారి పుట 118 అభిప్రాయము సరియైనదే. తత్కారణమున ఆమెకు అనేకమంది రాజ బంధువులు, సామంతులు శత్రువులైరి. రేచర్ల ప్రసాదిత్యుని వంటి విశ్వాస పాత్రుల వలన ఆమె కాకతిరాజ్య సింహాసన మధిష్టియుండుట అసంగతమేమియు గాదు— అందుకు కృతజ్ఞతగా ప్రసాదిత్యునికి "కాకతి రాజ్య స్థాపనాచార్య రాయపితా మహాంక" బిరుదముల నిచ్చి సత్కరించి యుండెనను వెలగోటి వారి వంశావళి కథనము వాస్తవమే గావచ్చును. నాటి అనేక శాసనములందు ఇట్టి బిరుదమును అనేకులు ధరించుట మనము గమనింతుము. అప్రకటిత విస్సూరు శాసనములో[6] ఎ.డి. 1280 రుద్రనాయకుని కుమారుడగు బిచినాయకుడు కాకతిరాజ్య స్థాపనాచార్య బిరుదము ధరించి ఆ ప్రాంతనాంకరుడై యుండెనని గలదు. కాయస్థులైన జన్నిగదేవుడు అతని సోదరుడు త్రిపురారి,

మహాప్రధాన కందారనాయక, నిశ్శంక మల్లికార్జున మొదలగువారు ఆ రాణికి విశ్వాస పాత్రులై ఆమె పక్షము నిలిచిన వారైరి[7].

అట్టి వారిలో రెడ్డి కులమునకు జెందినవాడును, పొనుంగొపుర వరాధీశ్వరుడైన నాచయరెడ్డి కుమారుడైన ప్రస్తుత శాసనోక్తి మాదయరెడ్డిగూడ కాకతిరాజ్య వారసత్వమున రుద్రమదేవి పక్షము వహించి ప్రముఖ పాత్ర వహించి యుండవచ్చును. పద్మనాయకుడను రేచర్ల ప్రసాదిత్యుని గౌరవించిన విధముగనే రుద్రమదేవి ప్రస్తుత శాసనోక్తి రడ్డి కులమునకు జెందిన మాదయరెడ్డిని కాకతీరాజ్య స్థాపనాచార్య అను బిరుదముతో కృతజ్ఞతతో సత్కరించి యుండును. ఆమె అనంతరము ప్రసాదిత్యుడు కాకతి ప్రతాపరుద్రుని సేవించినటులే యీ మాదయరెడ్డి గూడ ప్రతాపరుద్రుని సేవించి యుండెను. అందులకీ శాసనమే ప్రమాణము.

పద్మనాయకులతో బాటు, తెలంగాణా రడ్డి వర్గము గూడ కాకతిరుద్రమను సమర్థించెనని యీ శాసనమూలమున మనము ఖచ్చితముగా తెలుపవచ్చును.

ఇక యీ శాసనములోని దాన సంబంధముగా నున్న ఆర్థిక పరమైన విషయములో విచారింతుము. శాసనము మొదటివైపు 16వ పంక్తి నుండి రెండవ వైపు 6 వ పంక్తి వరకు దాన వివరము చెప్పబడినది — అదెట్లనగా

16 } 16 నుండి 17 వరకు—స్వయం భూదేవరకు ఆ ఊరి
17 } అడ్డవట్ట సుంఖంది న్యాయం.

రెండవ వైపు

1నుండి 6వరకు { "పుట్టిదం వల్న ఏండాంది నెలలు 12 కి రంగ భోగానకు పంటకు 80 ఎనభయమాడల లెక్కను ఆ చంద్రార్కముగాను ఇచ్చినవి 80 మాడలు" }
అని గలదు.

ఏడాదికి 12 నెలలకు 80 మాడల చొప్పున ఆ స్వయం భూదేవర రంగభోగమునకు దానము చెప్పబడింది. ఇట్టి దాన మిచ్చిన 80ది మాడలు ఆ దుద్దెడ గ్రామములోని "అడ్డవట్ట సుంఖంది నాయం పుట్టిదం వలన" వచ్చిన ఆదాయములోనివి. దీని వివరమాలోచింతము—

నాడు, ప్రముఖ, కేంద్రాల్లో వ్యాపారము విరివిగా సాగెడిది—టోకు వ్యాపారమేగాని, చిల్లర వ్యాపారమేగాని బహుళముగా జరుగు సలములను ఆ నాడు "పంట" "అడ్డ" లేదా "సంత" అని పిలిచెడి వారు.[8] కాని నేడు "సంత"అను పదము మాత్రమే యెక్కువ ప్రచారమందు కనిపించుచున్నది. ఇట్టి అడ్డ పంట అను పదము ప్రస్తావన మీ శాసనమందున్నటుల చూచితిమి. అనగా ప్రస్తుత శాసనమున్న దుద్దెడ గ్రామము ఒక గొప్ప వ్యాపారకేంద్రమని చెప్పవచ్చును. ఈ శాసనమున "అడ్డవట్టు సుంఖం న్యాయం" అని గలదు. అడ్డ అనగా వ్యాపార కార్యకలాపములు జరుగు పత్యేక స్థలమని అర్థము.[9] ఇట్టి అడ్డలు, పంటలు లేక సంతులు కొన్ని రోజుల కొకసారి నేటి వలె నాడు జరుగుచుండెడివి. తెలుగు సాహిత్యమైన క్రీడాభిరామము పుట 24 నందు కూడ ఈ యైలసంత గురించి వర్ణింపబడినది. విజయ నగరమున కూడ సంత జరుగు చుండెనని చెప్పబడినది. [10] ఇక అడ వట్టు అనగా అట్టి ప్రత్యేక వ్యాపారస్థలములందు సుంకముల గుత్తకు తీసుకొను అధికారము లేదా భాగస్వామ్యమని అర్థము[11] నేడు మనము వ్యాపారస్థలము లందు గుత్తకు తీసుకొని ప్రభుత్వమునకు పన్నుల చెల్లించిన వ్యక్తులను జూచు చుందుము. అట్లే కాకతీయుల కాలమున గూడ యిట్టి ఆచారముండెడిది. అట్టి విధానమే మన ప్రస్తుతశాసనము తెలియపరుచు చున్నది. వ్యాపార కేంద్రమైన దుద్దెడ గ్రామనులో అట్లు గుత్తకు తీసుకున్న సుంకములపై పుట్టి ఒక్కంటికి అనగా పుట్టిధాన్యంపై(20 వది తూములు. ఒకపుట్టి) క్రయ విక్రయముల[11] మూలమున వచ్చు ఆదాయములో ఈ గ్రామమందలి (దుద్దెడ) పంట ఒకటికి సంవత్సరమునకు 80 యెనుబది మాడల చొప్పున ఇచ్చటి స్వయం భూదేవర రాగభోగములకు నిర్ణయించి సమర్పించిరని, తాత్పర్యము, ఇందలి దుద్దెడ గ్రామమేది అను అంశము ప్రస్తుత శాసనము లభ్యమైన నేటి దుద్దెడ గ్రామమే యీ శాసనమందు పేర్కొనబడిన, దుద్దెడ నేటికిని ఇచటి ప్రాచీన ఆలయమును స్వయంభూదేవాలయమని, శంభుని దేవాలయమని దేవుని స్వయంభుదేవుని స్థానికులు, పిలుచుట గలదు. వారమున కొకసారి సంతగూడ జరుగుట గలదు. కనుక నేటి దుద్దడనే శాసనోక్త దుద్దెడ అనునది నిర్వివాదాంశము.

ఇకదాన ప్రతిపాలన విషయమున ఈ శాసనమున కొంత ధర్మశాస్త్రయుక్తమైన జ్ఞాత సంబంధ వృత్తాంత మిమిడియున్నది. ధర్మశాస్త్రములందు ఒక కుటుంబంలో 7 తరములనగా 21 వ తరము వరకు లేదా పురుషాంతరముల వరకు సపిండులని, సోదకులని, జ్ఞాతులని, సగోత్రికులని తమ తమ భేదములు వంశములోని పురుషాంతముల దూరము ననుసరించి ఒక నిర్ణయము గలదు.[12] ఇచ్చట అదే ప్రస్థావన గలదు. పైన చెప్పిన ధర్మము నెవరైతే అతిక్రమించక పరిపాలించెదరో వారు 21 తరములపరకు అనగా అతని పితృవర్గము స్వర్గ భోగానకు అర్హులని తాత్పర్యము. స్వర్గము పుణ్యాపురుషులకని, నరకము పాపులకని సామాన్యముగా అందరెరిగినదే. ఆ

భావమే ఈ శాసనాంతమున నిగూఢ రాజకీయ వృత్తాంతమును ఆర్థిక పరముగా నాటి కొన్ని వ్యాపార పద్ధతులు, సుంక విధాన విషయము లిమిడి యున్నందున అధిక ప్రాధాన్యము గలుగుచున్నది.

## అ ధో జ్ఞా పి క లు

1. కాకతీయులు(వరంగల్లుజిల్లా) పి. వి. పి. శాస్త్రి పేజి 119.
2. ఎపిగ్రాఫి ఆంధ్రిక. వా. నెం. 4. పేజి 97 దయాగజకేసరి యొక్క కన్‌దల్లి ప్లేట్స్ శ్లోకం. 26-27.
3. వెలుగోటివారి వంశావళి డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి పరిష్కరణ పుట 9.
4. అదే (పేజి 6)
5. ప్రతాపచరిత్ర—ఏకామ్రనాథుడు
6. వరంగల్ శాసనములు. డాక్టర్ పి. వి. పి. శాస్త్రి పేజి; 164
7. అదే పేజి. 119
8. అదే పేజి 248
9. అదే పేజి. 231
10. దక్షిణ భారత శాసనములు వా.నెం. 4. పేజి నెం. 248
11. కాకతీయులు. డాక్టర్ పి. వి. పి. శాస్త్రి పేజి. 231
12. మనుస్మృతి యాజ్ఞ్యవల్క్యమఁ. మొదలగునవి.

# యాంటీ క్లైమాక్స్ !

## "పొన్నపల్లి మైత్రీ మాధుర్య"

అదో సెలయేరు
అక్కడెక్కడో పుట్టి
ఇక్కడిక్కడ చిక్కడుతుంది

అదో జలపాతం
ఎత్తునుండి దూకి
గమ్మత్తుగా చిత్తవుతుంది

అదో పర్వత శిఖరం
మోటుగా బయలుదేరి
నూటిగా రాటు దేరుతుంది

అదో ఉద్యానవనం
కొమ్మల కమ్మని వాసన
తెమ్మెరలతో తీగ సాగుతుంది.

అదో వెన్నెల రేయి
చల్లగా ఆహ్లాద పరచి
మెల్లగా వేడి రగిలిస్తుంది

అదో మనస్సు
అందినట్లే అగపడి
అగాధంలోకి తోసేస్తుంది !

# క వి త

## డా॥ గంటి శ్రీరామమూర్తి

నా హృదయోద్యానంలో వికసించిందొక కుసుమం
ప్రసరించిందాశా సౌరభాల నుదయభానుని పోలిక
నాలో పారే రుధిరం సలసలమని కాగి
తలపుటావిరులు తలకెగయగ
నా నాడీయంత్రం ప్రచలించింది.
స్వయంచోదిత ఛందశ్శకటంపై
కవితాకన్య స్వారీ చేసింది
హాయలుగా
నా హృదయోద్యానంలో
విచ్చలవిడిగా
నాఎద పరిమళ వాతావరణంలో
నవనవ వేదనావాసితమై
నిల్వడింది జిహ్వారథ్యపై
లోకసంచారానికై
జీవం మెదలే
తలపులురేపే
ఈ నా మానస పుత్రిక
కాదేమాత్రం కృత్రిమ పుత్రిక

సీరియల్

# సమిధలు

దిలావర్

( గ త సం చి క త రు వా యి )

క్లాసురూం చేపల మార్కెట్టులా, సినిమా హాలులా గోల గోలగా వుంది.

ప్రకాశం మాస్టారు క్లాసులో కొచ్చాడు. ఓసారి క్లాసంతా కలయ చూచి గంభీరంగా గొంతు సవరించుకున్నాడు.

మంత్రించినట్టు ఒక్కసారే నిశ్శబ్దంగా మారింది క్లాసురూం.

రక్తం కాలువ ఆలోచనలు యింకా అతని మనసులో పచ్చగానేవున్నాయి. చీకటి గర్భంలో ఓ వెలుతురు కిరణం కనిపించినట్టుగా వుంది మాస్టారికి.

మనిషిలో నాగరికత ముదిరినకొద్దీ సత్యానికి దూరమవుతున్నాడా ? ఆశనిరాశల అంచుల మధ్య వూపిరి ఆడని జ్ఞానదీపం కొడిగట్టిపోతున్నదా ? పతనం వేపు దిగజారుతున్న మనిషికి ఓటమిని ఒప్పుకునే ధైర్యం సన్నగిల్లుతున్నదా ? అంతులేని యీ ప్రశ్నలు మాస్టారిని కలవర పెడుతున్నాయి. ఆ ప్రశ్నలతో బాటే గుండె లోతుల్లోంచి ఏదో విషయం పైకి వుప్పొంగుతున్నది......

'చాతుర్వర్ణం మయా సృష్టం' అని కృష్ణ భగవానుడు అర్జునికి గీతోపదేశం చేశాడు. కాని యీ ప్రబోధాన్ని ఎంత భ్రష్టు పట్టించారు మన వాళ్లు ! ఈ చతుర్వర్ణాలలో 'నువ్వెక్కువా నేనెక్కువా ?' అనేది తేల్చుకుందుకు నెత్తురు వరదలై పారాలా ? ఈ సంకుచిత దురహంకారాన్ని నిలబెట్టుకునేందుకు మనిషి రక్తం కాల్వలు కట్టాలా ? ఇతిహాసాలకు, పురాణాలకు వక్రభాష్యాలు చెప్పిన దొంగ పండితులు ఎన్ని నెత్తురు టేరులకు కారణమయ్యారో....తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది.....

ఆవేశాన్ని నింపుకున్న ప్రకాశం మాస్టారి గొంతు ఖంగుమన్నది.

"విద్యార్థులారా ! ఇటీవల జరిగిన ఒక సంఘటన నన్ను అమితంగా కుదిపివేసింది. నాలో రగులుతున్న కొన్ని భావాలు మీకు చెప్పాలనుకుంటున్నాను. కేవలం ఒకానొక కులంలో పుట్టడం వల్ల ఏ మనిషీ అధికుడు కాడు. నిరాలంబోపనిషత్తులో 'న చర్మణో నరక్తస్య, న మాంసస్య న చాస్తినః నజాతి రాత్మనో జాతిర్వ్యవహారేణ కల్పితః ! !' అని ఒక శ్లోకం వుంది. ఎంతటి పరమ సత్యమది! చర్మానికీ, రక్తమాంసాలకూ, ఎముకలకూ జాతిలేదు. ఆత్మకు కూడా జాతిలేదు. కేవలం వ్యవహారం చేతనే జాతి లేదా వర్ణం అనేది ఏర్పడుతుంది ఈ సత్యాన్ని ఎంత మంది దర్శింప గలుగుతున్నారు ?

సత్త్వగుణ సంపన్నులులేక బ్రహ్మజ్ఞానం కలిగినవారు బ్రాహ్మణులు. రజోగుణం ప్రధానంగావుండేవారు క్షత్రియులు. తమోగుణ ప్రధానులు శూద్రులు. ఇట్లా ఆయా గుణాలచేత ఒకని వర్ణం నిర్ణయింపబడుతుందన్న శాస్త్రాల ఘోష వినే నాధుడేడీ ? "సీరియస్‌గా చెబుతూ విద్యార్థుల వేపు ఓ సారి చూశాడు మాస్టారు.

మాస్టారి మాటలు వినకుండా చిన్న కాగితాన్ని గుండ్రంగా మలిచి కిష్టు వీపుకు విసిరికొట్టింది లావణ్య.

కిష్టు వెనక్కి తిరిగి లావణ్య వేపు కోపంగా చూశాడు.

మాస్టారి చూపునుండి ఆదృశ్యం తప్పించుకోలేకపోయింది.

"లావణ్యా ! స్టాండప్ !" గద్దించాడు మాస్టారు.

"ఎందుకు సార్ ?" కూచునే అడిగింది లావణ్య.

"ఐ సే .... స్టాండప్... !"

"ఏమిటి సార్ ! ఎప్పుడూ ఆడపిల్లలమీదే విరుచుకు పడతారు?" నసుగుతూ నుంచుంది లావణ్య.

"ఏమిటి ? మీరు ఆడపిల్లలా ? పెద్దగా అనకు తల్లీ ! నవ్వి పోతారు......."

గొల్లుమంది క్లాసంతా.

లావణ్య మోహం కందగడ్డలా మారింది.

"క్రమశిక్షణతో, అణకువతో, ఒద్దికగా బుద్ధిగా వుండి బాగా చదువుకోండి తల్లీ అని మీ తల్లిదండ్రులు పంపిస్తారు. మీరేమో జానెడు బెత్తెడు గుడ్డలతో కప్పిస్తూ ఫేషన్ పేరుతో చెప్పినట్టు అలంకరించుకొని అది చాలదన్నట్టు వాళ్లతో చెప్పులతో సంగీతాలను కొడుతుంటే... కాని పరిణామం లెక్క వుంటాయో మీ చెప్పులే తెలుస్తాయి...."

"మీరేం దిగులు పెట్టుకోకండి సార్! మా క్షేమం మాకు తెలుసు."

"అవునమ్మా ! మీరు చాలా పెద్దవాళ్ళైపోయారు. చెప్పుల్ని నాగరికతగా భావించేంత పెద్ద వాళ్లు.... ఆల్ రైట్. నువ్ కూర్చో...." అంటూ మళ్లీ తన ధోరణిలో పడిపో మాస్టారు

"మన పుణ్యభూమిలో శూద్రుడు బ్రాహ్మణత్వం పై బ్రాహ్మణుడు చండాలుడుగా దిగజారిన సందర్భాలు ఎన్నో వు మనుస్మృతిలోని యీ శ్లోకం వినండి......

శూద్రో బ్రాహ్మణశ్చైతి శూద్రతాం
క్షత్రియాజ్జాతా మేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥

అంటే శూద్రుడు బ్రాహ్మణత్వమూ పొందవచ్చు. బ్రాహ శూద్రత్వమూ పొందవచ్చు నన్నమాట. అదే విధంగా క్షత్రి



స్యతు కూడా. అందుకే 'నాట్ బై బర్త్ బట్ బై వర్త్' అన్నది...."
) చెబుతుండగా ఎవరో సన్నగా వెక్కుతూ ఏడుస్తున్నట్టు విని
వింది.

"ఎవరది?" అన్నాడు మాస్టారు.

"సార్! నా వెనక బెంచీమీద కూర్చున్న మగపిల్లలెవరో మాటి టికి నా జడపట్టుకొని లాగుతున్నారు..." కళ్లతుడుచుకుంటూ లేచి ంచుంది లావణ్య.

"మ్యావ్........ మ్యావ్........ భౌ... భౌ..." అంటూ సేపు మిమ్మిక్రి లైపు అల్లరి........ ఆ తర్వాత నవ్వులు........

"ఎవరయ్యా అది?" అసహనంగా అన్నాడు మాస్టారు.

"అంతేకాదు సార్! ఎవరో లవ్ లెటర్ రాసి పుండచుట్టి నామీద సేశారు...." ఏడుస్తూనే అంది లావణ్య.

కిష్టు లావణ్య వేపు చూసి యిందాక నువ్ చేసిందానికి యిది ఫలితం అన్నట్టు తలవూపి చిలిపిగా నవ్వాడు.

"సార్!" ఏడుపుతోసుకు రావడంతో గొంతు పూడుకుపోయి మీ చెప్పలేక పోతున్నది లావణ్య.

"ప్రమాదాలను చేతులారా ఆహ్వానిస్తూ మళ్లీ ఏడుస్తావెందు మ్మా....?" అన్నాడు మాస్టారు.

"అదికాదండి..." ఏదో చెప్పబోయింది లావణ్య.

గంట టంగున మోగింది.

"సర్లే. రేపు చూద్దాం. కూచో." అంటూ క్లాసునుంచి బయటి ొచ్చాడు మాస్టారు.

"సార్! మిమ్మల్ని ప్రిన్సిపాల్‌గారు రమ్మంటున్నారు" అని లిచాడు అటెండర్.

"వస్తున్నాపద" అంటూ ప్రిన్సిపాల్ గదికి వెళ్లాడు మాస్టారు.

"ఏంసార్! పిలిచారట?" అన్నాడు మెల్లగా.

ప్రిన్సిపాల్ మొహం ముటముట లాడించుకుంటూ "ఏం చెబు న్నారు క్లాసులో?" అని అడిగాడు.

"పాఠం" స్పష్టంగా అన్నాడు మాస్టారు.

"అదే... ఏం పాఠం?"

"కులమత వర్గ విచక్షణ రహితమైన లౌకిక రాజ్యాంగం అర్థమయ్యేందుకు కొంత యింట్రడక్షన్ అవసరం. అదే చెప్పాను."

"కులమతాల పేరుతో విద్యార్థులను రెచ్చ గొడుతున్నారు."

"రెచ్చ గొట్టడం కాదు. కులమతాలు కేవలం కల్పితాలని వచ్చ జెప్పుతున్నాను."

"ఐనో... ఐనో... మీరు చెబుతున్నది నేను విన్నాను. విద్యార్థుల్ని ప్రొవోక్ చేసి కాలేజి వాతావరణాన్ని కలుషితం చేసే వారిని ఏరి పారేయండని స్ట్రిక్ట్ యిన్‌స్ట్రక్షన్సు వున్నాయి తెలుసా?" కళ్లద్దాలు ముక్కు పైకి తోసుకుంటూ అన్నాడు ప్రిన్సిపాలు.

మాస్టారు మౌనంగా వింటున్నాడు.

"బీ కేర్‌ఫుల్ హియరాఫ్టర్. వూకదంపుడు వుపన్యాసాలు చాలించి పాఠాలుమాత్రమే చెప్పండి. యూ కెన్ గో."అధికారదర్పాన్ని గొంతులో పలికించేందుకు అన్ని జాగ్రత్తలూ తీసుకొని అన్నాడు ప్రిన్సిపాల్.

ప్రకాశం మాస్టారు స్టాఫ్‌రూం కొచ్చి కూలబడ్డాడు.

ప్రిన్సిపాల్ బలహీనతకు లోలోన నవ్వకుండా వుండలేక పోయాడు మాస్టారు.

ప్రిన్సిపాల్ కెందుకు కోపమొచ్చిందో తనకు తెలుసు. మానవు లంతా ఒక్కటే అంటే ఎవరు వొప్పుకోరో, కులమతాలు లేవంటే ఎవరికోప్పమో, హెచ్చుతగ్గులు కల్పితాలంటే ఎవరికి సయించదో- ఆ వర్గానికి చెందినవాడు ప్రిన్సిపాల్.

ఉన్నది ఉన్నట్టు చెబితే నేరం! వాడ్ని ఏరి పారేస్తారు!

ఏ కులంవాడు ఆ కులంవాడ్ని చేరదీసి 'కలం' బలానికికాక 'కులం' బలానికి మెరిట్ అవార్డులిస్తే వాళ్ల ఆదర్శ అధ్యాపకులు! ప్రాథమిక పాఠశాలల నుండి విశ్వవిద్యాలయాల వరకు ఈ కులం కత్తికి ఎన్ని పసిమనసులు గాయపడుతున్నాయో! ఎంత మంది భవిష్యత్తు శూన్యమవుతున్నదో! కార్చిచ్చులా వ్యాపిస్తున్న నిరాశా నిస్పృహలు ఎందరి జీవితాలను భస్మం చేస్తాయో......

ఇరవయ్యో శతాబ్దమా! నీ కాళ్లింకా క్రీస్తుకు పూర్వంలో తప్పటడుగులు వేస్తున్నాయి సుమా అనుకున్నాడు మాస్టారు.

## 4

చేతిలో పుస్తకం పట్టుకొని ఒక్కొక్క వాక్యం చదివి మననం చేసుకుంటున్నాడు రవి. అప్పుడప్పుడు గంభీర ముద్రతో కిటికీలోంచి ఆకాశంలోకి దృష్టిసారిస్తున్నాడు.

గదినిండా పుస్తకాలు చిందర వందరగా పడివున్నాయి. రెండు మూడు హేంగర్స్‌కు గుడ్డలు వేలాడుతున్నాయి. ఓ మూల చిన్న చెక్క పెట్టె. మరోవేపు కూజా. చిన్న యినప మంచం. ఓ టేబులు. దానిముందు డొక్కు కుర్చీ. గదంతా అధివాస్తవిక కవిత్వంలా తలా తోక లేకుండా వుంది. ఆధునిక చిత్రలేఖనంలా అస్తవ్యస్తంగా వుంది.

చుట్టూ దట్టంగా అలుముకున్న అడివిని పట్టించుకోని మునీశ్వరుడిలా గాంఢగా పుస్తకంలో మునిగి వున్నాడు రవి. విశాలంగా వున్న కళ్ళు ఆలోచనలను నింపుకున్నాయి. నుదుటమీద చిందరవందరగా పడ్డజుత్తు నిర్లక్ష్యాన్ని కాక అతని ధ్యానాన్ని తెలుపుతున్నది. కొనదేలిన ముక్కు అతని కోల ముఖానికి గాంభీర్యం కలిగిస్తున్నది.

అతనిలో ఆలోచనా స్రవంతి సాగిపోతున్నది. బ్రతుకు చుట్టూ ఎంత బలంగా ఆశలు పెనవేసుకున్నాయని ఎంత లాలసను గుబాళించాయని! సినిమాలు, సాహిత్యం, వుపన్యాసాలు తన మనసులో దూరిన ప్రతిదీ ఓ సుందర స్వప్నంలా సాక్షాత్కరించేది. ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాడు. ఆ కలలుపాకే పందిళ్ళు వాస్తవంలో లేవని. తన ఆశయాలకు యీ కలలు నీరుపోసి పెంచలేవని.

నిన్నటి వరకూ మూఢవిశ్వాసాలు, కట్టుబాట్లు అనే చీకటి గుహలో ముక్కుమూసుకుని వున్నాడు. కాని యీ నాడు ఏ మంత్ర నగరి కాంతి కవాటాలో తన కోసం తెరుచుకున్నట్టున్నాయి. ఏ అద్భుత యింద్రజాలమో తనలో ప్రవేశిస్తున్నటుంది. ఇన్నాళ్ళుగా తానెరగని మరో ప్రపంచపు సుందర తీరాలు తనను ఆహ్వానిస్తున్నాయి....

పుస్తకంలోని అక్షరాలవెంట కళ్ళు పరుగులు తీస్తున్నాయి. కమ్యూనిస్టు సైన్యాలను షెన్‌సీ ఉత్తర రాష్ట్రానికి బదిలీ చేయడం ద్వారా ఛాంగ్ దాడుల్ని త్రిప్పి కొట్ట గలమనీ, జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా సైనిక చర్య తీసుకోవడం సాధ్యమవుతుందనీ మావో సేటుంగ్ చెప్పిన జ్యోతిష్యం చారిత్రాత్మకమైన 'లాంగ్' మార్చ్‌కు వూపిరి అయింది. కియాంగ్సీ నుంచి షెన్‌సీకి 8 వేల మైళ్ళు చుట్టుదారి వెంట సాగిన సుదీర్ఘపాదయాత్ర గురించి చదువుతూ వుంటే రవి శరీరం గగుర్పాటుతో జలదరిస్తున్నది.

'మోకరిల్లి బతకడం కంటె కాళ్ళమీద నిలబడి మరణించడం మేలు....' అన్న సూక్తి వేదమంత్రంలా అంతరాంతరాళంలో హోరెత్తుతున్నది.

మంచికో చెడుకో మనసు ఓ నిర్ణయానికొచ్చింది. ఇక ఎన్ని కష్టాలు నష్టాలు ఎదురైనా, బతుకు సిలువపై ఎంత త్యాగాన్ని ధారపోయ వలసి వచ్చినా వెనుకాడే ప్రసక్తే లేదు.

చిన్నప్పటినుండి రవిది సాహసిక ప్రవృత్తే. ఓసారి ఓ నిర్ణయం వేపు మనస్సు మొగ్గిందంటే యిక దానికి తిరుగు వుండదు.

కిష్టు స్కూటరుమీద వచ్చి ముంగిట్లో దిగాడు.

వడ్డించిన విస్తరి కిష్టు జీవితం. బాధ్యతలూ భయాలూ ఎరగని వయస్సు. శరీరాన్ని వశం చేసుకున్న యవ్వనం. గుండె నిండా కోరికలు. చేతినిండా డబ్బు. విలాసం సొంతం కావడానికి అంతకన్నా ఏం కావాలి?

హడావుడిగా లోనికొస్తూ "మొదలుపెట్టావా నాయనా! ఎక్కడ దొరికార్రా మీరు? అటు వెళ్తేనేమో ఆ రేవతమ్మగారు మహిళా విమోచనం అంటూ ఎడా పెడా వాయించేస్తుంది. ఇటు వస్తేనేమో రాజాగారు పుస్తకాల వూబిలో కూరుకు పోతారు. మా మోహినీ పిశాచం ఆదే వసంత- కాస్త బుర్రతిరుగుడు వ్యవహారమున్నా ఆదే కాస్తనయం హాయిగా కాలక్షేపం చేస్తుంది." అన్నాడు కిష్టు.

పుస్తకం లోంచి తలెత్తి చూశాడు రవి.

"ఒరేయ్! నీ కిదేం పోయేకాలం రా? హాయిగా ఏ యింగ్లీషు సినిమా కో చెక్కేసి యీ వుదయాన్ని కాస్త వెచ్చపడేయక - ఆ పాడుపుస్తకా లేమిట్రా?"

మూలకున్న ఓ చెక్క పెట్టెమీద చతికిలబడి సిగరెట్ తీసి వెలిగించాడు కిష్టు.

"ఒరేయ్! ప్రపంచ ప్రఖ్యాతిపొందిన వాక్యాలలో ఒక మహత్తరమైన దాన్ని వినిపిస్తా......... విను..." సమాధిలోంచి అప్పుడే మేలుకున్నవానిలా వున్నాడు రవి.

"నా బొంద ప్రపంచ ప్రసిద్ధి పొందిన పుస్తకాలే నాకు తెలీవు. ఇక పేరాగ్రాపులూ, వాక్యాల సంగతి మననడక్కు" గట్టిగా దమ్ము లాగి పొగవదులుతూ అన్నాడు కిష్టు.

"సిన్సియర్‌గా ఒప్పుకున్నందుకు నిన్ను అభినందిస్తున్నాన్రా! అయినా యిలాంటివి మీరు అర్థం చేసుకోవలసిన అవసరం కలగక పోవచ్చు...." ఎటో ఆలోచిస్తూ అన్నాడు రవి.

"అమ్మమ్మ! అంత తిరకాసుగా చెబుతున్నావంటే అందులో మా కవసరమైంది. ఏదో వున్నదన్నమాటే. చదువు నాయనా! వింటాను." కుతూహలంగా అన్నాడు కిష్టు.

"ఇప్పటి వరకూ నడిచిన సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర ..." మరో లోకాన్ని దర్శిస్తున్న వాడిలా దూరంగా చూస్తూ గంభీరంగా చదివాడు రవి.

"ఒరేయ్ రవిగా! నేను నీకేం అపకారం చేశాన్రా! ఓ సారి తెలుగు మాస్టారు 'మడిదున్నుక బతకవచ్చు' అని పజ్జెం జెబితే జడుసుకుని రెండువారాలు మంచమ్మీంచి దిగలేదు. లక్షలాది ఆస్తికి ఏకైక వారసుడ్ని. ఇట్లాంటివి నాకు చెప్పి నన్ను హడల గొట్టి చంపకురా........" మొహం వేలాడేశాడు కిష్టు.

"నిజమేరా! ఇట్లాంటివి వింటే మీ పెట్టుబడిదార్లకు తప్పకుండా జ్వరం వస్తుంది." రవి నవ్వాపుకుంటూ అన్నాడు.

"మళ్లీ అదేమిట్రా...? పెట్టుబడి గిట్టుబడి అంటున్నావు. నిన్ను చూస్తుంటే నాకేమిటో భయంగా వుందిరా." అన్నాడు కిష్టు.

పెట్టుబడి దార్లంటే ఎవరో విను..." అని పుస్తకంలోని కొన్ని పేజీలు తిప్పి చదవడం మొదలెట్టాడు రవి.

"కోట్లాది జనానికి కట్ట బట్టలేదు; అయినా అమెరికాలో పండిన ప్రత్తిచేలను దున్ని పారేస్తున్నారు. కోట్లాది జనానికి తిన తిండిలేదు. కెనడా తన గోధుమ నిల్వల్ని తగల బెట్టేస్తున్నది. వీధి మూలల్లో ఒక కప్పు కాఫీకోసం ఎందరో చెయ్యిచాచి పావలాపరకా కోసం దీనంగా యాచిస్తున్నారు; కాని బ్రెజిల్ తన కాఫీ గింజల్ని సముద్రంలో పారబోస్తున్నది. కార్మికవాడల్లో ఎందరో పసివాళ్లు విటమిన్ల లోపంవల్ల ఎముకల్లో పట్టులేక వొంకర కాళ్లతో వ్యాధి గ్రస్తులవుతున్నారు; కాని దక్షిణాది నుంచి వచ్చే నారింజపండ్ల గుట్టల్ని కార్లక్రింద నలిపి పారేయిస్తున్నారు...." ఓసారి గట్టిగా శ్వాస పీల్చుకొని కిష్టువేపు చూశాడు రవి. "ప్రపంచం మొత్తంమీద కలవరంకరమైన యీ వైరుధ్యం ఏ నిజాన్ని చాటి చెబుతున్నది? ఒరేయ్ కిష్టూ! ఈ పెట్టుబడి దార్లంటే ఏమిటో బోధపడిందా...?" అన్నాడు కిష్టువేపు తీక్షణంగాచూస్తూ.

"నిజమే అనుకో... మరి మనమేం చేస్తాంరా? " అయోమయంగా అన్నాడు కిష్టు.

"మనమే ఏదైనా చేయగలిగిన వాళ్లం. మంచికైనా చెడుకైనా తెగించేది యువతరమేరా..."

రవివేపు– ఎన్నడూ ఎరగనివాణ్ణి చూస్తున్నట్టు చూస్తున్నాడు కిష్టు.

రవి తన ధోరణి కొనసాగిస్తూనే వున్నాడు.

"రానున్న విప్లవం పట్ల భయంతో పాలక వర్గాలు వణికిపోవాలి, కార్మికులకు పోయేదేమీలేదు. తమ సంకెళ్ళు తప్ప. ఒక వినూత్న ప్రపంచం వారిది కాబోతున్నది. దేశ దేశ కార్మికులారా ఏకంకండి.... !" రవి కళ్ళు ఎర్రమందారాల్లా మారిపోయాయి. రక్తంలోంచి, నరాల్లోంచి, కండరాల్లోంచి ఆవేశం తన్నుకు వస్తున్నది. పిడికిలి బలంగా బిగుసుకుంది. మరో ప్రపంచం లోంచి మాట్లాడుతున్నట్టుగా వున్నాడు రవి.

"ఈ మాట లెక్కడ్నుంచి వుదాహరించానో తెలుసా ? కమ్యూనిస్టు మేనిఫెస్టోలోని ఆఖరి వాక్యాలవి. ఆ వినూత్న ప్రపంచం సాధ్యమైనంత త్వరగా వచ్చేందుకే మనమంతా ఏకం కావాలి...." సుడులు తిరిగే వుద్వేగంతో వూగిపోతున్నాడు రవి.

"ఒరేయ్ రవీ ! నాకు భయమేస్తున్నది. నువ్వు ఆరోగ్యముగా వున్నావా ? " అన్నాడు కిష్టు నుదుట పట్టిన చెమట తుడుచుకుంటూ.

"ఇంతకాలం నన్నావహించిన అనారోగ్యం ఇప్పుడిప్పుడే మంచు పొరలా కరగిపోతున్నది. జ్ఞాన సూర్యోదయం కలుగుతున్నది. ఈ దోపిడీ ఆగందే. ఈ వ్యవస్థ మారందే వర్గపోరాటం ముగియందే సమ సమాజ స్థాపన జరగడం కల్ల....ఆ మహా యజ్ఞంలో మనం సమిధలమైనా పర్లేదు...."

"అబ్బబ్బ....! పిడుగులు పడ్డట్టు ఏమిట్రా ఆ గావుకేకలు? నాకు గుండె దడ వచ్చేట్టుందిరా. అపరా నాయనా! ఒట్టేసుకుంటున్నా గదా. యింకెప్పుడూ నీ రూంకు రాను. బాబ్బాబు. ఈ సారికి క్షమించి ఒదిలెయ్‌రా ! "

రవికేసి చూడనైనా చూడకుండా స్కూటర్‌మీద వుడాయించాడు కిష్టు.

( ఇంకా వుంది )

# జనారణ్య రోదనం

## శ్రీ చల్లా రామఫణి

గంపెడు పేడతో చేసిన
గంపెడు పిడకలు కాలితే బూడిదై
అంట్లు తోమడానికైనా పనికొస్తాయ్
ఆరడుగుల మనిషి బూడిదైతే
కాటికాపరికి కూలి దండగే కాని;
మానవత్వానికి పునాది కాలేదు ! !

# అతిమిత....

## శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

ఆలోచన అలసిపోతే
అతివాదం మొలుస్తుంది.
ఊహారెక్క సీరసిస్తే
మితవాదం మెరుస్తుంది.

శ్రీ కె. రామమోహనరావు

# విష్ణుకుండినుల కాలమునాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులు, కళలు

విష్ణుకుండినులది విశాలమయిన సామ్రాజ్యము. ఉచ్చస్థితిలో నుండినపుడు తూర్పున బంగాళాఖాతము నుండి పశ్చిమమున అరేబియా సముద్రం వరకు ఉత్తరమున నర్మదనుండి దక్షిణాన కృష్ణానది దిగువ ప్రాంతాలవరకు విస్తరించింది. మొత్తం పరిపాలనాకాలం రమారమి మూడువందల యాభైసంవత్సరాలు, శాతవాహనుల పరిపాలన అంతరించిన తరువాత, తూర్పుచాళుక్యులు వేంగిని స్వాధీనం చేసుకొని తమ పరిపాలన ప్రారంభించినదాకా ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజవంశీయులలో విష్ణుకుండినులే చెప్పుకోదగ్గవారు. దానికి కారణం వారి విశాలమయినరాజ్యమూ, మూడున్నర శతాబ్దాల పరిపాలనాకాలం కానేకాదు, వారి సుదీర్ఘమయిన పరిపాలనా కాలంలో వారు సాధించిన ప్రగతి. ప్రజారంజకంగా పాలించినతీరు, కనపరచిన మతసహనము, శిల్పకళా వైదుష్యము, అరివీర భయంకరులై యుద్ధములలో సాధించిన విజయములతోబాటు, ప్రజల యోగక్షేమాలను కూడ దృష్టిలో పెట్టుకొని చేసిన పరిపాలనా దక్షత, కవిపండిత పోషణతోపాటు, భాషాభిమానం, వైదిక క్రతువులను నిర్వర్తించుటయందు, బ్రహ్మజ్ఞానులయిన వేదవిదులు, ద్విజుల యెడల చూపిన గౌరవాదరములు, యిత్యాది సుగుణములవల్లనే వారిని ఆంధ్రదేశచరిత్రలో పెద్దపీటపై నిలిపింది.

వారి పరిపాలనాకాలంలో సాంఘిక ఆర్థిక పరిస్థితులు కళా పోషణ మొదలయిన వివరాలు తెలుసుకోతగినవి.

విష్ణుకుండినుల పాలనావ్యవస్థ శాస్త్ర సమ్మతయిన వంశపారంపర్యమైన రాజరికము. ప్రమాద పరిస్థితులలో తప్ప, తండ్రి తరువాత పెద్దకుమారునకే రాజ్యం సంక్రమించాలనే సాంప్రదాయం ఎప్పుడూ మన్నించి పాటింపబడేది.

యుద్ధసమయాలలో రాజే స్వయంగా సేనలను యుద్ధభూమికి నడిపించేవాడు. ఇన్ద్రభట్టారకమహారాజు అనేక చతుర్దంత యుద్ధములలో పాల్గొని విజయము సాధించినట్లు చెప్పబడినది.[1]

విష్ణుకుండిన రాజులు ఎడతెరపి లేకుండా అనేక యుద్ధాలలో పాల్గొనినట్లు వారి శాసనాలవల్ల తెలుస్తున్నది. వర్ణాశ్రమధర్మాలను కాపాడటం కోసం, సాంఘిక, మతపరమైన శాంతి, సామరస్యాలు నెలకొల్పడం కోసం యుద్ధాలు తప్పేవికావు. ప్రజల యోగక్షేమాలు, సౌకర్యాలు చూసేటర్పు, సహనం, విజ్ఞానం రాజుకలిగి ఉండటం ఎంతో అవసరం. అటువంటి నైతిక విలువలు కలిగి ఉన్నరాజు సాధారణ పౌరులకంటె అధికుడై ఉంటాడు.[2]

## సాంఘిక పరిస్థితులు

విష్ణుకుండినుల కాలంలో ఆంధ్రదేశంలో వర్ణవ్యవస్థ అమలులో ఉండేది. గోవిందవర్మ బ్రాహ్మణులకు అనేక దానధర్మాలు చేశాడని వారి శాసనాలు చెపుతున్నాయి. వారు "బ్రహ్మక్షత్రియులు" కావడం చేతనేమో బ్రాహ్మణులంటే వారికి అభిమానం మెండు.

క్రీస్తుశకారంభ సంవత్సరాలలో యజ్ఞయాగాది క్రతువులుచేసి ధర్మాన్ని పరిరక్షించేందుకు దక్షిణాదిన బ్రాహ్మణులు రాజవంశీయులను "బ్రహ్మక్షత్రియులు"గా మార్చేవారు.[3] రాజులు, బ్రాహ్మణులకు అగ్రహారాలు దానం చేసేవారు. బ్రాహ్మణులు వేదములు పఠించుట, బోధించుట, క్రతువులను చేయుటద్వారా ప్రజలకు, దేశమునకు శాంతి సౌభాగ్యములను కలుగ జేయుచుండిరి. ఆనాటి అగ్రహారములు విజ్ఞానకేంద్రములుగా నుండి దేశమంతటా విజ్ఞానవీచికలు వెదజల్లుచుండెడివి. చారిత్రకాంశములు కలిగి దీర్ఘమైన ఉపోద్ఘాతములతో నిండిన దానశాసనములు ఆనాటి రాజకీయ, ఆర్థిక పరిస్థితులను తెలియజేయుచున్నవి.

స్త్రీలు సంఘములో ప్రముఖపాత్ర వహించిరి. పురుషులతో సమానముగా హక్కులను కలిగియుండిరి. పృథ్వీమూలుని కుమార్తెయు. గోవిందవర్మ పట్టపురాణి అయిన పరమభట్టారికా మహాదేవి అన్నివిధాలా భర్తకు దగిన భార్యగా పేరు పొందినది. ఆమె 'శక్రపురమను' చోట బౌద్ధ భిక్షువులకొరకు విశాలమయిన విహారమును కట్టించి అచటి ధూపదీపనైవేద్యములకగు ఖర్చు నిమిత్తము 'పెణకపఱ' అను గ్రామమును దానముచేయించెను.[4]

హైదరాబాదుకు సమీపంలోని కీసరగుట్ట వద్ద జరిపిన త్రవ్వకములలో రాతితో చెక్కబడిన చిన్న స్త్రీ మూర్తి విగ్రహము యొక్క



కీసరగుట్ట త్రవ్వకాలలో లభించిన శిల, టెర్రకోటుబొమ్మలు

తలకట్టు పనితనము ఆనాటి స్త్రీల కేశాలంకరణ పద్ధతిని సూచించుచున్నది. స్త్రీపురుషులిరువురు ఆభరణములు ధరించెడివారు. ముఖ్యముగా చెవులకు మట్టితో చేసిన చక్రములను ధరించెడి వారనుటకు నిదర్శనముగా, కీసరగుట్ట, ఏలేశ్వరములలో జరిపిన త్రవ్వకములలో వివిధ సైజులలో దొరికిన టెర్రకోట బొమ్మరింగులే సాక్ష్యము, టెర్రకోట, విలువైన రాళ్ళతో తయారుచేయబడిన పూసలు కూడ పై ప్రదేశములలో విరివిగా లభించినవి.

## నామములు

విష్ణుకుండినులలో చాలామంది రాజులపేర్లు చివర "వర్మ" అను పదముతో అంతమయినవే. గోవిందవర్మ, మాధవవర్మ, విక్రమేంద్రవర్మ, ఇంద్ర భట్టారకవర్మ ఇత్యాది. వీరి తామ్ర శాసనములలో అగ్నిశర్మ, ఇంద్రశర్మ, శివశర్మ, దామశర్మ, రుద్రశర్మ, నాగశర్మ మొదలయిన "శర్మ" పదము అంతముగలవి, "స్వామి" చివరగల బోలస్వామి, కేశవస్వామి, పేర్లు కనబడుతాయి. పరమ భట్టారికా మహాదేవి, పృథ్వీమాల మొదలయిన స్త్రీ పురుషుల పేర్లు కూడా మనకు కనపడతాయి.

మనుమడికి తాతగారిపేరు పెట్టడమనే ఆచారం కూడా ఆ కాలంలో ఉన్నది.

## స్థలముల పేర్లు

పులంబూరు, మయాన్దవాటిక, కుండూరు, కుడవాడ, వెలంబలి, మారొకకి, కలిక, పురానిసంగమ, పెరువాటిక, పరకివిషయ దెందులూరవాసక, రావిరేవ, రేగోన్ట, న్రైతపాటివిషయ, పెణకపఱ్ఱు. ఇరన్దిరో, తుండి మొదలయిన తెలుగుపేర్లు విష్ణు కుండినుల శాసనాల్లో మనకు కనిపిస్తాయి.

## పరిశ్రమలు, వర్తక వ్యాపారములు

విష్ణుకుండినుల కాలంలో వ్యాపారం బాగా జరిగేదని ఆనాటి నాణెములవల్ల తెలుస్తున్నది. మొదటి గోవిందవర్మ చేసిన దానములలో గ్రామాలు, భూములు, బంగారం, ఏనుగులు, గుర్రాలు, ఇండ్లు, దుస్తులు, ఆభరణములు, కన్యలు, దాసీలు మొదలయినవి వుండటం చేత ఆ కాలంలో విస్తృతమయిన వ్యాపారం జరుగుతుండేదని భావింపవచ్చును.

కీసరగుట్ట, రామతీర్థం, ఏలేశ్వరం, నేలకొండపల్లి, గామన్న పేట, ఇంకా మహారాష్ట్రలోని పవనార్ మొదలయినచోట్ల దొరికిన విష్ణుకుండినుల నాణాలను బట్టి ఆయా ప్రాంతాలలో భారీ వ్యాపారం జరుగుతుండేదని చెప్పవచ్చును.



కీసరగుట్ట త్రవ్వకాలలో దొరికిన టెర్రకోట ఆభరణములు.
1. పూస, 2. కర్ణాభరణము, 3. శివలింగము

విష్ణుకుండినుల పాలనలో, భవనములు నిర్మించు పనివారు, కమ్మరులు, కుమ్మరులు, వ్రడంగులు, రాళ్ళు కొట్టువారు ఉండిరనుటకు ఆనాటి శిధిల దేవాలయములు, భవనములు, తదితరయిటుక, రాతి కట్టడములు నిదర్శనము. ఇటీవల 'కీసరగుట్ట' లో జరిగిన త్రవ్వకములలో ప్రాచీన కట్టడను లనేకములు బయల్పడినవి. విష్ణుకుండినులు వేయించిన తామ్రశాసనములు. వానికి తొడిగిన గుండ్రని రాజముద్రికలు, కడియములు, అమ్మవారిబొమ్మ చెక్కబడిన రాతి ఫలకములు, గుండ్రని నగిషీమృణ్మయపాత్ర మొదలయినవి ఆనాటి పనివారల నైపుణ్యమును చెప్పక చెప్పుచున్నవి.

విష్ణుకుండినులరాజ్యములో వ్యవసాయమే ప్రధాన వృత్తిగా నుండెడిదని చెప్పవచ్చును.

## పరిపాలన

వారి దానశాసనములలోపరిపాలనా విభాగముల వివరములు కనపడవు. కాని ఆ కాలముననే వేంగిదేశమును పాలించుచుండిన శాలంకాయనుల శాసనములవలన ఈ విషయము కొంత తెలుస్తుంది. శాలంకాయనులరాజ్యం పరిపాలనా సౌలభ్యం కొరకు అనేక విషయలుగా విభజింపబడినది. 'ఆహార' 'రట్ట' 'విషయ' అను విభాగములు దేశమును విభజించిన భాగములను తెలియజేస్తాయి. 'విషయ' కంటె దిగువ స్థాయిలో 'గ్రామ', 'పల్లిక', లేక 'పిల్లికగ్రామ' అను విభాగములుండేవి. 'విషయ' 'గ్రామ' పదములకు తేడాకనపడదు. ఆ తర్వాత వచ్చిన తూర్పుచాళుక్యులకాలంలో 'దేశమనుపదము అనేక విషయ' లతోగూడిన రాజ్యముగా పేర్కొనబడినది.[5] పై ఆధారములను బట్టి విష్ణుకుండినులు కూడ తమ రాజ్యమును అనేక గ్రామములు. విషయలుగా విభజించి ప్రత్యక్షముగాకాని, సామంతులద్వారాకాని పరిపాలన సాగించిరని భావింపవచ్చును. ఇంద్రభట్టారకవర్మ, సామ్రాజ్యమని చెప్పదగిన 'చక్రవర్తి క్షేత్రమును' పరిపాలించినట్లు శాసనములలో చెప్పబడినది.[6]

వారి శాసనములలో ప్రత్యేకముగా ఎక్కడా పేర్కొనక పోయినప్పటికీ, విష్ణుకుండినులు పరిపాలనా పద్ధతులలో కౌటిల్యుని అర్థశాస్త్రమును అనుకరించినట్లు భావింపవచ్చును. విష్ణుకుండిన రాజులు ఎల్లప్పుడూ యుద్ధములలో మునిగి తేలుచున్నందువలన దేశపరిపాలనా వ్యవహారములన్నియు అమాత్యులేచూచుకొనుచుండెడివారని ఊహించుటకు అవకాశము కలదు. పరిపాలనాధికారులయిన మంత్రులకు "విషయమహత్తర"[7]గా పేర్కొనబడిన గ్రామపెద్దలు సహాయము చేయుచుండి యుండవచ్చు. "విషయమహత్తర'ను" గ్రామవృద్ధ అని కూడా పిలచుటకద్దు.[8]

వివిధరకములైన పన్నులను వసూలు చేయుటలో విష్ణుకుండిన పరిపాలకులు శ్రద్ధ చూపించేవారు. ఇంద్రవర్మరామతీర్థం శాసనంలోను నాలుగవ మాధవవర్మ పొలంబూరు శాసనంలోను మనకు కనపడే "కార"[9] అనేపదం, భూమిదున్ని పంటలు పండించేవారి నుండి యితర వృత్తులవారినుండి ప్రభువులు వసూలుచేయు పన్ను అనే అర్థాన్ని సూచిస్తుంది.

ప్రభుత్వ ఆదాయంలో అధిక భాగం దేవాలయాల నిర్మాణానికి, విహారాలు, సమావేశమందిరాలు, జలాశయాలు, బావులు, మొదలయినవాటికొరకు ఖర్చుచేయుచుండినట్లు కనపడుతుంది. సైనిక దళంఖర్చు నిమిత్తం కూడ ఎక్కువమొత్తం కేటాయింపబడుతూ ఉండేదని చెప్పవచ్చు.

రెండవమాధవవర్మ గొప్ప విజేత అని, ఎనిమిదివేల ఏనుగులు, పదికోట్ల గుర్రములు, లెక్కకుమించిన కాల్బలము కలిగిన అపారమైన సేనావాహిని అతని అధీనంలో ఉండేదని వారిశాసనాలలో పేర్కొనబడింది.[10] రెండవ విక్రమేంద్ర భట్టారక మహారాజు అనేక చతుర్దంత యుద్ధములలో గెలుపొందిన వాడు.[11]

నాల్గవ మాధవవర్మ పొలమూరు శాసనములో కనిపించే 'హస్తికోశ,' 'వీరకోశ,' తుమ్మలగూడెం మొదటి తామ్రశాసనంలోని 'వల్లభ' అనుపదములు విష్ణుకుండినుల సైన్యములోని అధికారుల పేర్లయి ఉండవచ్చును, గజదళములకధిపతి 'హస్తికోశ' అని, కాల్బలముల కధిపతి 'వీరకోశ' అని, అశ్వదళాధిపతి 'వల్లభ' అని భావించవచ్చును. 'కుడువాడ' 'వేల్పూరు'ల వద్దగల స్కాంధావారములు. యుద్ధశిబిరములుగా గుర్తించబడినవి.

విష్ణుకుండినరాజులు అనేకయజ్ఞయాగాదిక్రతువులు, చేసినట్లు వారిశాసనాలవల్ల మనకు తెలుస్తున్నది. అగ్నిష్టోమ, వాజపేయ, బహుసువర్ణ, రాజసూయ, పురుషమేధ, అశ్వమేధ మొదలైన వైదిక క్రతువులు చేశారు. విద్యాకేంద్రాలుగా విలసిల్లిన 'ఘటిక'లను నిర్వహించారు.

ప్రజలు ఎవరికిష్టమయిన మతాన్నివారు అనుసరించటానికి హక్కుకలిగి ఉండేవారు. బౌద్ధము, జైనము, శైవము, వైష్ణవము, శక్తిపూజ మొదలయినవి సమాన ఆదరం పొందడం ఆనాటి విష్ణుకుండిన రాజుల మతసహనానికి నిదర్శనము.

పైన పేర్కొనబడిన వైదిక క్రతువులు చేయడానికి కూడా ఖజానా నుండి ఎక్కువ మొత్తంలోనే రాజులు ఖర్చు పెట్టేవారు. అందుకవసరమయిన నిధులను ప్రజలనుండి 'భిక్షేప' అనగా, దాన ధర్మములద్వారా సేకరించేవారు. ఇటువంటి సత్కర్మలు చేయడానికి ధనికులయిన ప్రజలు విరివిగా భూరివిరాళాలు యివ్వవలసి ఉంటుందనీ, అట్లా అడిగే అధికారం రాజుకు కలదనీ కౌటిల్యుడు నొక్కి చెప్పాడు.[12]

## భాష

విష్ణుకుండిన రాజులందరు సంస్కృతమును, తెలుగును సమానంగా ఆదరించారు. కవిపండితులైన బ్రాహ్మణులకు అగ్రహారాలు దానంచేసేవారు. వారి దాన శాసనాలలో వాడిన భాష తప్పులులేని సులభ శైలిలో ఉన్నది. మొదటి మాధవవర్మ చిక్కుళ్ళ శాసనంలో, ఏభై అయిదు అక్షరములతో కూర్చిన ఏడు విశేషణములతో వర్ణించబడినాడు. రామతీర్థం తామ్రశాసనములలో కూడ దీర్ఘమయిన విశేషణములతో మాధవవర్మ కీర్తింపబడినాడు. అందులో మొత్తం నలభై తొమ్మిది పదములున్నవి.

మొదటి మాధవవర్మ ఈపూరు శాసనంలో పదగుంభనం శబ్ద సౌందర్యం ఈ క్రింది విధంగా ఉన్నది.

"స్మృతి మతిబల సత్వధైర్య వీర్య వినయ సంపన్నః
సకల మహీమండల మనుజపతి ప్రతిపూజిత, శాసనః,
త్రివరనగర భవనగత యువతీహృదయానందనః ।
స్వనయబల విజిత సకల సామంత అతుల
బల వినయ నయ నియమ సత్వ సంపన్నః
సకల జగద వనీపతి ప్రతి పూజిత శాసనః
అగ్నిష్టోమ సహస్రయాజి హిరణ్య గర్భ
ప్రసూత ఏకాదశాశ్వ మేధ అవభృథ.
విధూత జగత్‌కల్మషః సుస్థిరకర్మా
మహారాజశ్రీ మాధవవర్మా "
అట్లాగే పొలమూరు తామ్రశాసనంలో కూడ.
"అతుల బలపరాక్రమ యశోదాన
వినయసంపన్నో- దశశత సకల ధరణీతల
నరపతిర్, అవస్థిత వివిధదివ్య, త్రివరనగర
భవనగతపరమ యువతి జన విహరణ ,
రతిర్, అనన్య నృపతి సాధారణ దానమాన
దయాధర్మధృతి మతిక్షాన్తి కాన్తి శౌర్యౌదార్య
గాంభీర్య ప్రభృత్యనేక గుణసంపజ్జనిత
రాయ సముత్థిత భూమండల వ్యాపి
విపులయశః క్రమసహస్ర యాజీ
హిరణ్య గర్భప్రసూతః, ఏకాదశాశ్వ
మేధ అవభృథస్నాన
విగత జగదేనస్కః సర్వభూత
పరిరక్షణ చుఞ్చుః । విద్వద్ద్విజ
గురువృద్ధ తపస్వి జనాశ్రయో
మహారాజశ్రీ మాధపవర్మా"

గంభీరరమై సరళంగా సాగే సొగసైన సంస్కృత పద బంధాలు చదువరులకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయనటంలో ఏ మాత్రం సందేహంలేదు.

" జనాశ్రయ "బిరుదముకల్గిన నాల్గవ మాధవవర్మ 'జనాశ్రయ ఛందో విచ్ఛిత్తి' అనే ఛందో గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథము అసంపూర్ణము. ఇందులోని ప్రారంభ పద్యములలో జనాశ్రయ మహారాజు శ్లాఘించబడినాడు. ఇది ఆ నాటి తెలుగు భాషా కవిత్వ పద్ధతులను విపులీకరించు గ్రంథము. గణములు, యతిప్రాసలు మొదలయిన తెలుగుపద్య రచనకు చెందిన విషయములు యిందు చెప్పబడినవి. ద్విపద, త్రిపదలను గురించి కూడ ఇందులో వివరించబడింది. కాళిదాసు, వరరుచి, సుందరపాండ్య, శూద్రకుడు మొదలయిన వారి శ్లోకములు ఈ గ్రంథములో ఉదహరింపబడినవి. దీనిని జనాశ్రయునిపేర గణస్వామి అనే పండితుడు రాశాడని కొందరి భావన. ఇంతటి ఉత్తమమయిన ఛందోగ్రంథము వెలువడినదంటే అంతకు పూర్వమే తెలుగుభాష పరిణతిచెంది పరిపుష్టమయి వివిధ ఛందోరీతులలో పద్యరచన చేయగల స్థాయికి ఎదిగిందని నిస్సందేహముగా చెప్పవచ్చును.

విష్ణుకుండినుల ఆదరణలో తెలుగుభాష అయిదు ఆరుశతాబ్దులకే అభివృద్ధిచెందిన దనుట నిశ్చయము.

ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. శాతవాహనుల కాలంలో రాజభాష అయిన ప్రాకృతంతోపాటు అనేకదేశ భాషలు ప్రజలలో వాడుకలో ఉండేవి. కౌటిల్యుడు, వాత్స్యాయనుడు, భరతుడు పేర్కొనిన పదునెనిమిది దేశభాషలలో ఆంధ్రభాషకూడా ఒకటి. శాతవాహనుల ప్రాభవంలో రాజభాషయొక్క ప్రభావం వలన దేశభాష అయిన తెలుగు మరుగున పడింది. కాలక్రమేణ శాసన భాషలో ప్రాకృతం బదులు సంస్కృతం చోటుచేసుకున్నది. శాతవాహనుల శాసనాలన్నీ ప్రాకృతభాషలో ఉంటే వారి తరువాత వచ్చిన రాజ వంశీయుల శాసనాలలో క్రమ క్రమంగా సంస్కృతమే ఎక్కువగా వాడబడింది. ఆ విధంగా విష్ణుకుండినుల శాసనాలన్నీ సంస్కృతభాషలోనే వ్రాయబడినవి. వాటిలో అక్కడక్కడ రావిరేవు, లెందులూర పణకపట్ట మొదలయిన తెలుగుపదాలు కూడ చోటు చేసుకొన్నాయి. ఇంతకుముందు చెప్పినట్టుగా 5, 6 శతాబ్దాల నాటికే తెలుగుభాష పద్య కవిత్వము చెప్పగల స్థాయికి చేరుకొనినది.

## శిల్పకళ

శిల్పకళ శాతవాహనుల ఆదరణలో ఉన్నతశిఖరాల నందుకొన్నది. ముఖ్యముగా బౌద్ధముయొక్క ప్రభావము వీటిల్లో కనపడుతుంది. ఆనాటికి ప్రచారంలో నుండిన బుద్ధుని జీవిత విశేషములను కొన్ని చిహ్నములద్వారా(సింబాలిక్ రిప్రజెంటేషన్) చూపేవారు.

బుద్ధుని జననమును 'కమలము' ద్వారా తెలియచేసేవారు. 'బోధి వృక్షము' బుద్ధ భగవానునిలో జ్ఞానోదయము కలుగుటను సూచిస్తుంది. ఆయనబోధనలు "చక్రము" గుర్తుగా బోధించబడినవి. భగవానుని నిర్వాణమునకు చిహ్నంగా 'స్తూపము' మలచబడింది.

శాతవాహనుల కాలమునాటి శిల్పులు మతపరమయిన విషయములనే తమ శిల్పములకు ఎన్నుకొన్నప్పటికి ప్రాపంచిక జీవితమునకు సంబంధించిన, సుందరమయిన విషయాలు కూడా వాటిలో చోటు చేసుకున్నాయి. అమరావతి శిల్పాలు భారతీయ శిల్పకళకు మకుటాయమానంగా పరిగణింప బడుతుండటానికి కారణం బహుశా ఇదేకావచ్చు. ఆనాటి ప్రజల కళాభిరుచిని గురించిన విషయాలనేకం 'గాథాసప్తశతి' లో మనకు కనపడతాయి,

నాగార్జునకొండ లోయలో బయల్పడిన బౌద్ధ విహారములను పరిశీలించినట్లయితే వాటి నిర్మాణములో, బౌద్ధారాధనలో పరిణామం మనకు గోచరిస్తుంది. స్తూప నిర్మాణమే అనంతర కాలంలో పవిత్ర ఆలయములకు దారితీసినట్లు కనిపిస్తుంది. క్రమ క్రమంగా విగ్రహారాధనతో పాటు గజపృష్ఠాకారపు ఆలయ నిర్మాణము, ఆతరువాత చతురస్ర, దీర్ఘచతురస్ర , పూజా మందిరముల నిర్మాణములు బౌద్ధ మతము వ్యాప్తిచెందుటకు, జనాభిమానము పొందుటకు దోహదము చేసినవి.

శాతవాహనుల అనంతరము శైవ, వైష్ణవ మొదలయిన మతములు ఆదరణలోనికి వచ్చినవి. ఇంతకుముందే చెప్పినట్లు విష్ణుకుండినులు బౌద్ధమతముతోపాటు వైదిక మతములను గూడ ఆదరించి అనుసరించిరి. దేవాయతనములు, విహారాలు, సమావేశ మందిరాలు, బావులు, తటాకాలు, ఉద్యానవనాలు నిర్మించారు. ఆకాలపు ఆలయ కట్టడాలను చూస్తే, అవి పూర్వపు బౌద్ధ విహారములను పోలి ఉండటం గమనించవచ్చు.

విజయవాడ, మొగల్రాజపురం ఉండవల్లిలోని గుహాలయము, లను పరిశీలిస్తే హిందూ, బౌద్ధ శిల్పం సాంప్రదాయాలు కొట్టవచ్చినట్లు కనపడతాయి. ఉండవల్లిలోని పెద్ద గుహాలయం బౌద్ధ విహారాన్ని పోలి ఉన్నది.

విజయవాడ, మొగల్రాజపురం, ఉండవల్లి గుహాలయాలు విష్ణుకుండినుల నిర్మాణమేనని పలువురు అంగీకరించిన విషయమే, అందున్న ద్వారపాలకులు, కమలములతో కూడిన స్తంభములు, సింహము శిల్పములతో అలంకరణ మొదలైనవన్నీ అమరావతిలోని బౌద్ధ శిల్పాలను జ్ఞప్తికి తెస్తాయి. విజయవాడలో అయిదు, మొగల్రాజపురంలో అయిదు, ఉండవల్లిలో నాలుగు గుహాలయాలున్నాయి. విజయవాడ, మొగల్రాజపురాలలోనివి త్రిమూర్తులకు ఉండవల్లిలోనివి విష్ణువునకు సమర్పించబడినవి. మొగల్రాజపురంలోని ఒక గుహాలయం ముందు పై భాగంలో ఎనిమిది చేతులుగలిగిన నటరాజశిల్పము, దాని కింద సింహములు, ఏనుగులవరుసలు మలచబడినవి. అపస్మార పురుషుని మర్దిస్తున్నట్లుగా చెక్కిన నటరాజశిల్పంలో నేటికీ శిల్పి యొక్క పనితనము ప్రస్ఫుటంగా కనపడుతుంది. ఇటువంటి శిల్పము మరెక్కడా కానరాదు.

వారు కోరినచోటల్లా గుహాలయాలు నిర్మించటం సాధ్యపడక పోవటంచేతనూ, నిర్మాణ కార్యక్రమం ముమ్మరం కావటం చేతనూ, ప్రజలు నివసించే ప్రదేశాలకు దగ్గరగా స్తూపాలనిర్మాణ కార్యక్రమం ముమ్మరం కావటంచేతనూ, శాతవాహనులుగాని, వారి తరువాతి వారయిన ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు బౌద్ధస్తూపాలు, చైత్యాలు, విహారాలు నిర్మించటానికి ఎక్కువగా "యిటుక"నే వాడేవారు. ఉదాహరణకు అమరావతి, నాగార్జునకొండ, గోలి, ఘంటసాల, పేర్కొనవచ్చు. దురదృష్టవశాత్తు ఆకాలమునాటి యిటుకతో కట్టబడిన ఆలయము లేవీ యిప్పుడులేవు.[13]

హైదరాబాదుకు సమీపంలోని కీసరగుట్టలో జరిపిన త్రవ్వకములలో ఆకాలపు యిటుక కట్టడముల శిథిలాలనేకము బయటపడినవి. బారీకట్టడపు పనితనము గమనిస్తే వాటిలో కొన్ని అనేక అంతస్థులు కలిగిన రాజభవనాలయి ఉండవచ్చునని ఊహింపవచ్చు.

కృష్ణానదీ తీరంలోని ఏలేశ్వరంలో జరిపిన త్రవ్వకాలలో గూడ విష్ణుకుండినుల కాలానికి చెందిన అనేక కట్టడాలు, శిల్పసంపద వెలుగులోకి వచ్చాయి, ఇటుక వేదికలపై ఉంచిన బాణలింగాలు, ఆకుపచ్చ సున్నపురాయితో మలచబడిన అందమయిన విష్ణుశిల్పము విష్ణుకుండినుల శిల్పకళకు మచ్చుతునకలు. ఎడంచేతిలో శంఖము, కుడిచేతిలో శక్తిని ధరించినట్లు చెక్కబడిన ఈ విష్ణు విగ్రహము అమరావతి చెక్కడాలను తలపింప చేస్తుంది.

ఏలేశ్వరమువద్ద ఏలేశ్వరస్వామి దేవాలయం సమీపంలో 'దేవకుల' అనబడే 'మొక్కుబడి' మందిరాలు అనేకం కనుగొనబడినవి. ఈ మందిరాలలో యోనిపీఠములతోను, లేకుండా చిన్న బాణలింగాలు ప్రతిష్టింప బడినవి.

పెద్దపెద్ద దేవాలయాలు కట్టించే స్తోమతలేని భక్తులు యిటువంటి చిన్నసైజు మందిరములను చేయించి అందులో లింగాలను ప్రతిష్ఠించి శివాలయాలవద్ద ఉంచి మొక్కుబడి తీర్చుకునే ఆచారం ఆనాటి ప్రజలలో ఉండేదని భావింపవచ్చును. చిన్న మందిరములు అర్ధ చంద్రాకారపు శిఖరములమీద, విష్ణుకుండినుల శాసనములలో వాడిన లిపిని బోలిన శాసన పంక్తులు చెక్కబడి వున్నవి. ఏలేశ్వరములో లభించిన మందిరములకంటె స్వల్పతేడాగా అటువంటివే కొన్ని

చిన్న మందిరములు కర్నూలుజిల్లా మహానందిలోను, కడమల కాల్వలో కూడ ఉన్నవి.

ఏలేశ్వరంలో దొరికిన చిన్న శివమందిరాలలోని గూళ్ళలో శివుని అర్ధనారీశ్వరునిగా, హరిహరుడుగా, ఉమామహేశ్వరుడుగా మలచబడిన అందమైన శిల్పాలు కనపడతాయి.

అర్ధనారీశ్వరుని శిల్పంలో శివుడు 'త్రిభంగ' భంగిమ, కుడిపై చేతిలో త్రిశూలం, కుడి క్రిందిచేతిలో 'డమరుకము' ధరించి ఉండగా, పార్వతి తన ఎడమ పై చేతితో నీలోత్పలమోలేక అద్దంలాంటి వస్తువు పట్టుకుని ఉన్నట్టు, ఎడమ చెవికి పత్రకుండలం, కుడిచెవికి మకర కుండలం ధరించి నట్లు మలచబడింది. గ్రైవేయకం, కటిసూత్రం, కేయూరం, మొదలయిన ఆభరణాలు చెక్కబడినవి. శిరస్సు పైన జడను అందముగా పైకి చుట్టి పూలుధరించిన ఉష్ణీషమువలె మలచ బడింది.

'సమభంగ' భంగిమలో మలచబడిన 'హరిహర' శిల్పము హుందాగా కనిపిస్తుంది. ఒక్కొక్క విగ్రహానికి నాలుగు చేతులు, శివుని కుడి పై చేతిలో త్రిశూలం, పైకిలేపిన క్రిందిచేతిలో డమరుకం, నడుంచుట్టూ ఉదరబంధం, చేతులకు కేయూరము. కంకణములు, జటాజూటము, త్రినేత్రము స్పష్టముగా చెక్కబడినవి. విష్ణువు కుడి పై చేతిలో 'గద' కుడి క్రింది చేతిలో శంఖము, ఎడమప్రక్కన పై చేయి 'కాల్యావలంబిత' భంగిమలోను, క్రింది చేతిలో చక్రము మలచబడ్డాయి.

ఉమామహేశ్వర శిల్పంలో శివపార్వతులు, స్కంధ గణేశ విగ్రహములు చెక్కబడి ఉన్నాయి. ఎత్తైన పీఠం మీద శివపార్వతులు 'లలితాసన' భంగిమలో కూర్చుని ఉండగా శివునికి కుడిప్రక్కన గణపతి, ఎడమ ప్రక్కన స్కందవిగ్రహములు మలచబడినవి. గణపతికి రెండుచేతులు మాత్రము చూపబడినవి. శిరస్సు పై కిరీటము వంటిది ఏమీలేదు. శివుని చతుర్భుజునిగను, పార్వతికి రెండుచేతులు కలిగి ఉన్నట్లు, శివునికి యజ్ఞోపవీతము, పార్వతి చెవులకు కుండలములు, శిల్పము యొక్క అందమును యినుమడింపజేసినవి. పార్వతి తన కుడిచేతిని శివుని తొడపై ఉంచి, ఎడమ చేతితో కార్తికేయుని గుండెల కదుము కున్నట్లు మలచుట అత్యంత సుందరముగా మున్నది.

విష్ణుకుండినుల కాలానికి చెందిన మరొక అపురూపశిల్పము 'నారసింహ' విగ్రహము. ఇది గుంటూరు జిల్లా పిడుగురాళ్ళకు సమీపమున కొండమోటు అను ప్రదేశము నుండి రాష్ట్రపురావస్తుశాఖ కార్యాలయమునకు తరలించబడినది. ఒకటిన్నర సెంటీమీటర్ల పొడవు అరయ్యొక్క సెంటీమీటర్ల వెడల్పు కలిగిన దీర్ఘచతురస్రాకారపు రాతి ఫలకము మీద నిలుచున్న భంగిమలో ఆరు విగ్రహములు మలచబడినవి. మూడవది మధ్యది అయిన విగ్రహముసింహపుతల మనిషి శరీరముగల నరసింహస్వామిది. ఎడమనుంచి మొదటిది ప్రద్యుమ్నుడుగాను ఆ తరువాతది విష్ణువుగాను, నాల్గవది వాసుదేవ లేక కృష్ణుడుగాను, అయిదు, ఆరు విగ్రహములు వరుసగా సంకర్షణ, అనిరుద్ధులదిగాను గుర్తింపబడినవి.

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారసింహ 'పంచవీరులుగా' ఆ కాలంలో పూజింపబడుతూండే వారని స్పష్టమవుతున్నది.

## అధోజ్ఞాపికలు

1. చిక్కుళ్ళ తామ్రశాసనము. పంక్తులు 12-13.
2. కె. గోపాలాచారి. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఆంధ్రా కంట్రీ పు.79.
3. ఎమ్. జి. ఎస్. నారాయణ ది వేదిక్ పురాణిక్ శాస్త్రిక్ ఎలిమెంట్ తమిళ్ సంగమ్ సొసయిటీ ఎండ్ కల్ట్ ప్రొసీడింగ్స్ ఆఫ్ ది ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ 36 సెషన్ అలీగర్ 1975 పు. 76-91
4. తుమ్మలగూడెం తామ్రశాసనం 2 పంక్తులు 19-29.
5. ఇండియన్ అంటిక్వేరీ వాల్యూమ్. 8 పు.76
6. చిక్కుళ్ళ తామ్రశాసనం. 2వ పంక్తి
7. తూర్పు చాళుక్యరాజు జయసింహ వల్లభుని పొలమూరు శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూమ్ 30 పు. 256
8. పృథ్వీమూలుని గోదావరి శాసనాలు. 2. ఎ. ప. జి. ఎ. ఎస్. 6 పు. 24
9. ఎస్. శంకరనారాయణన్ 'విష్ణుకుండిన్స్' ఎండ్ దేర్ టయిమ్స్ పు.133
10. నేలటూరి వెంకటరమణయ్యగారి "విష్ణుకుండినులు"
11. ఎపిగ్రాఫియా ఇండికా 14 పు.12.
12. కౌటిల్యుని అర్ధశాస్త్రము. పుటలు 301-303.
13. కె.వి. సౌందరరాజన్. ఆర్కిటెక్చర్ ఆఫ్ ది ఎర్లీ హిందూ టెంపుల్స్ ఆఫ్ ఎ. పి. పు 1-3.
14. ఏన్ ఎర్లీ స్కల్ప్చర్ ఆఫ్ నరసింహ ఎ. పి. జి. ఎ. ఎ నెం. 16.



# ప్రకృతి వైచిత్రి

## శ్రీ వసంతరావు వేంకటరావు

విద్యుత్తు నిలకడగా ఉన్నంతవరకు
దానిచుట్టూ అయస్కాంతత్వం ఉండదు;
విద్యుత్తు ప్రవహించగానే
అయస్కాంతత్వం ఆవిర్భవిస్తుంది.
విద్యుత్తు ప్రవహించే వాహకాన్ని
అయస్కాంతక్షేత్రం ఆవరిస్తుంది.
ప్రావాహిక విద్యుత్తుకు
అయస్కాంతత్వానికీ
అవినాభావ సంబంధమేమిటో ?

* * *

పరమాణువులో కేంద్రకానికి
దూరంగానున్న కక్ష్యనుండి?
దగ్గరకక్ష్యకు ఎలెక్ట్రాను
గెంతగానే శక్తి విడివడి
విద్యుదయస్కాంత తరంగాల
రూపంలో అన్ని దిశలు వ్యాపిస్తుంది
కాస్మిక్ కిరణాలనుండి
రేడియో తరంగాలవరకు
వేరు వేరు అల పొడవులు గల
గామా కిరణాలు, ఎక్స్ కిరణాలు,
అతినీలలోహిత కిరణాలు,
కంటికి కనిపించే రంగుకిరణాలు,
పరారుణ తరంగాలు,
మైక్రో తరంగాలు;
ఇవన్నీ విద్యుదయస్కాంత తరంగాలే.
ఈ రకం శక్తి యావత్తూ
విద్యుదయస్కాంతత్వమే;

* * *

వాతావరణం పై పొరలలో
గాలి అణువులు విద్యుదావేశిత
పూరితాలై, అయాన్లుగా
విద్యుదయస్కాంత తరంగాలను
పరావర్తించే విద్యుత్ దర్పణాలుగా
ప్రవర్తిస్తాయి; రేడియోలు వినిపిస్తాయి.

శూన్యమంటే ద్రవ్యంలేనిచోటు;
కాంతి చొరలేని కీకారణ్యాలలోకూడా
కాస్మిక్ కిరణాలు, రేడియోతరంగాలు
చొచ్చుకొని పోవడంతో
శక్తి ఆక్రమించని ప్రదేశమేలేదు!
శక్తి ద్రవ్యాలు ఒకే దానియొక్క
రెండురూపాలు ! కాగా
శక్తి ఉంటే ద్రవ్యమున్నట్లేకదా!
శక్తి తరంగాలు లేని చోటులేదు
కాబట్టి విశ్వంలో శూన్యానికి,!!
స్థానం లేనట్లే! అయితే,
'శూన్యాన్ని ప్రకృతి గర్హిస్తుంది"
అనే నానుడి అర్థరహితమే కదా!

* * *

సూర్యకాంతిలో ఏడురంగులున్నాయని
చూపుతుంది ఆకాశంలో హరివిల్లు.
సూర్యకాంతిని గాజుపట్టకంతో విశ్లేషించి
చూపించేడు ఆ రంగులనే న్యూటన్!
ఒక చక్రాన్ని అనువైన చాపాలుగా విభజించి
ఒప్పుగా రంగులువేసి, గిర గిరత్రిప్పితే
తెల్లగా కనిపిస్తుందనికూడా చూపేడు.
కిరణాల రంగుల భేదానికి కారణం
వాటి అలపొడవుల వ్యత్యాసమేనట !
ఒకయానకంనుండి మరో యానకంలోకి
కాంతి ప్రయాణించినప్పుడు
తక్కువ అల పొడవుగల కిరణాలు
ఎక్కువ వంగుతాయి.
కటకాలు కాంతిని కేంద్రీకరిస్తాయి
పట్టకాలు కాంతిని విశ్లేషిస్తాయి
బహువిధ యంత్ర నిర్మాణానికి
ఈ ధర్మాలే దారితీసేయి !

పెద్దకథ

# శారద నిర్ణయం

'అన్నపూర్ణ'

( గత సంచిక తరువాయి )

## 7

రోజులు....వారాలు....నెలలు గడిచిపోతూనే ఉన్నయ్.... హేమంత్ తిరుగుడు ఎక్కువైంది మరికాస్త. అలవాట్లు విజృంభించాయి....స్కూటరు నచ్చక ఎక్కడో అమ్మకానికి వచ్చిన సెకండ్ హేండ్ కారు కొన్నాడు....కొడుకు ఆనందానికి అడ్డుచెప్పలేదు జగదీశ్వరమ్మ. తరగని ఆస్తి - ఒక్కడే కొడుకుమరి....వ్యవసాయపు పనులన్నీ ఆవిడ పర్యవేక్షణలోనే జరుగుతాయి. తనుశ్రమ పడలేక మూడువంతుల పొలాన్ని కౌలుకు ఇచ్చేసింది భర్తపోయిన సంవత్సరమే.

రామచంద్రరావు మధ్యమధ్య ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు.... ఆనాడు అంత జరిగాక కూడా ఏమాత్రం దిగులు చెందకుండా- ప్రసాద్ముందు నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడటం చూశాక రజనిమీద ఆశలు పెంచుకోవటంలో అర్థం లేదనిపించింది హేమంత్కు. ఆమె ఆ ప్రసాద్ను ప్రేమిస్తూండవచ్చు నన్న అనుమానమూ కలిగింది.... దాంతో పూర్తిగా విరక్తి చెందాడు.... కలలోకూడా తలవటం లేదు రజనిని ఇప్పుడు అతడు.

*   *   *

ఓ రోజు మధ్యాహ్నం తన గదిలో పకోడుని నిద్రపోతున్నాడు హేమంత్. రాత్రంతా షికార్లు, పగలంతానిద్ర- ఇది అతడి దినచర్య. ఎందుకో మెలకువచ్చి లేచేసరికి.... ఎవరివో మాటలు వినిపించసాగాయి.

"....అక్కయ్యా.... ఓ తల్లికడుపున పుట్టాం మనం.... మమకారాలు పెంచుకొంటే పెరుగతయ్యేకాని త్రుంచుకోవాలంటే అంత సులభంగా తెగిపోవు.... నేను నామనసుకు నచ్చినవాణ్ణి చేసుకున్నాను. అది నీదృష్టిలో తప్పుకావచ్చు....మీరందరూ వెలివేసినట్లు ప్రవర్తించినా ధైర్యంగానే బ్రతికాను ఇంతకాలం.... మామూలుగా అనుకొనే మాటలు శాశ్వతం కావని, కోపతాపాలు కలకాలం నిలిచి ఉండవనీ- అలా అభిప్రాయపడే ఇప్పుడు నీ దగ్గరికి వచ్చాను...." దుఃఖమిశితంగా ఉంది ఆ స్వరం.

"శ్రీలక్ష్మీ!.... మనమధ్య మాటలు అనవసరం.... నాకు ఓ చెల్లెలు ఉండేదన్న విషయం ఏనాడో మరచిపోయాను... ఇక ముందూ అంతే.... అయినా ఏదో తోటి ఆడదానివి. భర్త ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడని- సహాయం అర్థించటానికి వచ్చావు. కాబట్టి నాకు తోచింది ఇస్తాను తీసుకువెళ్ళు.... అంతేకాని మన బంధుత్వాలను, అనుబంధాలను తిరగదోడి నన్ను వంచించాలని చూడకు"- కరకుగా ధ్వనించింది జగదీశ్వరమ్మ కంఠం.

"సరే అక్కయ్యా, మనమధ్య బంధుత్వాలు, అనుబంధాలు ఏమీలేవు. అటువంటప్పుడు నీవు నాకు సహాయపడవలసిన అవసరమూ లేదు.... నాభర్త ప్రాణం నిలుపుకోవటానికి బిచ్చమెత్తుకోవలసి వచ్చిన నాడు- నీ యిల్లు ఒక్కటేనా ఈ ప్రపంచంలో ఉంది?.... నడిబజార్లో చెంగు పరచుకొని కూర్చున్నా చాలు.... నీ ధర్మబుద్ధికి, దయా గుణానికీ నా జోహార్లు. వెళ్ళి వస్తానక్కయ్యా."

అంతటితో హేమంత్ ఇవతలికివచ్చి "ఆగుపిన్నీ" అంటూ వెళ్ళిపోతున్న శ్రీలక్ష్మిని ఆపు చేశాడు.

"పిన్నీ" అన్న ఆ ఆత్మీయమైన పిలుపు కట్టిపడవేసినట్లు కదలకుండా ఆగిపోయింది శ్రీలక్ష్మి.

"నాపేరు హేమంత్. మీ అక్కయ్యకొడుకునే....ఇంతకాలం నిన్ను నేను చూడలేదు. అసలు అమ్మ తనకో చెల్లెలు ఉందన్న సంగతి నాకు ఇంతవరకూ చెప్పనేలేదు...." అంటూ "నీకు దానితో మాటలేమిటి ?....వెళ్ళనీ" అని వెనకనుంచీ తల్లి కేకలు వేస్తున్నా పట్టించుకోకుండా శ్రీలక్ష్మితో మాట్లాడుతూనే ఉన్నాడు హేమంత్....తర్వాత ఆమెతోపాటు కారులో వాళ్ళయింటికి కూడా వెళ్ళాడు.

అదే మొదలు — తర్వాత తరచూ శ్రీలక్ష్మి వాళ్ళయింటికి వెళ్ళటం, ఈలోగా ఆమె భర్త పోవటం తనకు తోచిన విధంగా వాళ్ళకు సహాయ పడుతూండటం, కొద్ది రోజులకే శారదతో పరిచయంకావటం—అదే ప్రేమగా మారటం - అన్నీ జరిగిపోయాయి....

ఓరోజు శ్రీలక్ష్మినీ, ఆమె కూతురు కళ్యాణినీ కూర్చోబెట్టి శారదమీద తనమనసును బయట పెట్టాడు హేమంత్.

"అదెలా బాబూ, నీకు పెళ్ళైపోయిందిగా ?" అంటూ సందేహం వ్యక్తం చేసింది శ్రీలక్ష్మి. "ఇది చాలా అన్యాయం కదూ. అన్నయ్యా ?" అంటూ మందలించింది కళ్యాణి.

అప్పుడు తనపెళ్ళి దరిమిలా జరిగిన సంఘటనలన్నీ పూస గుచ్చినట్లు చెప్పి, "పిన్నీ ! వివాహితుణ్ణే అయినా నేనిప్పుడు సర్వ స్వతంత్రుణ్ణి ... రజని కన్న తండ్రి అయిన రామచంద్రరావు మామయ్యే నాకు పూర్తిస్వేచ్ఛ యిచ్చాడు .... మిమ్మల్ని అర్థిస్తున్నాను....నా మనసును అర్థం చేసుకోండి....నేను ఎటువంటి పరిస్థితుల్లోనూ శారదకు అన్యాయం జరగనివ్వను... ఈ మేలు చేస్తే మీకు జీవితాంతం కృతజ్ఞుడిగా ఉంటాను...ఇలాగే మీ కుటుంబానికి నాకు చేతనైన సాయం చేస్తూంటాను" అన్నాడు.

దీని మీద శ్రీలక్ష్మి, కళ్యాణి బాగా ఆలోచించారు....రజని విషయంలో మతిచెదరి ఉన్నాడు హేమంత్. ఇప్పుడు శారద విషయంలోనూ ఫెయిలైతే పూర్తిగా కృంగిపోతాడు అతడు. పైగా ఆమెను పెళ్ళాడతానని కూడా గట్టిగా చెబుతున్నాడు...మరి అటు వంటప్పుడు తమకు ఎన్నో విధాల సహాయపడుతున్న హేమంత్‌కు ఈ మాత్రపు మేలు చేయటంతో తప్పేముంది ?.... అలా ఆలోచించి అతడికి సహకారమివ్వటానికి అంగీకరించారు ఆ తల్లీ కూతుళ్ళు .... అలాగే శారద హేమంత్‌కు దగ్గరైంది...

తనకు పెళ్ళైన సంగతి ఎటువంటి పరిస్థితిలోనూ శారదకు తెలియపర్చకూడదని... అలా మాట తీసుకున్నాడు హేమంత్. శ్రీలక్ష్మి,కళ్యాణిల దగ్గిర....నిదానం మీద ఆ విషయం తానే ఆమెకు చెబుతానన్నాడు.

జరుగుతున్న దాన్ని బట్టి తాము అమాయకురాలైన శారదకు అన్యాయం చేస్తున్నామేమో? - అని అప్పుడప్పుడు మథన పడుతూనే ఉంటారు ఆ తల్లీ కూతుళ్ళు.

## 8

రాత్రంతా కలల్తో, ఆలోచనల్తో అలసి పోయిన శారద మర్నాడు ఉదయం నిద్రలేచే సరికి చాలా ఎండెక్కింది. రోజూ తెల్లవారకముందే మెలకువ వచ్చేది. కాకపోతే తల్లో, తండ్రో ఎవరో ఒకరు లేపేవారు. అలాంటిది ఈవేళ వెలివేసినట్లు ఒక్కరూ తనని నిద్ర లేపకపోవటం కొంత ఆశ్చర్యమనిపించింది. రాత్రి హేమంత్ కారులో రావటం చూశాక అమ్మ, నాన్నలలో తనపై వేరే అభిప్రాయం ఏర్పడటానికి ఇదే నిదర్శనం .. దీని మీద వాళ్ళిప్పుడు ఏం అడుగుతారో, తను ఏమని సంజాయిషీ ఇవ్వవలసివస్తుందోనని సందేహిస్తూనే గదిలోంచి బయటికి అడుగుపెట్టింది.

"ఏమిటే అమ్మాయ్, ఇప్పుడా నిద్రలేచేది ?- ఈ మధ్య నీకు మందమతి ఎక్కువౌతున్నట్లుందిటే ." అంది అనసూయమ్మ కూతురు కనిపించగానే.

అలవాటు ప్రకారం ఆవిడ మాటలకు అంతగా పట్టించుకోలేదు. శారద....తండ్రి కనిపిస్తాడేమోనని అటూ-ఇటూ చూసింది.

"ఏదో తొందరపని ఉందని మీ నాన్న ఇంతకుముందే వెళ్ళారు....మధ్యాహ్నం భోజనానికి ఇంటికే వస్తారుట"—కూతురు మనసు కనిపెట్టినట్లు చెప్పింది అనసూయమ్మ.

దాంతో శారద గుండె తేలిక పడినట్లైంది....కాలకృత్యాలు తీర్చుకువచ్చి- తల్లి ఇచ్చిన కాఫీ చప్పరిస్తూ ముందుగదిలో కూర్చొని ఏదో పత్రిక తిరగవేస్తున్న ఆమెకు సుందరమూర్తి కనిపించాడు లోపలికి వస్తూ.

సుందరమూర్తి సోమశేఖరంగారి తరఫు బంధువు....వాళ్ళ నాన్న హైదరాబాద్ సచివాలయంలో పనిచేసేవాడు.....అనుకోకుండా ఆయన కన్నుమూయటంతో చదువు మానేసి గత్యంతరంలేక ఉద్యోగం చూసుకోవలసి వచ్చింది....జాబ్ వచ్చాక ఈ వూరు వచ్చి సోమశేఖర్గం గారి బజార్లోనే చివర— ఓ యింట్లో అద్దెకుంటున్నాడు తల్లితో. బంధుత్వాన్ని బట్టిరాక పోకలు - వయసులో ఉన్న శారదను చూశాక అవి ఎక్కువయ్యాయి. ఆఫీసుకు వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు తరచుగా ఆ యింటికి వస్తాడు సుందరమూర్తి ప్రతిరోజూను.

"గుడ్ మార్నింగ్ శారదా !"- లోపల అడుగుపెట్టీ పెట్టటంతోటే శారద కనిపించటంతో అతడి మనసు ప్రఫుల్లమైంది వచ్చి చొరవగా మరో కుర్చీలాక్కొని కూర్చున్నాడు.

శారదకు మాత్రం సుందరమూర్తి అంటే కిట్టదు. అతడితో మాట్లాడట మంటేనే చిరాకు. అయినా తప్పదన్నట్లే గుడ్‌మార్నింగ్ చెప్పి, "ఏమిటి మూర్తీ, విశేషాలు ?" అని అడిగింది నోరు ఊరుకోనట్లు.

"విశేషాలేముంటయ్....అంతా మామూలే" అన్నాడు మూర్తి శారదవైపు ఆర్తిగా చూస్తూ.

"ఉండుమూర్తీ - కాఫీ తెచ్చిస్తాను"-అతడి ఆ చూపులనుండి తాత్కాలికంగా తప్పించుకోవాలని లోపలికివెళ్ళి. "మూర్తివచ్చాడు.... ఉంటే కాస్త కాఫీ తీసుకువెళ్ళి వాడి ముఖాన పొయ్యి" అంటూ ఆ పనిని తల్లికి పురమాయించింది.

"వాడు వీడు- ఆ మాటలేమిటే,... సుదరం నిజంగా ఎంతో బుద్ధిమంతుడు.... ఎందుకే మొదట్నుంచీ నీకు అతడంటే అంత ఏవగింపు?" అంటూ కూతుర్ని మందలించి- తానే కాఫీ తీసుకువెళ్ళింది.

'నిజమే. సుందరమూర్తి అంటే తనకు ఎందుకు ఏవగింపు? అతడేం తప్పుపని చేశాడని? తను మరదలు వరస అవుతుంది.... అందుకే ఆశపడుతున్నాడు. తప్పేముంది?' -అంటూ తనలో తాను తర్కించుకొంది శారద.... అయినా "ఆఫీసు టైమైంది. వస్తాను అత్తయ్యా" అని తల్లికి చెప్పి అతడు వెళ్ళిందాకా ఇవతలకు రాలేదు ఆమె.

"ఏమిటే అమ్మాయ్, ఇంకా కూర్చునే ఉన్నావ్?.... లేచి బట్టలకు సబ్బుతగలబెట్టు- ఉతికి ఆరేసుకొని వంట మొదలెడతాను" అంటూ- ముందుగదిలో కూర్చొని తీయటి ఆలోచనల్లో మునిగిన శారదకు చేతినిండా పని కల్పించింది అనసూయమ్మ.

* * *

"హాయ్, శారదా!" -అప్పుడే భోంచేసి ఇవతలికి వచ్చిన శారదకు కళ్యాణి కనిపించింది. "హాయ్, కళ్యాణీ!....రా..రా" అంటూ సాదరంగా ఆహ్వానించి తీసుకువెళ్ళి తనగదిలో కూర్చోబెట్టింది.

"ఏమిటే. వేళ కాని వేళవచ్చావ్?.... విశేషమేమైనా ఉందా?" -ఆవేళప్పుడు వచ్చిందంటే- కళ్యాణి రాకలో ఏదో ప్రత్యేకత ఉండే ఉంటుందన్నది శారదనమ్మకం.

"నీకో గుడ్‌న్యూస్..." అంది కళ్యాణి ఊరిస్తూ.

ఏమిటి అంతమంచివార్త?... హేమంత్ తనకేమైనా వార్త పంపాడా?

"నాకు ఉద్యోగం వచ్చింది.... ఇవిగో అపాయింట్ మెంట్ ఆర్డర్సు!.... ఆమధ్య ఇంటర్వ్యూకు వెళ్ళానే- అందులో సెలక్ట్ అయ్యాను" అంటూ సంతోషంగా చెప్పేసింది- శారద అడక్కుండానే.

....తనకు సంబంధించిన శుభవార్త ఏదో చెబుతుందనుకుంటే- కళ్యాణి ఆమె ఉద్యోగం గురించే చెప్పటంతో నిరాశపడింది శారద. "అలాగా! మంచిదేలేవే" అంది పైకి పొడిపొడిగా.

"....నిజంగా ఈవేళ పండుగలా ఉందంటే నమ్ము.... ఇక మాకు కష్టాలుండవు. ఒకళ్ళమీద ఆధారపడవలసిన దుర్గతి తప్పిపోతోంది.... నాన్నపోయింది మొదలు అన్నయ్య ఎన్నోవిధాల సహాయపడుతూనే ఉన్నాడనుకో... అయినా, ఎంతకాలమని అతడు మాత్రం మాగురించి తిప్పలు పడతాడు?.... పెద్దమ్మకు మానీద అందేనే గిట్టదాయెమరి.... రేపు అన్నయ్య అర్ధాంగి అయ్యాక నువ్వే అభ్యంతర పెట్టొచ్చు" అంది కళ్యాణి ఉత్సాహంగా.

ఆ చివరిమాట విన్న శారదలో సిగ్గుమొగ్గలు వేసింది.

"నేను మీ పెద్దమ్మలాంటి దాన్నికాదులేవే... అయినా మీ అన్నయ్య మీకు సహాయపడుతుంటే- మధ్యన కాదనటానికి నేనెవర్ని?' అప్పుడే తను హేమంత్‌కు అర్ధాంగి అయిపోయినట్లు ఫీలవుతూ అంది.

"మొదట్లో అందరూ ఇలా అన్నవాళ్ళేలే" అంది కళ్యాణి ఉడికిస్తూ.

కాసేపు అలా ఛలోక్తులతో, ఆనందంగా మాట్లాడుకున్నాక— "రాత్రి నేను కారులో రావటం నాన్న చూశారు" అని చెప్పింది శారద.

".... ఏమన్నారు ?- తృళ్ళిపడింది కళ్యాణి.

"పైకి ఏమీ అనలేదు.... అయితే ఆయన మనసులో ఏదో అభిప్రాయం ఏర్పడినట్లు మాత్రం గమనించాను.... సరేగాని కళ్యాణీ, నా విషయంలో మీ అన్నయ్య ఏమంటున్నారు?"

"నీతో ఏమంటున్నాడో నాతోనూ అదే అంటున్నాడు.... పరిస్థితి ఇంతవరకు వచ్చింది. కాబట్టి అన్నయ్యతో నేను గట్టిగా మాట్లాడతాలే శారదా" అంటూ శారద బెంబేలు పడకుండా అభయం ఇచ్చింది కళ్యాణి.

"ఏమ్మా, కళ్యాణీ, కులాసా ?"— అప్పుడే లోపలికి వచ్చిన సోమశేఖరం గారికి గదిలో కూతురుతో పాటు కళ్యాణీ కనిపించటంతో కుశలప్రశ్న వేశారు.

"కులాసాయేనండీ...." అంటూ ఇవతలికివచ్చి వినయంగా చెప్పింది కళ్యాణి. తర్వాత ఆయన అడక్కముందే" తనకు ఉద్యోగం వచ్చిందన్న సంగతి సంతోషంగా చెప్పింది.

"అలాగా ! సంతోషమమ్మా" అని భోజనం మాట మరిచిపోయి అక్కడే ఓ కుర్చీలో కూర్చొని, "సరేగాని కళ్యాణీ నువ్వు చాలా కాలంగా మాయింటికి వచ్చిపోతున్నావ్....మాలో ఒకదానిగా మీ కుటుంబ విషయాలన్నీ మాకు చెబుతున్నావ్... మరి నీకో అన్నయ్య ఉన్నట్లు మాకింత వరకు చెప్పనేలేదు ?....రాత్రి శారదను కారులో తీసుకువచ్చి ఇక్కడ దింపి వెళ్లారట్లే ఉండి—కనీసం లోపలికైనా రాలేదు. ?"— అవకాశం దొరికింది గదా అని తన సందేహాలన్నీ బయట పెట్టారు సోమశేఖరంగారు.

"ఔనండీ ... నాకూ ఈ మధ్యనే - మానాన్న పోయే ముందే తెలిసింది .... హేమంత్ మా పెద్దమ్మ కొడుకు...." అంటూ అతణ్ణి

గురించిన పూర్వాపరాలు వివరించి;'' అన్నయ్య వట్టి మొహమాటస్థుడు. అందుకే ర్నాతి ఇక్కడికి వచ్చి మీ లోపలికి రాలేదు'' అంటూ సంజాయిషీ ఇచ్చింది కళ్యాణి.

"అలాగా ! .... నువ్వు చెప్పింది వింటూంటే నిజంగా మీ అన్నయ్యది ఎంతో మంచి మనసుగా తోస్తోంది కళ్యాణీ ! .... అతణ్ణి ఓ సారి మా యింటికి తీసుకువచ్చి నాకు పరిచయం చేయకూడదూ?''- అన్నారు సోమశేఖరం.

తప్పకుండానండీ ! " - వెంటనే మాట యిచ్చేసింది కళ్యాణి.

"మీరు మాట్లాడు కొంటూండండి... నేను భోజనం చేసి వస్తాను" అని లోపలికి వెళ్లారు సోమశేఖరం మరి మాట్లాడ వలసింది తోచక ... వాళ్ళ సంభాషణ సవ్యంగానే ముగియటంతో శాంత పడింది శారద మనసు.

మీ అన్నయ్యను మాయింటికి తీసుకు వస్తావా !- ఎప్పుడే?''- ఆత్మీయంగా అడిగింది కళ్యాణిని.

ముహూర్తం కుదిరినప్పుడు....''అంటూ గలగల నవ్వింది ఆమె.

"....ఆఫీసువచ్చింది.... దిగు కళ్యాణీ" అన్నాడు హేమంత్ కారు స్టీరింగ్ ముందు కూర్చొనే.

ఎదురుగా కనిపించే పెద్దబిల్డింగే తను పనిచేయబోయే ఆఫీసు. అంతా కొత్తవాతావరణం.... రకరకాల మనుషులుంటారు.... అందరి మధ్య ఎలా మసులుకోవాలో? -ఆలోచిస్తూనే క్రిందికిదిగింది కళ్యాణి.

ఆమె కారు దిగంగానే ప్రత్యక్షమైనట్లు కనిపించాడు సుందరమూర్తి.

"హలో, కళ్యాణిగారూ!.... ఏమిటి ఇలావచ్చారు?" -శారద ఇంట్లో ఆమెను చాలాసార్లు చూశాడు -ఆ పరిచయాన్ని పురస్కరించుకొని కనిపించగానే అడిగాడు.

విషయం చెప్పింది కళ్యాణి.

"అలాగా!.... నేను పనిచేసేది ఈ ఆఫీసులోనే.... అయితే మనం పనిచేయబోయే సెక్షన్‌లు వేరు.... అందుకే మీ అప్పాయింట్ మెంటు గురించి నాకు తెలియలేదు... సరేగాని మీరు కారులోంచి దిగారు....?" —'ఇంతకూ ఆదెవరిది?' అన్నట్లు ఆ కారువైపు చూశాడు.

"అదా!.... ఆకారు మా అన్నయ్యది.... రండి పరిచయం చేస్తాను" అంటూ అతణ్ణి హేమంత్‌కు దగ్గరిగా తీసుకువెళ్ళింది కళ్యాణి.

## 9

"మనం శారదావాళ్ళ ఇంటికి వెళ్ళాలన్నయ్యా.... సోమశేఖరం గారు మరీమరీ చెప్పారు" అంటూ కళ్యాణి చెప్పి దాదాపు పదిరోజులైంది. కాని ఆమెమాటను నిలబెట్టలేకపోతున్నాడు హేమంత్. కారణం ఏమో సందేహాలు.... 'అసలు ఆ సోమశేఖరంగారు ఎలాంటివ్యక్తి, కనిపించగానే తనని ఎలా అర్థం చేసుకుంటారో, ఏమని అడుగుతారో?' —అని వెనకాడుతూంటాడు కొంతసేపు. 'మరి ఎంతకాలం ఈ ముసుగులో గుద్దులాట?.... శారద తనకు కావాలని పట్టుదలగా ఉన్నప్పుడు ఏదో ఓరోజు వాళ్ళ ఇంటికి వెళ్ళక తప్పుతుందా?.... ఎప్పుడో వెళ్ళే బదులు ఈరోజే వెళ్ళిపోలా? కళ్యాణి మనసూ చిన్నబుచ్చుకోకుండా ఉంటుంది' అని ముందుకు దూకాలను కుంటాడు కాసేపు. మొత్తానికి తెగించి ఏమీ చేయలేక పోతున్నాడు.

....శారదను చూడందే తను ఉండలేక పోతున్నాడు ఈమధ్య. అప్పుడే ఆమె కనిపించక నాలుగు రోజులైంది... ఈవేళైనా శారదను కలుసుకోవాలి.... ధైర్యంచేసి వాళ్ళ ఇంటికి వెళ్ళితీరాలి —అన్ని మానసిక శక్తుల్ని కూడ దీసుకొని పడుకున్నవాడల్లా లేచి ముస్తాబవసాగాడు హేమంత్, ఆవేళ సాయంత్రం.

రోజూలాగే జగదీశ్వరమ్మ "ఎక్కడికి, ఏమిటి?" అని అడక్కుండా "కొంచెం త్వరగా ఇంటికి వచ్చెయ్యరా అబ్బాయ్" అని చెప్పింది బయలుదేరిన కొడుకుతో.

"ఊఁ" అని— కారు బయటికి తీద్దామని గేరేజి దగ్గరికివెళ్ళాడు.

అదే సమయంలో ఓ ఆటోరిక్షావచ్చి తమగేటు ముందు ఆగటం, దానిలోంచి రామచంద్రరావు దిగి ఆటోను పంపించి సరాసరి లోపలికి రావటం గమనించిన హేమంత్ చైతన్యరహితుడై పోయాడు.

రెండున్నర సంవత్సరాలతర్వాత తొలిసారిగా హేమంత్‌ను చూస్తున్న ఆయన కనులు మెరిశాయి. "బాగున్నావా, బాబూ ?" అంటూ దగ్గరికివచ్చాడు.

హేమంత్‌కు మాత్రం రామచంద్రరావును, చూశాక అనుభూతి లాంటిది కలక్కపోగా చిరాకనిపించింది .... ఇన్నిరోజులూ ఆగి ముహూర్తం కుదిరినట్లు — శారద ఇంటికని తను బయలుదేరటమేమిటి ?- ఈ వేళప్పుడే ఈయన రావటమేమిటి ?

"ఏదో ఇలా ఉన్నాను." అన్నాడు పొడిగా - తప్పని పరిస్థితి ఏర్పడి.

"అంత ముక్తసరిగా మాట్లాడు తున్నావ్ ?— నా మీదకూడా కోపమేనా హేమంత్ ?" — మనసులో అభిప్రాయాన్ని దాచకుండా బయట పెట్టాడు రామచంద్రరావు.

"ఒకరి మీద కోపం పెంచుకొని నేను సాధించ గలిగేదేమిటి? రా మామయ్యా లోపలికి...." అంటూ దారితీశాడు హేమంత్.

జగదీశ్వరమ్మ అందరి యోగక్షేమాలూ పేరుపేరునా అడిగి తెలుసుకొంది. అతిథిసత్కారాలు చేసింది.

"ఇప్పుడు నేను వచ్చిన పనివేరు హేమంత్...." చాలా సేపటి తర్వాత అన్నాడు రామచంద్రరావు.

ఆయన మాటలను పట్టించుకోనట్లు ఊరుకుండిపోయాడు హేమంత్.

"నీ విషయంతో ఇప్పుడు రజని పూర్తిగా మారిపోయింది హేమంత్ !"

ఆశావహంగా అంటున్న ఆయన మాటలకు - దిగ్గున లేచాడు హేమంత్ ! "మీ అమ్మాయి మాట వదిలి మరేమైనా మాట్లాడు మామయ్యా వింటాను" అన్నాడు.

"నామాటనమ్ము హేమంత్ .... రజని ఇప్పుడు చదువుకూడా మానేసింది !...." అర్థింపుగా అన్నాడు రామచంద్రరావు.

"ఉత్తరాల ప్రహసనం బయటపడినప్పుడే నీ మాట మీద నాకు నమ్మకం పోయింది. మామయ్యా...రజనికి కన్నతండ్రివి. బాధ్యతకోసం ఇప్పుడూ నన్ను ఏదో విధంగా మభ్యపెట్టాలని చూస్తున్నావ్....కానీ, నువ్వనుకున్నంత అమాయకుణ్ణి కాను నేను....అయినా డిగ్రీల మీద డిగ్రీలు పొంది చాలాగొప్పదై పోయిన మీ అమ్మాయి ఎక్కడ? ఏ డిగ్రీలేని నేను ఎక్కడ ?.... మా యిద్దరికీ పొసగదని ఏనాడో తేలిపోయింది.... అలా అని మీ అమ్మాయే తేల్చిచెప్పింది ఆనాడు మీ డాబామీద....బలవంతం మీదచేస్తే ఏదైనా వికటిస్తుంది.... పెద్దలు....దయవుంచి మీరంతా మమ్మల్ని మా యిష్టాయిష్టాలకు వదిలేస్తేనే - పిన్నలం మేం కొంత కాలంపాటైనా ప్రాణాలతో ఉండ గలుగుతాం" అంటూ నిర్మోహమాటంగా - తెగవేసినట్లు చెప్పేశాడు హేమంత్.

"సరే, హేమంత్... నువ్వేలా భావించుకున్నా—ఏదోబాధ్యత కోసమని వచ్చి—చెప్పవలసింది చెప్పాను. తర్వాత నీయిష్టం" అని అంతటితో ఆ ప్రసక్తి వదిలేశాడు రామచంద్రరావు.

వాళ్ళిద్దరిమధ్య జగదీశ్వరమ్మ కలుగజేసుకోలేక పోయింది.... గత అనుభవాన్ని బట్టి —రజనిలో వచ్చినట్లు చెప్పబడుతున్న పరిమార్పుమీద ఆవిడకూ నమ్మకం చిక్కలేదు.

టౌనులో పని ఉంది మామయ్యా...వెళ్ళొస్తాను" అంటూ లేచాడు హేమంత్— కొద్దిసేపటితర్వాత.

"టౌనుకు అయితే నేనూవస్తాను హేమంత్ .... ప్రసాద్‌ను చూడాలి.... అన్నట్లు నీకు చెప్పటం మరచిపోయాను.... ఆరోజు మా యింటిదగ్గర కనిపించలా— మా బంధువుల అబ్బాయి ప్రసాద్— అతడు ఈ టౌన్‌లోనే ఉండేది. యాడాదైందనుకుంటా ఉద్యోగంలో చేరి....నన్ను ఓసారి వచ్చి చూసి వెళ్ళమని ప్రతి ఉత్తరంలోనూ రాస్తున్నాడు...పాపం ప్రసాద్‌కు నేనంటే తగని అభిమానం" అంటూ తనూ బయలుదేరటానికి సిద్ధమయ్యాడు.

"అలాగే.... పద మామయ్యా" అన్నాడు హేమంత్,

"అక్కయ్యగారూ....మరినేను వెళ్ళివస్తాను.... ఈ రాత్రి బస్‌కే అట్నుంచి అటే వెళ్ళిపోతాను.... మరి ఇక్కడికి వచ్చిన పని అయిపోయిందిగా ?" అని-జగదీశ్వరమ్మ తిరుగు సమాధానానికి కూడా ఎదురు చూడకుండా చర చర బయటికి వెళ్ళి- హేమంత్ పక్కనే కారులో కూర్చున్నాడు రామచంద్రరావు.

పేట- ఇంటి నెంబరు స్పష్టంగానే యిచ్చినా ప్రసాద్ ఇల్లు తెలుసుకోవటం కొంచెం కష్టమే అయింది.... అయినా కదలకుండా వాళ్ళను వీళ్ళను అడుగుతూ పోగా ఓ పెంకుటిల్లు చూపించారు. ఆ యింట్లోనే ఓ చిన్నగది అద్దెకు తీసుకొని ఉంటున్నాడు, అతడు.

శ్రమపడి తనని వెతుక్కొంటూ వచ్చిన రామచంద్రరావును చూడటంతో— సంతోషమైంది ప్రసాద్‌కు. ఆ ప్రక్కనే హేమంత్ కూడా కనిపించడంతో మరింత పొంగి పోయాడు.

"రా మామయ్యా.... రండి హేమంత్.... " అంటూ గది లోపలికి తీసుకువెళ్ళి "అతిధులకు కొద్దిపాటి మర్యాద కూడా చేయలేని అభాగ్యుణ్ణి.... దీనిమీద కూర్చోండి" అంటూ ఓచాప పరిచాడు.

"పైకి ఆర్భాటాలు చేసినంత మాత్రానే మర్యాద అవుతుందా ప్రసాద్ ? .. మనసులో ఉండాలోయ్ అభిమానం ! నువ్వు కూర్చోమంటే కటికనేల మీదైనా కూర్చోగలను " అంటూ ఆ చాపమీద కూర్చున్నాడు రామచంద్రరావు.

హేమంత్ మాత్రం కూర్చోలేదు.... అసలు ప్రసాద్‌ను చూస్తుంటేనే అతడి కెందుకో ఈర్ష్యలాంటిది ఏదో కలుగుతోంది....రజనికి ఇష్టుడైనవాడు ప్రసాద్.... ఇతడితో మాట్లాడినట్లు తనతో మాట్లాడటానికి మనస్కరించక పోయింది ఆమెకు - ఆనాడు ఈ గతిలేనివాడి పాటి చేయలేక పోయాడు తను.... ఒకవేళ రజని మనసు అలా మారిపోవటానికి సూత్రధారుడు ఇతడేనేమో ? —

"మీ అల్లుడిగారికి నా మర్యాద నచ్చనట్లుంది మావయ్యా...." అన్నాడు చాపమీద కూర్చోకుండా నిలబడి ఉన్న హేమంత్ వైపు అదోలా చూస్తూ.

అతడి నోటివెంట ఆ మాట రావటంతో - ఏమనిపించిందో టక్కున కూర్చున్నాడు. హేమంత్ అదే చాపమీద.

ప్రసాద్ కుటుంబ పరిస్థితులు అడిగి తెలుసుకున్నాడు. రామచంద్రరావు.... ప్రత్యేకించి రజనిని గురించి ఒకటి రెండుసార్లు అడిగాడు ప్రసాద్-మాటల సందర్భంలో.

అతడు పదేపదే రజని ప్రసక్తి తేవటం, ప్రక్కనే హేమంత్ ఉండటం - కొంచెం ఇరకాటాన పడ్డట్లైంది రామచంద్రరావుకు.

"....సరేగాని ఇక్కడ నీ ఉద్యోగ పరిస్థితులు ఎలా ఉన్నాయ్? సంభాషణ మార్పు చెయ్యటానికి అడిగాడు.

"బాగానే ఉన్నాయి మామయ్యా...." అంటూ కొంచెం వివరంగానే చెప్పాడు. అతడి మాటలనిండా బీద పలుకులే.

హేమంత్ శరీరం అక్కడ ఉన్నా మనసు ఎక్కడో ఉంది. రజనిని గురించి పదేపదే ప్రసాద్ ప్రస్తావించటంతో - అతడి అది వరకటి అనుమానం పూర్తిగా ధృవపడిందిప్పుడు. ఇదన్నమాట విషయం.... రజని మనసులో విషబీజం నాటి,ఆమెను తనకు కాకుండా చేసినవాడు వీడే. సందేహం లేదు.... అటువంటి ప్రసాద్ ముందు మరొక్కక్షణం కూడా ఉండబుద్ధి కావటంలేదు. అలా అని రామచంద్ర రావును వదిలి తాను ఒక్కడే వెళ్ళలేకపోతున్నాడు....

మరికొద్దిసేపటి తర్వాత "నేను వస్తాను ప్రసాద్" అంటూ రామచంద్రరావే లేచాడు. కాదనలేదు ప్రసాద్.... హేమంత్ అతడికి మాట మాత్రమైనా చెప్పకుండా ఇవతలకు వచ్చేశాడు.

అదే సమయంలో సుందరమూర్తి వచ్చాడు అనుకోకుండా.

"మూర్తీ!.... సమయానికి వచ్చావు రారా.... ఈయన మామయ్య రామచంద్రరావుగారు. తెలుసుగా?.... హైద్రాబాద్‌లో ఉండగా వీళ్ళయింటికి నాతో కొన్నిసార్లు వచ్చావు గుర్తులేదూ?" అన్నాడు ప్రసాద్.

"ఓ.... మీరా!.... నమస్కారం సార్!.... ప్రసాద్‌తో కలసి మీ యింటికి చాలాసార్లు వచ్చాను.... అన్నట్లు మీ అమ్మాయి - రజనిగారు కులాసాగా ఉన్నారా ?" అన్నాడు మూర్తి గత పరిచయంతో.

"కులాసాగానే ఉంది బాబూ" చెప్పాడు రామచంద్రరావు.

తర్వాత ఆయన ప్రక్కనే నిలబడి ఉన్న హేమంత్‌ను చూసి "మీరు కళ్యాణి అన్నగారు కదూ?.... ఆవేళ మా ఆఫీసుదగ్గిర చూశాను. మరి ఇక్కడ ఉన్నారేమిటీ" అనడిగాడు మూర్తి.

"ఏదోలెండి రావలసి వచ్చాను" అసహనంగా అని రా మామయ్యా" అంటూ రామచంద్రరావును తొందర చేశాడు హేమంత్.

"సరే, వెళ్ళొస్తాను ప్రసాద్ ...వెళ్ళొస్తాను బాబూ...." అని ప్రసాద్, సుందరమూర్తులకు చెప్పి హేమంత్‌తోపాటు వెళ్ళి కారులో కూర్చున్నాడు రామచంద్రరావు....ఆయన మనసులో ఇందాక మూర్తి అన్న మాటలే మెదులుతున్నాయి.... కళ్యాణా.... హేమంత్ ఆమెకు అన్నయ్యా?.... ఎవరామె?.... ఏమిటి వాళ్ళిద్దరిమధ్య ఉన్న అనుబంధం?.... వీట్నిగురించి అడగటం మొదలు పెట్టాడు.... దాచి పెట్టకుండానే తనపిన్ని, ఆమె సంసారం గురించి చెప్పాడు హేమంత్. రామచంద్రరావు 'వాళ్ళనుకూడా ఓసారి చూడాలన్న' కోరిక వ్యక్తం చేయటంతో అటు మళ్ళించాడు హేమంత్ తన కారును.

• • •

ఏమిటిరా ప్రసాద్, హేమంత్ కూడా మీ రామచంద్రరావు మామయ్యకు బంధువేనా?" అడిగాడు సుందరమూర్తి అనుమానం వచ్చి.

"అవును మూర్తీ!....నేను ఇంకా దూరపు బంధువును. కానీ, హేమంత్ ఆయనకు చాలా దగ్గిరవాడు...." అంతకు మించి చెప్ప లేకపోయాడు ప్రసాద్.

అలాగా!.... సరే, మీ బంధాలు, అనుబంధాల గొడవ నాకు దేనికి గాని - అలా షికారుకు వెళ్ళొద్దాం పద ప్రసాద్" అన్నాడు మూర్తి.

"నేను రాలేనురా... నువ్వెళ్ళు" అన్నాడు ప్రసాదు నిస్సారంగా కూలబడి.

"ఏం బయటి ప్రపంచంతో సంబంధం పెట్టుకోదల్చుకోలేదా నువ్వు ? ఆఫీసు వదిలితే ఇల్లు, ఇల్లు వదిలితే ఆఫీసు.... వట్టి జడ పదార్థానివై పోతున్నావ్.... అలా కుదరదురా ఇక. కనీసం రేపు ఆది వారమైనా నువ్వు మా యింటికి వచ్చితీరాలి.... రోజూనేనేనా నీగదిని వెతుక్కొంటూ రావటం?"

"అలాగే లేరా బాబూ, అనవసరంగా మాటలతో నా ప్రాణం తీయకు." అన్నాడు ప్రసాద్ చివరికి.

## 10

"మరి నేను వెళ్ళి వస్తారా మూర్తీ...." అంటూ కూర్చున్న చోట నుంచి లేచాడు ప్రసాద్.

"అప్పుడే!.... మరి కాసేపు కూర్చోరా బాబూ.... చీకటి పడితే దొంగ లెత్తుకు పోతారని భయమా?"- నవ్వాడు మూర్తి.

"అఘోరించినట్లుంది నీజోక్ ....ఏదో మీయింటికి రమ్మన్నావు. వచ్చాను. మీ అమ్మగార్ని చూశాను. కాసేపు కూర్చోని పిచ్చాపాటీ

నీతో మాట్లాడాను. సరిపోలా ?.... అయినా నీ దగ్గిర గంటలతరబడి కూర్చోవాలంటే నాకు బోరుకొడుతోంది. కాసేపు అలా...."

"బజార్లో కొత్తకొత్త ముఖాలను చూస్తూ పచార్లు చేస్తుంటే సరదాగా ఉంటుందంటావా? సరే. పద. నాకూ ఇంట్లో బోరుగానే ఉంది.... అయితే ఇంకోపనిచేద్దాం. కాసేపు అలా అలా తిరిగి ఏ పిక్చరుకో చెక్కేద్దాం. ఓ.కే.?"

"ఓకె.... నీనుంచితప్పించుకోగలన్రా?" అని - మూర్తి తల్లి రాజమ్మకు "వెళ్తున్నానని" చెప్పి ఇద్దరు బయలుదేరారు.

అప్పుడు దాదాపు సాయంత్రం అయిదు కావస్తోంది.... చేతులు కలుపుకొని నడుస్తున్నారు మూర్తి-ప్రసాద్.

"ప్రసాద్! నీకుచెప్పటం మరచి పోయాను.... మనం వెళ్ళే దారిలో మా బంధువుల ఇల్లుఉంది....సోమశేఖరంగారు నాకు మామయ్య వరుసవుతాడు. వాళ్ళమ్మాయి శారద-చాలా బ్యూటీగా ఉంటుంది..... ఆ అందాన్ని చూడటానికే నేను తరచు వాళ్ళ ఇంటికి వెళ్తుంటాను"- ఆత్మీయుడైన మిత్రుడికి తన మనసులోని మాటను చెప్పుకున్నాడు **మూర్తి.**

**"అంటే.... ప్రేమజబ్బు ప్రవేసించిందన్న మాట నీలో !"** అన్నాడు ప్రసాద్

"ఏం జబ్బోరా... ఆమెను చూస్తూ కూర్చుంటే యుగాలైనా గడిపేయ్యగలను".

"అలాగా!....అయితే లాభం లేదు. నీజబ్బు ముదిరిపోయింది"

"ఈ ముదిరిపోయిన జబ్బు నయం చేసుకోవాలనేరా నేను తంటాలు పడుతోంది... ఇంతకూ నా సెలక్షన్ ఎలా ఉందో నువ్వో చూద్దువుగాని. రా.... కొత్తవాడివైన నిన్ను పరిచయం చేసినట్లూ ఉంటుంది. నా స్వప్నసుందరిని చూసుకున్నట్లు ఉంటుంది."

"నీ కాబోయే అర్ధాంగిని చూడటం - నాకూ ఆనందమే పద."

నడుస్తూ సోమశేఖరంగారి ఇల్లు అల్లంతదూరాన ఉండగానే స్తంభీభూతులైపోయారు మూర్తి, ప్రసాదులు. కారణం వాళ్ళిద్దరూ ఎరిగిన హేమంత్ కారు ఆ ఇంటిముందు ఆగి ఉండటమే!

"హేమంత్ చెల్లెలు కళ్యానికి, శారదకు స్నేహం... కల్యాణి అతన్ని తీసుకువచ్చి ఉంటుంది" అన్నాడు మూర్తి.

"అలాగా!.... అయితే హేమంత్‌కు ఓ చెల్లెలున్నట్లు నాకు ఇంతవరకు తెలియదు?" అన్నాడు ప్రసాద్.

"నాకూ తెలియదు...కళ్యాణి పనిచేసేది మా ఆఫీసులోనే .... హేమంత్ తన పెద్దమ్మ కొడుకని చెబుతూంటుంది" అన్నాడు మూర్తి.

"....అయితే మనం ఇప్పుడు అక్కడికి వెళ్ళటం....బాగుంటుం దంటావా?.... హేమంత్ వీళ్ళయింటికి వచ్చిననాడే నేను మీ యింటికి రావటం, శారదను చూపస్తానని నువ్వు నన్ను ఇక్కడికి తీసుకురావటం బలే చిత్రంగా ఉందిరా" —ప్రసాద్‌కు 'కలయో వైష్ణవ మాయయో అన్నట్లుంది అంతా.

"అంతా చూస్తుంటే నాకూ వింతగానే ఉంది ప్రసాద్....నిజానికి-మనం అనుకుంటే కావాలని ఏవీ జరగవు.... తలవనివి మాత్రం సులభంగా జరిగిపోతూంటాయ్.... హేమంత్ అక్కడ ఉన్నంత మాత్రాన మనం వెళ్ళకూడదని ఎక్కడ ఉంది?.... అయినా అతన్ని గురించి వెనకాడవలసిన పని మనకు లేదు...కమాన్...."- అన్న మూర్తిని అనుసరించాడు ప్రసాద్.

ముందు గదిలో హేమంత్, సోమశేఖరంగారు కూర్చొని తాపీగా మాట్లాడుకుంటున్నారు. ప్రక్కగదిలోనే శారద, కళ్యాణి తలుపు దగ్గిర ఓరగా చూస్తూ నిలబడి వాళ్ళు మాట్లాడే మాటలను ఆలకిస్తున్నారు.

మూర్తిని, అతడి వెనకాల వస్తున్న ప్రసాద్‌ను ముందుగా సోమశేఖరంగారే చూశారు.

"ఓ! సుందరమూర్తీ, నువ్వా! రా....సమయానికి వచ్చావ్.... ఇంతకూ ఇతడు...." అంటూ ప్రసాద్‌వైపు చూస్తూ ఆగిపోయాడు ... హేమంత్ కూడా ప్రసాద్ వైపు చూసి - ఖంగు తిన్నట్లయ్యాడు.

అతణ్ణి తన మిత్రుడుగా పరిచయం చేశాడు మూర్తి.

"అలాగా!.... సరేగాని మూర్తీ, ఈయన నీకు తెలుసా" - హేమంత్‌వైపు తిరిగి అడిగారు సోమశేఖరం.

తెలుసు మామయ్యా-ఈయన కళ్యాణి అన్నయ్య హేమంత్. మా ప్రసాద్‌కూ బాగానే తెలుసు హేమంత్‌గారు" అన్నాడు మూర్తి.

"అవునండీ మూర్తిగారు, ప్రసాద్-ఇద్దరూ నాకు లోగడే తెలుసు"- తెలిసిన వ్యక్తులను తెలియదని నటించటం అపోహాలకు దారి తీయవచ్చునని ఆలోచించి ముందే వేల్కొన్నాడు హేమంత్.

కాఫీ ఫలహారాలు పూర్తయ్యాయి.... స్వయంగా శారదే తీసుకు వచ్చి అందరికీ కాఫీలు యిచ్చింది....అప్పుడు "నా సెలక్షన్ ఎలా ఉంది బ్రదర్?" అన్నట్లు ప్రసాద్‌వైపు చూశాడు మూర్తి "వండర్ ఫుల్" అన్నట్లు సౌంజ్ఞ చేశాడు...ప్రసాద్...మూర్తి ఛాతి వెడలైంది.

చివరికి, "....నా పరిస్థితి ఏమిటో నేను చెప్పాను. మీరూ మీ అభిప్రాయం తెలుయ చేశారనుకోండి....ఏదైనా ఆ శుభకార్యం ఎంత తొందరగా జరిగితే అంత మంచిదనిపిస్తోంది.... అంతకు మించి ఏ

ఆడపిల్ల తండ్రైనా కోరుకొనేదేముంటుంది?"- తన మనసులోని మాట చెప్పేశారు సోమశేఖరం.

"ప్రయత్నిస్తానండీ" అన్నాడు హేమంత్ లేచి నిలబడుతూ.

"మరి మేం వెళ్ళివస్తామండీ" అంటూ చెప్పింది కళ్యాణి వచ్చి.

"మంచిదమ్మా" అన్నారు సోమశేఖరం కృతజ్ఞతా భావంగా చూస్తూ.

ఎవరికీ చెప్పపెట్టకుండా ప్రసాద్‌లేచి హేమంత్‌ను అనుసరించసాగాడు.

బయటికి వచ్చిన తర్వాత "నేనూ మీతో రావా లనుకుంటున్నాను హేమంత్‌గారూ. అనుమతిస్తారా?" అనడిగాడు.

విత్ ప్లెజర్.... కమాన్" హేమంత్ ప్రక్కనే కారులో ఎక్కి కూర్చున్నాడు ప్రసాద్. వెనక సీట్లో కళ్యాణి కూర్చుంది.... ప్రసాద్ కారెక్కి వెళ్ళటం చూసిన మూర్తి సినిమా ప్రోగ్రామ్ మిస్ అయినందుకు ఉస్సురన్నాడు.



"మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడ దామనుకుంటున్నాను." అన్నాడు ప్రసాద్ కారు కొద్ది దూరం పోయాక.

"ముఖ్య విషయాలా!.... అవీ మనమధ్య!.... అయితే ప్రసాద్, అవి ఈ జన్మకు సంబంధించినవా లేక గతజన్మ జ్ఞాపకాలా?" వ్యంగ్యంగా ధ్వనించింది హేమంత్ కంఠం.

"మీరు ఎలా అన్వయించుకున్నా నాకు సమ్మతమే.... కానీ, నేను చెప్పదలచుకున్నది మాత్రం చెప్పి తీరాను.... మీరు త్వరపడి అనాలోచితపు నిర్ణయాలు తీసుకుంటున్నారని నేను అనుకొంటున్నాను.

"నేనుమాత్రం అలా అనుకోవటంలేదు, మిస్టర్ ప్రసాద్... ఇటువంటి నిర్ణయానికి రావటంలో చాలా లేటు చేశానని అనిపిస్తోంది ఇప్పటికే..

"అభం శుభం ఎరుగని ఆడపిల్ల రజని..."

"రజనిని గురించి, నిన్ను గురించీ నాకు బాగా తెలుసు ప్రసాద్."

'....పూర్తిగా తెలియదనినేను అంటున్నాను హేమంత్‌గారూ"

"ప్రసాద్! నన్ను రెచ్చగొట్టకు.... నాకు కోపం తెప్పిస్తే ఏం జరుగుతుందో నాకే తెలియదు.... స్పీడుగా పోతున్న ఈ కారు లోంచి నిన్ను క్రిందికి తోసేయవచ్చు..."

"మీ యిష్టం హేమంత్.... ఏదైనా చావుకు భయపడి అంతరాత్మను మభ్యపరచుకోలేను నేను."

"మరోసారి చెబుతున్నాను ప్రసాద్... నన్ను రెచ్చగొట్టకు... అసలు నేనిలా మారి పోవటంలో నీ పాత్రా ఉంది. నాకు తెలుసు... అయినా, మనసులో అట్టడుగున ఏదో కొంచెం మానవత్వం మిగిలి ఉండబట్టి-నువ్వు నా కారు - ఎక్కగలిగి నా పక్కన కూర్చొని మాట్లాడగలుగుతున్నావ్.... ఇంకోమాట ప్రసాద్, బెదిరింపులకు భయపడేవాడు కాదు ఈ హేమంత్..."

"మీరు అపార్థం చేసుకొంటున్నారు.... ప్లీజ్....నా మాట వినండి...."

"అక్కరలేదు నాకు నీమాటలు.... మరో సంగతి - నువ్వు నా వ్యక్తిగత విషయాల్లో తలదూర్చటం మంచిదికాదు ప్రసాద్...." చాలా గట్టిగా చెప్పేశాడు హేమంత్. మరి మాట్లాడలేకపోయాడు ప్రసాద్.

వాళ్ళిద్దరి మధ్య సంభాషణను పూర్తిగా ఆలకించినా కళ్యాణి- ఏటూ మాట్లాడ లేకపోతోంది.... అయితే ప్రసాద్‌ను చూసి, అతడి మాటలు తీరును గమనించిన ఆమెకు - సానుభూతిలాంటిది ఏదో కలగసాగింది.

ప్రసాద్ మాటమీద కారు ఆపాడు హేమంత్. దిగిపోయాడు అతడు... ప్రసాద్ వెళ్తున్న దిక్కే చూస్తున్న కళ్యాణిచెయ్యి మాత్రం గాలిలో అల్లల్లాడింది - అదీ అప్రయత్నమే.

## 11

తెల్లవారిలేచి రోజూలానే ముందు వంట ప్రయత్నంలో పడ్డాడు ప్రసాద్.

సాంబారులో తిరగమూతచేసి- ఆ ఘాటుకు తనతోపాటు ఎవరో మరో వ్యక్తి తుమ్మినట్లనిపించి తల పక్కకు తిప్పి చూశాడు. చూస్తే- ఎదురుగా కళ్యాణి! ఆమెను చూసి తన కళ్ళను తానే నమ్మలేనట్లుండి పోయాడు ప్రసాద్.

"ఏమిటి అలా ఆశ్చర్యపోతూ చూస్తున్నారు....నేను - నేనే కళ్యాణిని ....మిమ్మల్ని ఓసారి మా యింటికిరమ్మని మూర్తిగారితో కబురుచేస్తే మీరు రాలేదు.... అందుకని అడ్రసు తెలుసుకొని నేనే ఇక్కడికి వచ్చేశాను" అంది కళ్యాణి.

"మీరు...ఈభూతగృహాన్ని అంత తేలికగా ఎలా కనుక్కో గలిగారో ! ....రండి...." అంటూ ఓచాపపరిచి "కూర్చోండి కళ్యాణి గారూ" అన్నాడు ప్రసాద్. సందేహించకుండానే కూర్చొంది కళ్యాణి.

"మీరు ఈవేళ-ఇలా మాయింటికి వస్తారని కలలో కూడా ఊహించుకోలేదు."

"నేను మాత్రం అనుకున్నానా!.... నిజానికి కొద్దిరోజుల క్రితంవరకు మీరెవరో నాకు తెలియదు... అంతా కాలవిచిత్రం....కాక పోతే-నామాట ప్రకారం మూర్తిగారితో కలిసి మీరు మాయింటికి వచ్చి తీరుతారు అనుకున్నాను...."

....చెప్పవలసిన సమాధానం తోచక-వెళ్ళి ఫ్లాస్క్‌లో ఉన్న కాఫీని రెండు కప్పుల్లో సర్దితెచ్చి ఒకటి కళ్యాణి కిచ్చి, ఒకటి తాను తీసుకున్నాడు.

"ఇక మీరు మాట్లాడ దలుచుకున్నది నిరభ్యంతరంగా మాట్లాడ వచ్చు" అన్నాడు కాఫీ పూర్తయ్యాక.

అతడు అభయమిచ్చాక కూడా-తను మాట్లాడటం ఎలామొదలు పెట్టాలో తోచనట్లు ఊరుకొంది కళ్యాణి.

"మీ అన్నయ్య చేయదలుచుకున్నదానిలో తప్పులేదని సమర్థించ టానికేనా మీరు వచ్చింది?"- ప్రసాద్ కంఠం అదోలా ధ్వనించింది.

"కాదు....నాకు తెలిసింది మీకు చెబుతాను. మీకు తెలిసింది నాకు చెప్పండి." అంది కళ్యాణి దిటవు తెచ్చుకొని.

అర్థంకానట్లు చూశాడు ప్రసాద్ ఆమెవైపు.

"అవును ప్రసాద్‌గారూ.... అన్నయ్య మాయింటికి పిలవని పేరంటంలా వచ్చాడు. మా కుటుంబాన్ని ఇబ్బందుల నుండి కాపాడాడు....మా అమ్మకు స్వంతబిడ్డ, నాకు నిజమైన అన్నయ్య అన్న భావం కలిగేట్లు నడుచుకున్నాడు అతడంటే తరగని అభిమానం ఏర్పడిపోయింది మాలో....అటు వంటి అన్నయ్య ఓ రోజు తన దీన గాథ చెప్పుకున్నాడు....అది విన్న మా గుండెలు మూలిగాయి బాధగా....తర్వాత రజని మీద పూర్తిగా ఆశవదులుకున్నట్లు, అందుకు తన స్వంత మామగారైన రామచంద్రరావే అంగీకరించి - పూర్తి స్వేచ్ఛతో నడుచుకోవటానికి అనుమతిచ్చినట్లు తెలియజేశాడు... ఆ వ్యక్తి అంటే అభిమానం చేతనైతేనేం, కాదుకూడదంటే ,అతడి నుంచి మాకు ఎలాంటి సహాయం అందకపోవచ్చునన్న స్వార్థచింతనతో నైతేనేం—శారద విషయంలో మేం ప్రోత్సాహమిచ్చాం. చివరికి వాళ్ళి ద్దరి ప్రేమ పెళ్ళివరకు దారి తీసింది. పెద్దమ్మను ఎదిరించైనాసరే ఆమెను చేసుకోవాలని పట్టుదలగా ఉన్నాడు అన్నయ్య .... అయితే నేను చేసిన పొరబాటల్లా అన్నయ్యకు లోగడే పెళ్ళైపోయినట్లు ముందే శారదకు చెప్పకపోవటమే— అలా చెప్పి చెడగొట్టవద్దని అన్నయ్యే ప్రాధేయపడ్డాడనుకోండి .... నాకు ఇప్పుడనిపిస్తోంది.....నన్నే ఓ ప్రాణమిత్రురాలిగా నమ్మి, తన భవిష్యత్తును నా చేతిలో పెట్టింది. శారద....మరి నేను నా స్వలాభం కొద్దీ దాన్ని ఓ ఊబిలోకి దించి నట్లైంది .... పోనీ 'నిజం ఇది' అని ఇప్పుడు చెబుదామూ అంటే అది నన్ను ఎలా అర్థం చేసుకుంటుందో, ఏమైపోతుందో ?.... అసలే మతి చెదరి ఉన్న అన్నయ్య తర్వాత ఎలా మారతాడో ?— ఈ సమస్యలే నన్ను వేధిస్తున్నయ్యండీ. అన్నయ్య మగవాడు. పరిస్థితులకు తట్టు కోగలడు....కానీ, శారద ఆడది...." - చాలా బాధగా ధ్వనిం చింది కళ్యాణి కంఠం....

కళ్యాణి మాట, ఆ తీరు చూశాక ఆమె పూర్తిగా నమ్మదగ్గ వ్యక్తిగాతోచింది ప్రసాద్‌కు.

అయితే, కళ్యాణి మాటల ద్వారా ఓ నిజం అతడికి అప్పుడే తెలిసింది...రజని కన్నతండ్రి రామచంద్రరావే హేమంత్‌కు పూర్తి స్వేచ్ఛ ఇవ్వటం ?— దీన్నేనమ్మలేక పోతున్నాడు....కానీ, నమ్మక

తప్పటంలేదు. ఎందుకంటే హేమంత్ ఆవేశపరుడే అయినా - అతడి నిజాయితీ శంకించదగినది కాదు మరి...లోలోపల ఆలోచిస్తున్నాడే కాని పైకి ఏమీఅనలేదు.

"నేను ఒకటి ఆలోచిస్తున్నాను ప్రసాద్‌గారూ.. ఆప్రకారమే నడుచుకుందామనుకుంటున్నాను. అయితే మీరు నాకో మాట ఇవ్వాలి...." అంది కళ్యాణి.

"ఏమిటి ?....చెప్పండి...." అన్నాడు ప్రసాద్ ఆతృతగా.

"గతంలోనే అన్నయ్యకు పెళ్ళైపోయిన విషయం మీద ఎవరికీ—ఆఖరికి మీ మిత్రుడు సుందరమూర్తికికూడా చెప్పొద్దు."

"అలాగే కళ్యాణిగారూ....అసలు హేమంత్ అంటే నాకు ఎలాంటి దురభిప్రాయంలేదు. అతడిలో కొంత కర్కశం చోటుచేసు కుందంటే — అందుకు కారణమూ నేను ఊహించుకోగలను...నేనే హేమంత్ అంటే కిట్టనివాడినైతే ఆనాడే శారదావాళ్ళ ఇంట్లో నిజం బయట పెట్టేసేవాణ్ణే ... రజనికి పెళ్ళైందన్న సంగతి సుందర మూర్తికి తెలుసు. అయితే హేమంతే ఆమెభర్త అని మాత్రం తెలియదు...ఇంతవరకు నేను వాడికీ సంగతి చెప్పలేదు....అలా చెప్పక పోవటమే ఇప్పుడు మంచిదైంది....మీ కోరిక ప్రకారం నాకు నేనై ఈ విషయం బయట పెట్టనులెండి." అంటూ కళ్యాణికి మాట యిచ్చాడు ప్రసాద్.

అతణ్ణుంచి అలాంటి హామీ లభించటంతో —తృప్తి ఫీలవుతూ ప్రసాద్‌కు చెప్పి బయలుదేరింది కళ్యాణి.

## 12

"హాయ్, కళ్యాణి! రా.రా.... నీగురించే అనుకొంటున్నాను" అంది శారద వికాసవదనంతో, ఆ సాయంత్రం తమ ఇంటికి వచ్చిన కళ్యాణిని చూసి....

కళ్యాణిలో మాత్రం ఎలాంటి ఉత్సాహం కనపడటం లేదు' పైగా ముఖమంతా ఆదోలాఉంది.

"ఏం అలాఉన్నావ్?.... ఆఫీసునుంచి సరాసరి ఇక్కడికే వచ్చినట్లుందే?.... రావే లోపలికి" అంటూ మిత్రురాలి చెయ్యిపట్టు కొని తన గదిలోకి తీసుకువెళ్ళింది శారద.

అయినా కళ్యాణిలో మార్పురాలేదు.

"ఉండవే... పాపం, పగలల్లా ఆఫీసులో పనిచేసి అలిసిపోయి ఉంటావ్.... కాస్తకాఫీ అయినా తాగితే ఫ్రెష్‌నెస్ వస్తుంది...." అంటూ లోపలికి వెళ్ళబోతున్న శారదను వారించింది కళ్యాణి.

"వద్దుశారదా.... కూర్చో.... నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడటానికి వచ్చాను..."

స్నేహితురాలి ధోరణి శారదను కలవరపరిచింది.

"నువ్వు నన్ను క్షమించాలి శారదా..." కళ్యాణి కంఠం ఆదోలా ధ్వనించింది.

ఆ మాటలకు శారద గతుక్కుమన్నది... అంటే.. అంటే... తన ఆశాసౌధాలన్నీ గాలి మేడలని తేల్చి చెప్పబోతోందా...

"ఇలా జరుగుతుందని నేను అనుకోలేదు" తిరిగి కళ్యాణే అన్నది.

శారద మస్తిష్కం మొద్దుబారి పోయినట్లైంది.

"మా అన్నయ్యకు ఇప్పటికీ నిన్నే చేసుకోవాలని ఉన్నది.... అయితే మాపెద్దమ్మ.... అన్నయ్య ఎంత నచ్చచెప్పాలని చూసినా ఆవిడ నిన్ను తమ కోడలిగా చేసుకోవటానికి ఒప్పుకోవటం లేదట...."

"అందుకు మీ అన్నయ్య సమాధానం?"

"అదేపాలు పోవటంలేదు అతడికి.... మాపెద్దమ్మ ఎలాంటి మనిషైందీ—స్వంతచెల్లెలైన మా అమ్మ విషయంలోనే ఎంత కఠినంగా వ్యవహరించిందీ నీకు లోగడే చెప్పాను.... ఇప్పుడు అలాంటి ఆవిడ మాట కాదని నిన్ను చేసుకొంటే— అన్నయ్యకు వాళ్ళ ఆస్తిలో చిల్లిగవ్వయినా దక్కనిస్తుందా.... 'ఈ యింటితో సంబంధం లేదనుకొంటే వెళ్ళి ఆపిల్లనే చేసుకో' అని నిర్మొహమాటంగా చెప్పేసిందట కూడా.. మొదట్నుంచీ దర్జాగా బ్రతకటానికి అలవాటు పడ్డవాడు... నిన్ను చేసుకొంటే ఎన్నో ఇబ్బందులు పడవలసి వస్తుందని చెప్పమన్నాడు"

"ఇంకేమని చెప్పమన్నారు?"

ఈ పెళ్ళి విరమించు కోవటమే మంచిదనుకుంటున్నాడట.... అన్నయ్య తీసుకున్న నిర్ణయం నిన్నెంత కుంగదీస్తుందో నాకుతెలుసు శారదా... అయితే అతడు ఇలా చేయాలనుకొంటున్నదీ నీ మంచి గురించే.... ఎందుకంటే రాక్షస ప్రవృత్తిగల మా పెద్దమ్మకు కోడలై ప్రత్యక్షనరకం అనుభవించేకంటే, నిన్ను గౌరవాదరాలతో చూసుకొనే మరోయింటి కోడలైతే సుఖంగా బ్రతకగలుగుతావు... ఓ స్నేహితురాలిగా నా సలహా కూడా ఇదే... అయితే నీకు సలహా ఇవ్వగలిగే అర్హతను నేను పోగొట్టుకున్నానేమో....మరి నావల్లేగా నీకు ఈనాడు ఇంత అశాంతి, అల్లకల్లోలం? ....ఏదైనా శారదా, మా అన్నయ్యతో పరిచయాన్ని ఓ పీడకలగా మరిచిపో... మనసుంటే నన్ను అర్థం చేసుకొని మన్నించు... " అంటూ కన్నీటి పర్యంతమై శార

రెండు చేతులూ పట్టుకొంది కళ్యాణి. "తర్వాత నేను వెళ్ళొస్తాను శారదా" అని చెప్పి చర చర వెళ్ళిపోయింది.

వారించే ప్రయత్నం చేయకుండా కళ్యాణి వెళ్ళిన దిక్కే చూస్తూ వెనక్కు వాలి పోయింది శారద.

తనముందు, తండ్రిముందు అంత ధైర్యంగా మాట్లాడిన హేమంత్ — చివరకి ఇలాంటి పిరికి సలహా యిచ్చి తప్పుకుంటాడా? వ్యవహారం పెళ్ళి—పెద్దలు దాకా తీసుకువచ్చి మరో ఇంటి కోడలై సుఖపడమని బూటకపు మాటలు చెబుతాడా? ... అతణ్ణి సమర్థించినట్లు మాట్లాడుతుందా కళ్యాణి?

భగవాన్ ! ఏమిటి ఈ పరిస్థితి ? .... ఇంత కాలం తన కలలన్నీ కల్లలు. నమ్మకాలన్నీ భ్రమట .... ? ఈ మాట చెప్పి ఇంట్లో వాళ్ళముందు ఎలా తలెత్తుకు నిలబడటం ? అభిమాన ధనుడైన తన తండ్రి నిజం తెలిశాక ఏం చేస్తాడు ? ఏమైపోతాడు ? ....

"ఏమిటి అమ్మాయ్, శారదా ! ...అలా పడుకున్నావేమిటి అసుర సంధ్యవేళ ?.... లేదే అన్నట్లు ఇంతకుముందు కళ్యాణి వచ్చి నట్లుంది... అప్పుడే వెళ్ళిపోయిందేమిటి ? " అంది అటుగా వచ్చిన అనసూయమ్మ.

తల్లిమాట తీసివేయ లేనట్లు లేచి కూర్చొని, "వచ్చింది.... వెళ్ళిపోయింది... "— మాట్లాడుతుంటే ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా దుఃఖపు పొంగు ఆగలేదు శారదకు.

"అదేమిటే అమ్మాయ్ .... ఆ కళ్ళనీళ్ళేమిటి ? " ఖంగారు పడింది అనసూయమ్మ.

తల్లి అలా అడిగే సరికి — శారదకు దుఃఖం మరికొంత ఎక్కువై." నాకు మిగిలినవి ఇవే " అంది తర్వాత

" అంతపనీ జరిగిందీ ! నేను అప్పుడే అనుకున్నాను .... ' అంతటి ఆస్తిపాస్తులు ఉన్న అబ్బాయి మన ఇంటికి అల్లుడు ఎలా అవుతాడు ? ' అని.... అలాగే జరిగిందన్నమాట ... అయినా కట్నాలు, కానుకలు లేకుండా చేసుకోమంటే ఎలా చేసుకుంటా దేమిటి ?.... అతడి పెద్దలూ ఒప్పుకోవద్దూ ?" — కూతుర్ని ఓదార్చటంపోయి, దీర్ఘాలుతీస్తూ మాట్లాడ సాగింది అనసూయమ్మ.

( ఇం కా వుం ది )

— * * * —

# ఎప్పుడు విముక్తి ?

## డి. లక్ష్మణాచార్య

నీ పాపిట సింధూరం ఎరుపు

నీ జడలో మందారం ఎరుపు

నీ పాదాల పారాణి ఎరుపు

నీ నుదుటన తిలకం ఎరుపు

చైతన్యానికి సంకేతం ఎరుపు,

అయినా మగువా !

ఎందుకు నీ మనుగడ

మగాడి చేతుల్లో ??

# త్రివేణిశ్రేణి !

## శ్రీ యస్. యస్. రెడ్డి

స్తంభించిన ఆవేశం

విజృంభించిన ఆలోచన

కలిస్తే— కవిత !

ఇవి విలోమంగా

విజిగీష పడితే,

ఉపన్యాసం !

ఈ రెంటికి అతీతంగా

అనుకోకుండా

అదుకునేది

మానవత !

# జీవితం ఉదయించింది

"విపంచి"

చీకటి చంపబడ్డ
ఓ చక్కటి ఉదయం
అంబరం సంబరం
చేసుకుంటుంది
అదిగో చూడు !
తెల్లారి వెలుగుని
పులుముకొన్న
నీలి ఆకాశం,
ఆనందోత్సాహాల
మబ్బుల తోరణాలు
అక్కడక్కడా
ఎర్రబడ్డ ఆకాశం
రాత్రి యుద్ధానికి
అద్దం!
ఆదర్శాల
సూర్యశరాలకి
విచ్చుకొంటున్న
ఆచరణ కమలాలవిగో!
రాత్రంతా
చీకటినివేటాడి
తూట్లు తూట్లు చేసిన
తారలవిగో
తూర్పులోకి జారుకుంటూ
ఈ ఉదయానికి
నిర్దేశకత్వం వహిస్తున్నాయి!
వేడెక్కిన
నాడులు
నవసృష్టికై
కృషి చేస్తున్నాయి!
'సంతమస' సంహారానికి
సంతసంతో ఆరుపుకొంటున్న
ఈ వేడుక
మానవ ప్రస్థానంలో
చిత్రకావ్యం!
జీవితానికో
కొత్త భాష్యం!!

# శిధిలాలయం

శ్రీ దేవరపల్లి ప్రభుదాస్

ప్రేయసీ!
నాడు, నామది ప్రేమాలయం
నేడు, అది శిధిలాలయం
నాడు నీవు
నా హృదయ కేదారంలో
ఆశల గులాబీలు నాటావు
సుహసిత సరాగాలతో
పుష్పింపచేశావు
నవకుసుమ సౌరభాలతో
వసంతోద్యానం చేశావు
నేడునీవే
కఠిన కర్కశ శిల్పానివై
మృత్యురూపానివై
కోరలుచాచి
నిర్దాక్షిణ్యంగా నలిపివేశావు
పెంచినగులాబీలు త్రుంచివేశావు
పెనుగాలివై
సుడిగాలివై
వడగాలివై
చెలరేగి, చెలరేగి,
ప్రేమాలయాన్ని
శిధిలాలయం చేశావు
స్మశానంగా మార్చావు.
నీ వలపుతలపుల
పులకింతలహృది
జర్జరీ భూతయై కంపిస్తోంది
స్వర్గాన్ని నిజంచేసే నీవే
దాన్ని మిధ్యాస్వర్గంగా మార్చావు
ఆశిధిలాలయంలో
అంధకారతిమిరంలో
అల్లాడమంటూ
చివరకు ఆశీర్వదించావు !!

# ఇంక కావలసినదేమి?

మాడపాటి హనుమంతరావు



గోపాలరావునకు ఆదాయము తక్కువగాను, వ్యయము హెచ్చుగాను ఉండుట సంభవించెను. చిన్నికుమారుని ఎత్తుకొని యాడించుటకొరకు ప్రత్యేకముగా నొకపనిక త్తెనుంచుట కష్టముగ్గా గానిపించుచుండెను. అయినను, బాలుని యారోగ్యముయొక్క అవసరములు కొంతవరకును, సరివారిలో మర్యాదగా నుండవలయునను తలంపులు కొంతవరకును, పనిక త్తె జీతమును భరింప గోపాలరావును నిర్బంధించుచుండెను. పిల్లవానికి పనిక త్తెతో యెంతోమచ్చిక; నిముసమైనను దాని చంకవదలియుండడు. ఈకారణమువలన దానియక్కర మరింత అనివార్యమయ్యెను. పైకారణములుగాక మరియొకయంశముకూడ ఉండెను. మహలక్ష్మి ఆయింటియందు మూడు సంవత్సరములనుండి పనిచేయుచుండినది. గోపాలరావు యొక్క ఏకపుత్రు నది కడుప్రేమతో పెంచుచు, ఆడించుచుండుటేకాక, గృహసంబంధమగు ఇతర కార్యములను గూడ శ్రద్ధతో నిర్వహించుచుండెను. ఇట్టిదానిని అకారణముగ దొలగించుటకాని, తొలగించుటకేదని కారణమును కల్పించుటగాని గోపాలరావువంటి సత్స్వభావము కలవానికి దుస్తరముగ దోచుచుండెను. మొగమాటమాతని మానసమును సంపూర్ణముగ నాక్రమించి, మహలక్ష్మిని పొమ్మనునంతటి ధైర్యమునకు ఏ మాత్రము తావొసగ జాలదయ్యె.

మహలక్ష్మియొక్క వర్తనమునుగురించి గోపాలరావున కెంత మంచియభిప్రాయ ముండినను, రుక్మిణమ్మ మాత్రము భర్తతో నేకీభవించునది కాదు. మహలక్ష్మి యిల్లు గుల్లచేయుచున్నదని యామె తలంపు. బజారుకు పోయి వస్తువులు తెచ్చుచుండునపుడు, రుక్మిణమ్మ తలుపుచాటున పొంచుండి, కూరగాయలనుగాని, పంచదార పప్పుమున్నగు ఏవైన పదార్థములను గాని అవతల ఎచ్చటనైన దాచుకొనుచున్నదేమో యని తొంగితొంగి చూచును. తెచ్చిన సామగ్రులను పదిసారులు శోధించును, తర్కవితర్కములు సల్పును. "ఇంతేనా ?" "ఏధరచొప్పున తెచ్చినావు?" "అంత ప్రియమైనదా?" యనుప్రశ్నములవర్షము మహలక్ష్మిపై గురియుచుండును. మహలక్ష్మి ఈ ప్రశ్నలకు తరచుగా, మిగులవినయముతో, మృదుశబ్దములతో ప్రత్యుత్తరము చెప్పును. కాని దొరసానిగారికి కొంతకోపోద్రేకము కలిగినట్లు కానవచ్చినప్పుడు మాత్రము, పనిక త్తెయు కొంత యావేశమునకు లోనగుచుండెడిది. ఒట్టుపెట్టుకొనును; ప్రమాణము చేయును; ఉత్తర సాక్ష్యము నుల్లేఖించును : ప్రతివాదము సల్పును ! ఈ వ్యవహారమునందు ఎంతోకాలము గిడచుచుండెను ! ఇట్టినాటకము ప్రతిదినము ప్రదర్శింపబడుచుండెడిది. అయినను నాటకము సంపూర్ణ ప్రమోదాంతముగా గాని, సంపూర్ణ విషాదాంతముగా గాని యుండక, మహలక్ష్మి యొక్క దుఃఖాశ్రువులు కొన్ని నేలరాలుటతో సమాప్తమగుచుండెను. అదియే మంగళహారతి ! ఇన్నికష్టములు సహించుచు పనిక త్తె ఇంకను ఇంటియందే యుండుట రుక్మిణమ్మ అనుమానములకు దోహదము కల్గించుచుండెను. "కేవలము అబ్బాయిమీది అపేక్షవలన నిది యిల్లువదలక పట్టుకొని యున్నదని నేను నమ్మను, తన లాభముకొరకే నిలిచియున్నది !" అని యామె యనుకొనును. మహలక్ష్మి వంటి కొద్దికులపుమనిషియందు ఉదారమును లలితమును నగు ప్రేమభావముండుట యసాధ్యమని రుక్మిణమ్మ యూహ ! ! నిజమేనేమో ! ! !

## 2

ఒకనాడు దైవవశమున మహలక్ష్మి బజారునుండి కొంచెము ఆలస్యముగా యింటికివచ్చినది. దారిలో ఇద్దరు కూరగాయలమ్ముకొను ఆడువాండ్రు ఎందునకో తీవ్రముగా పోట్లాడుచుండిరి. వారి హస్తాభినయము, వారియుద్రేకపూరితమగు వాదవివాదము, వారిపరస్పర నిందారోపణ, వారొకరిపై నొకరు ప్రయోగించుకొను ఎక్కసక్కెములు, వారి సాక్ష్యము, వారి ప్రతిసాక్ష్యము, వారి పూర్వకథల యుల్లేఖనము నిరుపమానములుగా నుండెను. రెండుదావాగ్నులు తీండ్రించి పరస్పరాలింగనము చేయుచుండెనని భావింపుడు! రెండు విషసాగరము లుప్పొంగి సమ్మిళితము లగుచుండెననియైన తలంపుడు ! ! ఎట్టి ప్రశంసనీయమగు వాగ్వేగము ! ఎట్టి ప్రభావవంతమగు వక్తృత్వము !! ఇరువురిలో ప్రతి యొకతెయు తన భావముల ప్రకటింపవలయునను నుత్సాహాతిరేకమువలన రెండవదానిమాట చెవిజొఅనిచ్చుట లేదు. ఆశబ్దములయల్లిక, ఆ భావ గాంభీర్యత, ఆ యుపమాన పరంపర, ఆ తీర్మానములలోని తర్కమును వినినచో, అసూయాగ్రస్తుడు కాని మహాకవి యుండునా? ఆ చిలుక గోరువంకలు తమపలుకుల యానందమున నిమగ్నములై యుండెను. చూచువారికి క్షీరివద్దనున్న వాగ్జాలపుసరకు తరుగనిదిగా గానవచ్చుచుండెను! ఇదంతయు ఏందునకు వచ్చినది? ఒకతెవద్ద కూరగాయల గొనవచ్చినవాడొకడు రెండవయామెవద్ద వాని గొనినందునకు!

జనులు గుంపులు గుంపులుగా గూడియుండిరి. సిగ్గుమాలిన ఈ వ్యవహారమును, ఇట్టిభాషను వినువారిలో ఎందరో యౌవనులు, చదువుకొనిన వారుగూడ నుండిరి! ఎంత మంచి వినోదము !!

మహలక్ష్మి కూడ ఈ వినోదము ననుభవించుచుండెను. అంతలో తొమ్మిదిగంటల ధ్వని వినవచ్చెను. దాని మనము నావరించిన సమ్మోహనాస్త్ర ప్రభావము వదలిపోయెను ! గబగబ పరుగెత్తి ఇల్లు చేరెను !

దానిరాక చూచి, రుక్మిణమ్మ ముఖము పెంచుకొని యనెను. "ఏమే బజారులో దారి తప్పితివా?"

మహాలక్ష్మి అపరాధము నొప్పుకొను ముఖ లక్షణములతో, మార్కుల నేల వాల్చి ప్రత్యుత్తరమిచ్చెను. "దొరసానిగారు, నా కెరుకయున్న పనిమనిషి యొకతె చాల దినముల తరువాత దారిలో కనుపడినది. మాట్లాడుటలో కొంచెము ఆలస్యమైనది."

దొరసాని కోపము మరింత హెచ్చెను. "దొరగారికి కచ్చేరీకి (ఆఫీసుకు) పోవు వేళ యగుచుండగా, ఈ సమయములో నీవు విహారము సల్పుచుంటివా?" యనెను. సమయమును గ్రహించి, దాది మారుమాట పల్కక. అబ్బాయిని చంక నెత్తుకొనియె.

రుక్మి : (మొగమెర్ర జేసికొని విదిలింపుతో) "అబ్బాయిని దింపండి, దొరసానిగారూ! మీరు వదలితే గుండె పగలదు లెండి!!"

యజమానురాలి ఈ యాజ్ఞను నెరవేర్చుట దాది కవసరముగా దోచలేదు. ఆమె కోపమును చల్లార్చుటకు ఆమె యాజ్ఞను నిరాకరించుటయే ఉత్తమమగు ఉపాయమనితోచెను. అబ్బాయిని అట్లే చంకనుంచుకొని ద్వారమువైపు నడచుచుండెను. రుక్మిణమ్మ తొందరగాబోయి, పిల్లవానిని దాది చంకనుండి లాగికొని యనెను. "నీ నంగనాచితనము చాలకాలమునుండి చూచుచున్నానులే. నాకీ చమత్కారములు చూపవలసిన పనిలేదు. మరెవరికైన చూపు కొల్లలు! కొల్లలు ! !"

మహాలక్ష్మి అబ్బాయిని ప్రాణసమానముగా ప్రేమించుచుండెను. రుక్మిణమ్మకు ఈ సంగతి తెలియుననియే దాని తలంపు. రుక్మిణమ్మను, తనను బంధించుచుండిన ఏకపాశము ఏదైననున్నచో అది అబ్బాయియే అని యనుకొనెడిది. కఠినవాక్కులు ఈ బంధమును సడలింపజాలకుండెను. తనను నౌకరీనుండి తొలగింతురని అది ఎప్పుడును అనుకొని యుండలేదు. కాని యిప్పుడు అబ్బాయిని బలవంతముగా చంకనుండి లాగుకొనినమీదట దాదికి సహనము తొలగిపోయెను. "అమ్మగారూ, నావలన అంత గొప్ప తప్పిదమేదియు జరుగలేదు. మహా అయితే పావుగంట ఆలస్యమై యుండవచ్చును. దీని కింత ఆగ్రహపడుచున్నారు! 'ఇంకొక యిల్లుచూచుకోవే'యని స్పష్టముగా చెప్పగూడదు? పుట్టించినవాడు పిడికెడు కూడు పెట్టడా? కూలినాలి దొరకని కరువు కాలము కాదుగదా! అమ్మా" అని ముఖము చిట్లించుకొనెను.

రుక్మి : "నీవు లేకపోతే మాకు మాత్రము పని సాగదా ఏమి? నీవంటి పనికత్తెలు పైసాకు పదిమంది తిరుగుచున్నారు!"

మహా : "చల్లగా ఉండండి, అమ్మగారూ దాదులు పనికత్తెలు కావలసినంతమంది దొరుకుతారు. నాతప్పు మన్నించి సెలవిప్పించండి!"

రుక్మి : "మగవాండ్ల వద్దకిపోయి నీకు రావలసిన జీతము లెక్క చూచుకో."

మహా : నాకు రావలసిన పైకముతో అబ్బాయికి మిఠాయి కొనిపెట్టండి."

ఇంతలో గోపాలరావు లోనికివచ్చి యడిగెను. ఏమి సమాచారము ?"

మహా : "అయ్యా! ఏమియును లేదు. దొరసానిగారు సెలవిచ్చినారు వెళ్ళుచున్నాను.

ఉత్తకాళ్ళతో నున్నవాడు ఎట్లు ముండ్లను తప్పించుకొనుచు నడుచుచుండునో, మన గోపాలరావుకూడ అట్లే గృహసంబంధమగు చిక్కులను, తప్పించుకొనుచు తొలగితొలగి తిరుగుచుండువాడు, కనుక కొంచెము కోపదృష్టితో ప్రశ్నించెను.

"అసలు ఏమి జరిగినది?"

రుక్మి : "ఏమియు జరుగ లేదు. నా యిష్టమువచ్చినది. ఉంచదలచుకొనలేదు; ఉంచనన్నాను. ఎల్లకాలము ఉంచుకొందునని కరారు చేసితినా?"

గోపా : సుఖముగా కుడిచి కూర్చుండలేక ఏదో యొకచిక్కు తెచ్చిపెట్టుకొను చుందువు."

రుక్మి : "ఏమి చేయను? నాకిట్టి వెఱ్ఱియున్నది. స్వభావమే యట్టిది. మీకు మహాలక్ష్మి ఇష్టమైనది కనుక మెడకు కట్టుకొనండి. ఇంటిలో దాని యవసరము లేదు!"

ఇల్లు వదలిపోవునపుడు దాదికన్నులు బాష్పపూరితములై యుండెను. అబ్బాయిని-కృష్ణమూర్తిని — ఒకసారి ఎత్తుకొని ముద్దుపెట్టుకొని మరి పోవలయునని హృదయము కొట్టుకొనుచుండెను. కాని ధైర్యము కలుగలేదు. నిరాశాభరితమగు మానసముతో మహాలక్ష్మి వాకిలి దాటెను !

## 3

కృష్ణమూర్తి దాది వెంటవెంట ద్వారమువరకు వచ్చెను. కాని మహాలక్ష్మి తలుపు బయటినుండి మూసెను. అమాయకుడగు బాలకుడు "మాచీ, మాచీ" అని యేడ్చుచు క్రిందబడి పొర్లాడసాగెను. రుక్మిణమ్మ అదమాయించెను; బుజ్జగించెను; ఎత్తుకొన యత్నించెను; మిఠాయి తెప్పించిపెట్టెదనని యాసగొలిపెను. బజారుకు తీసికొనిపోయి బొమ్మల చూపెదనని వాగ్దానమొనర్చెను. ఈ పద్ధతులలో నేదియు అక్కరకు రాకపోగా, కోతిపేరు బూచిపేరు చెప్పి భయపెట్టెను. అన్నియు వ్యర్థములయ్యెను. "తుదకు రుక్మిణమ్మకు కోపమువచ్చి, పిల్లవాని నేల చదికిలబడవేసి, గృహకృత్యములవైపు మరలెను. కృష్ణమూర్తి ముఖము, చెక్కులు ఎఱ్ఱబారెను కనురెప్పలుబ్బెను. ఏడ్చిఏడ్చి అల్లేయలసి, పరుండి నిద్రపోయెను.

'కొంచెముసేపు ఏడ్చి వాడే యూరకుండును' అని రుక్మిణమ్మ యనుకొనెను. కాని అబ్బాయి నిద్రలేవగానే మరల "మాచీ, మాచీ" యని దాది పేరు జెప్పుచు ఏడ్వసాగెను. సాయంత్రమువేళ గోపాల రావు కచ్చేరీ నుండి వచ్చి, బాలునిస్థితి చూచి, విచారపడి భార్యను కోప దృష్టితో నవలోకించెను. పిల్లవానినెత్తుకొని యోదార్చుచుండెను. "మాచి" తనకొరకు మిఠాయితెచ్చుటకై బజారునకుబోయినదని నమ్మకము కుదిరినతరువాత, కృష్ణమూర్తి సమాధానపడి యూరకుండెను.

చీకటిపడగానే యాశిశువు మరలఏడ్వసాగెను. "మాచి మిఠాయి తెచ్చిందా?" యని, రెండుమూడు దినములీ ప్రకారము గడచెను. "మాచి, మాచి" యని, యేడ్చి అల్లరిపెట్టుట తప్ప కృష్ణమూర్తికి వేరుపనిలేదు. నిముసమైనను వానిచంక బాయకుండిన యా నోరులేని కుక్క, గూటిలో నెల్లప్పుడు గూర్చుండి కుంయి, కుంయి మనక వాని నెప్పుడు సంతోష పెట్టుచుండినపిల్లి, వానికి కడు ప్రేమాస్పదమైన యాయెగురజాలని చిలుక,—ఇవి యన్నియు తమ ప్రాముఖ్యమును గోల్పోయెను. బాలుడు వీనిని కన్నెత్తియైన చూడడు. తనమీద అపేక్ష పడునదియు, ఎత్తుకొని త్రిప్పునదియు, జోకొట్టి నిద్రపుచ్చునదియు, పాటలుపాడి నవ్వించునదియు, — నగుసజీవయగు దాదిస్థానమును పైవస్తువులలో నొక్కటియు ఆక్రమింపనేరదయ్యెను, నిద్రలో బాలుడప్పుడప్పుడు కలువరించి "మాచీ,మాచీ" యని యరచుచు మేల్కొని యేడ్వ మొదలిడును. ఒక్కొకప్పుడు ద్వారమువద్దకిబోయి "మాచి"ని బిగ్గరగా బిలుచుచుండును. రమ్మని చేతులతో సంజ్ఞచేయుచుండును. దాది యుండు గదిలోనికిబోయి యచ్చట గంటలకొలది కూర్చుండును.'మాచి' యచ్చటికి వచ్చునని వానినమ్మకము! ఆ గది తలుపువేసి యుండినచో పోయి తట్టుచుండును!లోపల నది దాగియున్నదేమోయని వానియూహ. సింహద్వారము తెరచిన చప్పుడు వినరాగానే "మాచి" వచ్చినదేమో యనుకొని పరుగెత్తిచూచును, బంతివంటి యాశరీరము కృశింపసాగెను. గులాబిపూలవంటి చెక్కులు ఎండి పోయినట్లు కాన్పింప దొడగెను. తల్లిదండ్రులిరువురు వాని మందహాసమునకై పరితపించుచుండిరి. చక్కిలిగింత పెట్టి బలవంతముగ నవ్వించినచో, ఆ నవ్వు నిముసమున కంటె నిలిచెడిదికాదు. పాలమీద వానికి ప్రేమతగ్గెను. పటికబెల్లము మీద అంతకంటెను. పండ్లుగాని, బిస్కటులుగాని వానికి రుచిగా నుండలేదు. "మాచి" పెట్టుచుండినప్పుడు వానికీవస్తువులు మహారుచి గలవిగా దోచుచుండెను. ముద్దులు మూట గట్టుచున్న రెండుసంవత్సరములు దాటిన కృష్ణమూర్తి—నవనవలాడుచుండిన యాకోమలమగు మొక్క—పాడ జొచ్చెను. సందిట నెత్తికొనగనే ఆనందము గొల్పుచుండిన బాలుడు నేడు శల్యముల గూడుగా మారెను. రుక్మిణమ్మ బాలుని ఈస్థితిచూచి లోలోన చింతించుచు తనతెలివితక్కువతనమును నిందించుకొనుచుండెను. తనపనియేమో చూచుకొనుచు దివానఖానా (చావిడి)లో కూరుచుండు— ఏకాంతవాస స్వభావముగల—గోపాల రావు ఇప్పుడు అబ్బాయిని చంకనుండి దింపజాలక పోయెను. ప్రతి దినము వానిని విహారమునకై తీసుకొని పోవుచుండెను. దినము దినము క్రొత్త క్రొత్త హల్వాలు పెట్టించుచుండెను. కాని యా మొక్క వాడి పోవుచునేయుండెను. దాది యామొక్కకు సూర్యకాంతి. అట్టి నైసర్గిక సాధనమును గోలుపోయి మొక్క ఎట్లు నవనవలాడ గలదు ? మహాలక్ష్మి ఇంటినుండిపోయిన మూడవ నాడే మరియొక పనికత్తెనుంచిరి. కాని కృష్ణమూర్తి దానిని 'దయ్యము'ను జూచినట్లు చూచి, దగ్గరకు బోక వెనుదీసెను.

బాహ్యప్రపంచమున "మాచి" కనబడనందున, కృష్ణమూర్తి, మానసిక ప్రపంచమున—ఊహాలోకమున...తరచుగా దానిని జూచుచుండును అచ్చటది తిరుగుచుండెను. అదే పూర్వపు ఆకారము : అవే ముద్దుమాటలు అవే మనోహరములగు పాటలు ; అవే తియ్యని మిఠాయీలు : అవే రాత్రిందివములు ! ! ఒంటరిగా గూర్చుండి "మాచి"తో సంభాషించుచుండును. "మాచీ, చూడు నా కుక్క ఎట్లా అరుస్తుందో, "మాచీ, ఆవుపాలపిండుతా" మాచీ గుర్రము ఎక్కిపోతా మున్నగు వాక్యములు పల్కుచుండెను. తెల్లవారగానే చెంబుతీసికొని దాది యుండిన గదిలోనికిపోయి, "మాచీ, మంచినీళ్లు తాగు" అనును ! పాలగ్లాసు తీసుకొనిపోయి గదిలో పెట్టి "మాచీ, పాలుతాగు" అని పల్కును!! మంచముమీద దిండుపెట్టి, దానిపైన దుప్పటికప్పి, మాచి నిద్రపోతున్నది." అని వచించును!! రుక్మిణమ్మ అన్నము తినుచుండి నపుడు పళ్ళెములు తీసుకొనిపోయి దాదిగదిలో పెట్టి "మాచి అన్నము తింటుంది" అనిచెప్పును!! "మాచీ" ఇక కనపడదని బాలునకు దోచెను. దాదస్మరణమాత్రము వానికి సంతోషదాయకమైయుండెను. శిశువు నందప్పుడు బాల్యమునకు సహజమగు గండాగొండితనము, హటము పోయి, ఆస్థానమును సాధుత్వము, నిరాశయనునవి యాక్రమించెను. రెండువారము లిట్టుగడచెను. అది వర్షకాలము. ఊరిలో జ్వరములు, దగ్గుపడిసెములు ఉండెను. కృష్ణమూర్తి ఋతువు మార్పును సహింప జాలడయ్యె. రుక్మిణమ్మ శిశువువిషయమై ఎంతో జాగ్రత్త పుచ్చుకొను చునే, యుండెను. ఫ్లానలుకుడతా తొడుగుచుండెను. సీటిదగ్గరకు పోనీ యదు. ఉత్తకాళ్లతో నొక్కయడుగైన పెట్టనీయదు ! అయిననేమి ? జలుబుచేయనే చేసెను. జ్వరము, దగ్గు పడిసెము రానేవచ్చెను. ! !

ప్రొద్దుటిపూట. శిశువు మంచముపైన కన్నులుమూసి పరుండెను. రుక్మిణమ్మ మంచముమీద గూర్చుండి బాలునియొడలి కేధోతైలము రాయుచుండెను. గోపాలరావు చింతాప్రదర్శకములగు చూడ్కుల కుమారునిపై బరపుచు ప్రక్కన చదికిలబడియుండెను. అతడీనడుమ భార్యతో నీ విషయమున మాట్లాడుట చాలవరకు మానుకొనెను. రుక్మిణమ్మపైన నతనికి అసహ్యము కలుగజొచ్చెను. కొడుకునకు

వచ్చినవ్యాధికి మూలకారణము తల్లియని యాతడు నిశ్చయించి, నేరము నామెపైననే మోపెను. గోపాలరావుదృష్టి కామెఉత్తవిరసురాలు; అల్పబుద్ధిగలది; కోమలభావశూన్య!"

రుక్మి : (భర్తతో) "ఇవాళ్ల పెద్దడాక్టరుగారిని తీసికొని వస్తారా? ఆయన వైద్యమువలన మనము గట్టెక్కగలమేమో?"

గోపా : (ఆకాశము నావరించియున్న నల్లని మేఘముల వైపుజూచి) "పెద్ద డాక్టరుకాదుగదా ధన్వంతరివచ్చినను ఉపయోగము లేదు."

రుక్మి : "అట్లైతే, ఇక ప్రపంచములో ఈవ్యాధికి మందేలేదా?"

గోపా : "ఒకటేమందు; కాని అది దొరకునదికాదు."

రుక్మి : "మీకెప్పుడు అశుభమతప్ప మరొకమాటయే లేదు. మహాలక్ష్మి సంజీవిదెచ్చునా? అమృతభాండము తీసికొని వచ్చునా?"

గోపా : "అది నీమనస్సునకు విషభాండమే యగుగాక, అబ్బాయి విషయమున నది అమృతభాండమే!"

రుక్మి : "ఈశ్వరుని చిత్తమునందు— ఈశ్వర వ్యవహారము నందు మహాలక్ష్మికి అంత ప్రవేశమున్నదేమో!— నేనెరుగను."

గోపా : "ఎరుగని పక్షమున— ఇంకను తెలిసికొనని పక్షమున— ముందు ఏడ్చెదవు! కడుపున చిచ్చు పెట్టుకొందువు!!"

రుక్మి : "ఛీ ఊరుకోండి, ఇటువంటి అశుభము నోట రానీయవలదు. 'శుభము పలుకరా— అంటే ఏమో' యన్నట్లు— అవతలికి పోండి."

గోపా : నేనుపోతాను. కాని ఈవిషయమున నింద నీపైననే యుండునని నమ్ము. కృష్ణుడు ఆరోగ్యమును మరల కాంచవలయునని నీకిష్టమున్న పక్షమున— మహాలక్ష్మి వద్దకుపో. దానిని బ్రతిమాలుకో; వేడుకో నీకొడుకు ప్రాణములు దానిచేతిలోనే యున్నవి!

రుక్మిణమ్మనోరు ప్రత్యుత్తర మియ్యలేదు. కన్నులుమాత్రము బాష్పములతో జవాబుచెప్పెను.

గోపా – "ఏమనెదవు. పోయిదానిని వెదకివత్తునా?"

రుక్మి : "మీరెందుకు పోతారు? నేనే పోయెదను."

గోపా : "అంతమాత్రము దయ చేయకు; నాకు నీమీద నమ్మకములేదు. నీనోటినుండి ఏదైనా రాగూడనిమాట వచ్చినయెడల అది వచ్చుటకు సిద్ధముగా నుండినను రాకపోవునేమో?"

రుక్మిణమ్మ ఈయెత్తిపొడుపునకు ప్రత్యుత్తరముగా నొక తీవ్రదృష్టి భర్తపై ప్రసరింపజేసి యనెను "నిజమే. అబ్బాయి జబ్బు పడినందునకు నాకేమైన విచారమున్నది కనుకనా?— సిగ్గుచేత మీతో ననలేదు కాని నాకెన్నియోసారులు తోచినది. దానియిల్లు జాడ నాకు తెలిసియుండిన యెడల నేనెన్నియో దినముల క్రిందనే దాని బతిమాలి తీసికొని వచ్చియుందును. నామీద కోపముండినను, దానికి అబ్బాయి అంటే ప్రాణము. ఈ దినము పోయివచ్చెదను. దానిచేతులుకాదు... కాళ్లుపట్టుకొనెదను. పుత్రభిక్షము పెట్టమని యేడ్చెదను! ఏమిచేసి యైనను దాని బిల్చుకొని వచ్చెదన!

ఈమాటలు పలుకునపుడు రుక్మిణమ్మ కంఠము గద్గదిక మయ్యెను. ఎంతో కష్టమున శబ్దములు పెదవులనుండి వెడలెను. గోపాలరావు భార్యదీనావస్థను సహానుభూతితో జూచి యనెను "నీవు పోవుట బాగుండదు. నేనే పోయి వచ్చెదను."

## 5

మహాలక్ష్మి, పాపము, ఈ ప్రపంచమున ఏకాకి. ఒకప్పుడు దానికుటుంబము గులాబిచెట్టువలె నవనవలాడు చుండెను. కాని కాల క్రమమున శిశిరఋతువు ఆకుల రాల్చివైచెను. ప్రతికూల వాతాహతి చెట్టును నాశనము చేసెను. ఇప్పుడా నేత్రోత్సవకరమగు చెట్టునకు స్మారక చిహ్నము ఈ మిగిలినకొమ్మ– ఈ మహాలక్ష్మి– మాత్రమే.

కృష్ణమూర్తి నాడించు ఉద్యోగము దొరికిననాటి నుండియు ఎండిపోయిన తుదికొమ్మకు ప్రాణమువచ్చెను. ఇది చిన్న చిన్న క్రొత్త యాకుల దొడగెను. నిస్సారమైన జీవితమున నొకింత క్రొత్త వికాసము కలిగెను! కటికచీకటియందు అరణ్యమున దారితప్పి తిరుగు చుండిన బాటసారికి సన్నని దీపకాంతి పొడచూపెను! రాలురప్పలలో బడి కొట్టుకొనుచుండిన దాని ప్రాణము లిప్పుడు పుష్పభరితమగు నారామమున సంచరించుచుండెను!! దానిజీవితము ఇప్పుడు నిరర్థకము కాక సార్థకముగా బొడకట్టి యుండెను!!!

కృష్ణుని అమాయికపు మాటలు, మనోహరములగు వాని చేష్టలు, మహాలక్ష్మి హృదయమును వశముచేసికొనెను. కాని మనస్సు లోని ప్రేమనది దాచియుంచుకొనును. తల్లికి తెలిసిన ఆమె యసూయ పడునేమోయని మహాలక్ష్మిభయము. చాటుగా మిఠాయితెచ్చి బాలునికి బెట్టి యానందించును. కృష్ణునకు దృష్టితగులకుండ తాయతులను రక్షరేకులను తెచ్చికట్టును. ఇతరులు చూడగా వానికే తినువస్తువును పెట్టదు. 'అబ్బాయి ఏమియు తిననే తిన' దని యందరకు చాటును. వేయేల? మహాలక్ష్మిది స్వచ్ఛమైన మాతృప్రేమ! దానిలో ఆత్మానందముతప్ప స్వార్థము లేశమైననులేదు!!

గోపాలరావుగారి ఇల్లువదలిననాడు నాటకశాలయందొక్కమారు అన్నిదీపము లారిపోయినప్పుడుండుస్థితి మహాలక్ష్మి మనస్సున నుద్భ

వించెను. కన్నుల యెదుట ఆదియే ప్రదర్శనము; ఆదియే ఆట! చెవులలో అవే పాటలు ! !

ఆనాడు దానికేమియు తోచలేదు. రాత్రి ఎట్లోగడిపెను. ఉదయమున ఇల్లూడ్చుకొనుచుండగా, మిఠాయీ అమ్మువానికేక విన వచ్చెను. వెంటనే చీపురుకట్ట పడవైచి హల్వాకొనబోయెను. "నేడు హల్వా ఎవరికి కొనిపెట్టవలెను? నాయొడిలోగూర్చుండి ముద్దులుగులుకు ముచ్చటలు నేడెవ్వరాడుదురు.? హల్వా తినునప్పుడు కృష్ణుని కన్నులందును, పెదవులందును, శరీరముయొక్క ప్రతియవయవమునందును ప్రకటమగుచుండు ఆనందరసము ఈనాడు నాకెక్కడినుండిలభించును" అనుభావములు తలంపునకురాగా మహాలక్ష్మి హృదయము వ్రయ్యలు కాజొచ్చెను ! అట్టిస్థితిలో " అబ్బాయిని చూచివత్తాము" అనుకొని యది చిత్తవిభ్రాంతితో నిల్లువెడలెను. సగముదూరముపోయి మరలి వచ్చెను.

కృష్ణుడు ఒక నిముసమైనను మహాలక్ష్మి హృదయమును వదలి యుండలేదు. నిద్రలో దానికి బాలుడేడ్చుచుండినట్లు వినవచ్చి యదిరి పడి లేచును. ఒక్కొకమారు కూర్చుండినప్పుడు కృష్ణుడు క్రిర్ర గుర్రమెక్కిపోవుచున్నట్లు తోచి పక్కుననవ్వును. ఇరుగుపొరుగు వారిండ్లకుపోయి వాని చిలిపిచేష్టలు వర్ణించుచుండును. ఆ బాలునిపైగల ప్రేమ మహాలక్ష్మి హృదయస్థలము నంతను ఆక్రమించియుండెను. రుక్మిణమ్మ చూచిన నిరాదరణను గురించిన వ్యాకులమునకు అచ్చటనిక స్థలమేది?

మహాలక్ష్మి ప్రతిదినము, "కృష్ణుని ఈరోజు చూచెదను" "ఈరోజు చూచివచ్చెదను" అని సంకల్పించుకొనుచుండెను. ప్రతి దినము బజారునకుబోయి ఏవో ఆటవస్తువులనో, మిఠాయియో కొని తెచ్చుచుండెను. కాని సగముదూరముపోయి మరలివచ్చుచుండును. కొన్నివేళల నాలుగు అడుగులుపోయి తిరుగును. " ఏమిమొగము పెట్టుకొనిపోదును?" అని యొకమా రనుకొనును. కృష్ణుడు అసలు నన్ను గుర్తుపట్టునా? పట్టకపోతే ఏమిచేయుదును? పిల్లవాండ్ర అపేక్ష నమ్మకమేమి? క్రొత్తదాదికలవాడై యుండవచ్చును. ఇట్టిభావములు గొలుసులై దాని కాళ్ళుగట్టి వైచుచుండెను!

ఈప్రకారము మూడువారములు గడచెను. దూరప్రయాణము చేయుచున్న బాటసారి హృదయమువలె మహాలక్ష్మి మనసెప్పుడును నిరుత్సాహపడియుండును. ఇంటిలోని వస్తువులెక్కడివక్కడనే పడి యుండును! అన్నముమీదగాని బట్టమీదగాని ఆసక్తియుండదు ! ఆ దినములలో ఇరుగుపొరుగువారు కొందరు కాశీకిపోవ యత్నమునం దుండిరి. పంజరమునుండి బయటబడిన పక్షి ఏదైన నొకమూల నాశ్రయము వెదకుకొనునట్లు, మహాలక్ష్మి మానసము విశ్రాంతికై అటు నిటు పరువులు పెట్టుచుండెను. అట్టిసమయములో కాశీయాత్రమాట దానిమనస్సునకు వచ్చెను. ప్రయాణయత్నములు చేసికొనెను.

హైదరాబాదు రైలుస్టేషనునందు యాత్రికులనేకులు గుంపులు గుంపులుగా గూడియుండిరి. కొందరు రైలుడబ్బాలలో గూర్చుండి యుండిరి. కొందరు తమవారి సెలవు లందుకొనుచుండిరి. ఎటు చూచినను సందడిగా నుండెను. పరమార్థము చూరగొనుటకై యాత్రకు బోవుచున్నవారిని ఈ సమయమున గూడ ప్రపంచము పట్టి లాగుచునే యుండెను ! "వరికోతలైన తరువాత చెరువులోపల కర్బూజాపంట పండించవలసినది సుమా" యని కుమారుల హెచ్చరించు తండ్రులును, " రైతులవద్దనుండి పైకము వసూలు కానిచో దావాచేయక మరచెదవు సుమా" యని తమ్ములకు బోధించు అన్నలును, " అప్పు లిచ్చి వారివద్ద నూటికి నెలకు రెండురూపాయలకంటె తక్కువ వడ్డీకి వప్పుకోవలద " ని పిన్నలకు చెప్పు పెద్దలును, సరకులు సమయమునకు అందనియెడల నీవు స్వయముగా పోయి రావలసినద"ని ఖండితముగా గుమస్తాలకు చెప్పు యజమానులును ఎందరో యుండిరి ! కొందరు మాత్రము ధ్యాననిమగ్నులును, కేల జపమాలలను త్రిప్పుచుండిన వారును కానవచ్చుచుండిరి.

మనమహాలక్ష్మి యొక డబ్బాలో గూరుచుండి యనుకొను చుండెను : "ఈ పెద్దమనుష్యులను ఈ సమయమున గూడ ప్రపంచ వ్యామోహము వదలి పెట్టక పోయెనే. ఇప్పుడు కృష్ణుడు ఇక్కడ నుండెనా, ఎంత ఏడ్చునో ఎంతగోలపెట్టునో! నా యొడిలోనుండి అసలు దిగియే యుండడు. కాశీనుండి వచ్చిన తరువాత పోయి చూచి వస్తాను : రైలు ఇంకా ఎందుకు సాగదు? ఉడక పోసిపోసి ప్రాణము పోవునట్లున్నదే !"

అంతలో గోపాలరావు బైసికలు చేతబట్టుకొని ప్లాటుఫారము పైన ఏవరినో వెదకుచుండినట్టు కాన్పించెను. అతని మొఖము వెలవెల పోవుచుండెను : ఆయనను చూడగానే మహాలక్ష్మి బండిలో నుండి తల యీవలకు బెట్టెను. గోపాలరావు అది కనుపడగానే ముందునకు సాగి ప్రశ్నించెను : "ఏమి మహాలక్ష్మి నీవు కూడ యాత్ర పోవుచున్నావా?"

మహా : — "అవునండి, అయ్యా, ఇక్కడ చేయదగిన పని యేమున్నది జీవనము లేదు. ఈ పాడు శరీరము ఎన్నడు పడి పోవునో. దేవునకు ముఖము చూపు అవకాశము ఉండవలెను కదా ! అయ్యా, అబ్బాయిగారు బాగున్నారా?"

గోపా: — "నీవు యాత్రకు పోవుచునే యున్నావు. అబ్బాయి సంగతి విచారించి మాత్రము ఏమి చేయగలవు? — వాని క్షేమమునకై కాశీ విశ్వనాథుని ప్రార్థింపుచుండుము."

మహాలక్ష్మి గుండెలు కొట్టుకొనసాగెను. "అయ్యో, అబ్బాయి గారి శరీరము బాగులేదా?" అని యడిగెను.

గోపా : "నీవు మా యిల్లు వదలిన నాటినుండి అబ్బాయి ఆరోగ్యము చెడినది. రెండువారముల వరకు "మాచీ, మాచీ" యని రాత్రి దినములు నిన్ను స్మరించుచు, మారాము పెట్టినాడు. ఇప్పుడు వారము దినములైనది. జ్వరము దగ్గు పడిసెము వదలుటయు లేదు. మందు మాకుల వలన ఉపయోగము కనపడ లేదు, నిన్ను చూస్తే ఆరోగ్యము కుదురునేమో యనుకొని, ప్రతిమాలి తీసికొని పోదామని మీ యింటికి వెళ్ళి విచారించితిని. నీవు కాశీ యాత్రకు బోవుచున్న వార్త తెలిసి వచ్చినాను. నిన్ను రమ్మనమను బుద్ధి యున్నది. కాని నీ విషయములో మేము చూపిన ఆదరణ ఏ మంత బాగుగా నుండినది? నిన్ను పిలుచుటకు ధైర్యము తోచుట లేదు. అంతేకాక, కాశీపోని వాండ్రను పంపుట పుణ్యముగాని పోవుదానిని ఆపుట మెచ్చ దగిన పని కాదుకదా. ఆయువు మిగిలియున్న యెడల బ్రతుక గలడు.!"

మహాలక్ష్మి కన్నులు చీకట్లు గ్రమ్మెను. ఎదుటనున్న వస్తువులు నీటిమీద తేలియాడుచున్నట్లుండెను. విచిత్రమగు భయభ్రాంతి తోప సాగెను. "ఈశ్వరా! కాశీ విశ్వనాథా! నా కృష్ణుని ప్రాణము కాపాడుము తుచ్ఛురాలను నగు నా ప్రాణములు నీ కర్పించుచున్నాను. !!" అను ప్రార్థనావచనములు అప్రయత్నముగా మహాలక్ష్మి నోట వెడలెను. కన్నుల బాష్పములు గారసాగెను. కంఠము చెడెను. "నేనెంత కఠినురాలను. పాపము కృష్ణుడు ఏడ్చి ఏడ్చి వ్యాధిగ్రస్తు డయ్యెనేమో. నేను చూచియైన రాకపోయితిని. రుక్మిణమ్మ దుస్స్వభావము కలదియే యనుకొందము. నోటివట్టముదే యనుకొందము. అయినను అబ్బాయి నా కేమి యపకారము చేసెను. తల్లి యపరాధమునకు నేను కొడుకును—అమాయకుడగు శిశువును— శిక్షించితిని! రామచంద్రప్రభో! నా తప్పు మన్నింపుము!! అపరాధిని. మహాపాపిని!!"యను భావములు మెదడునందు పరువిడ సాగెను. "అక్కటా! అబ్బాయికి నామీద ఇంత యపేక్షయున్న సంగతి నే నెరుగకపోయితిని! తెలిసి యుండిన పక్షమున, రుక్మిణమ్మ తిట్టినను— మెడబట్టి యింటినుండి గెంటివేసినను అక్కడనే పడియుందును. పాపము, ఎట్టి స్థితియందున్నాడో కదా" యని తలపోసి భయకంపితమగు ధ్వనితో నడిగెను:

"అయ్యో, పాలు త్రాగుచున్నాడు కాదు ?"

గోపా.—"పాలమాట యడుగుచున్నావా ? రెండు దినములనుండి కన్ను లేతెరవడు."

మహా:—అయ్యో, నాయనా ! ఓరీ కూలీ, ఈ సామాను కొంచెము దింపు, మాయయ్యో, మంచివాడవు ఇక నాకు కాశీ గయలు తోచవు. త్వరగా దింపు. (గోపాలరావుతో) అయ్యగారూ, జట్కా-బండి ఉన్నదేమో చూచి కుదిరించండి. నాకాళ్ళు వడకుచున్నవి !"

మహాలక్ష్మి జట్కా-బండిలో గూర్చుండెను దారిలో బండ్లు అడ్డముగా నిలిచియుండెను. జట్కాగుర్రము మందముగా నడువ సాగెను. ప్రయాణికులు కొందరు గుంపులు గుంపులుగా మార్గమున మూగియుండిరి.. మహలక్ష్మి కీయాటంకములు కోపము, విసుకు తెప్పించుచుండెను. గుర్రమునకు రెక్కలు వచ్చినచో సంతసించి యుండెడిదేమో. గోపాలరావుగారి ఇంటి సందు సమీపించుచు: "దేవుడా క్షేమముగా నుండుము" అను మాటలు మాటిమాటికినోట వెడలుచుండెను !

బండి సందులోనికి ప్రవేశించగానే ఏదో రోదన ధ్వని విన వచ్చెను. గుండెలు పగులసాగెను. తల తిరుగదొడగెను. సముద్రమున బడి మునిగిపోవుచున్నట్టు దోచెను. జట్కాలోనుండి క్రిందికి దుముక దలచెను. అంతలో ఆర్ద్వవి అత్తవారింటికి బోవుచున్న యొక క్రొత్త కోడలిదని తెలిసి ప్రాణములు కుదుటబడెను!

ఇల్లు ప్రవేశించిరి. మహాలక్ష్మి భయముతో ద్వారమువైపు చూచెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. వంటవాడు కూర్చుండి యుండెను. మహాలక్ష్మి ధైర్యముతో లోనికిబోయెను. క్రొత్తదాది ఏదో మందు సిద్ధము చేయుచుండెను. రుక్మిణమ్మ తనగదిలో పిల్లవాని నొడిలో కూర్చుండబెట్టుకొని, తలుపువైపు దృష్టి నిగుడించి—దుఃఖము: నిరాశ ఈరెండును కలిసి యేర్పడుచూపుతో —ఉండెను.

మహాలక్ష్మి రుక్మిణమ్మ యొడినుండి కృష్ణు నెత్తుకొని, నీరు నిండియున్న కన్నులతో ననెను: "నాయనా, కృష్ణమూర్తీ, కన్నులు తెరువు."

బాలుడు కన్నులు తెరిచి, రెండునిముసములవరకు నిశ్శబ్దముగా తన్నెత్తుకున్న మనిషి ముఖము తేరిపార చూచుచుండెను. తరువాత వెంటనేదాని మెడను కౌగిలించుకొని యనెను: "మాచి వచ్చింది! మాచి వచ్చింది!!

కృష్ణుని పచ్చబారినమోమున కాంతి హెచ్చెను. ఆరిపోవనున్న దీపమునకు తైలము దొరికెను. ఇక కావలసిన దేమి ?

( ప్రేమచందు వ్రాత ననుసరించి )

[ ఈ కథ క్రోధననామ సం॥ ఆషాఢమాసం భారతిలో (1925) మొదటిసారి పడింది ! ]

# కలగూరగంప

## ఆరుద్ర త్వమేవాహం-ప్రతీకవైచిత్రి

గత శతాబ్దం చివరి భాగంలో ఒకవైపు యదార్థవాదం, మరో వైపు ప్రతీకవాదం ప్రారంభమయింది. యదార్థవాదం మానవుని జీవితాన్ని బహిర్ముఖంగా, యథాతథంగా చిత్రించగా; అంతరంగిక ఆవేశాలను, వైయక్తిక లక్షణాలను ప్రతీకవాదం చిత్రించింది. కాని ప్రతీకాత్మక రచనలో మానసికంగా మానవుని చేతన, భావవిశ్వాసం, మనఃప్రవృత్తి వికారాలైన తత్త్వాలు, వీని సమాహారాన్ని భావించి, ఒక నిష్కర్షకుచేరి దానిననుసరించి ఒక ప్రతీకను కల్పించడం జరుగుతుంది. ఆరూపాలు, ఆ శబ్దాలచేత అవ్యక్తాలైన భావాలు ఈ ప్రతీకల ద్వారా సువ్యక్తాలవుతాయి. అంటే మనఃప్రవృత్తిని ధ్వంసం చేసేది ప్రతీక అని అర్థం.

ప్రతిదానిని వాచ్యంగా ఉపాధ్యాయుడు బోధపరచినట్లుగా చెప్పడం మనస్తత్వ పద్ధతికి విరుద్ధం. తన మనసులో చెలరేగే భావ సంచలనాన్ని పాఠకునికి స్ఫురించేటట్లు చేయాలి. అతని ఆలోచనల గ్రహింపుకు స్వాతంత్ర్యం ఇవ్వాలి. ఒక వస్తువును చూసినప్పుడు తనలో ఏవిధంగా ఆలోచనలు చెలరేగాయో అదే విధంగా పాఠకుని మనసులోనూ ఆలోచనలు చెలరేగాలి. అది స్వభావ సిద్ధమైనపని. ఇదే ప్రతీకవాదానికి ప్రాతిపదిక అయింది. ఈ ప్రతీక కవి ఏర్పరచుకొన్న పరిధిని అస్పష్టం చేసి సంకేతాలద్వారా తాను చెప్పదలచుకొన్న విషయాలను వివరిస్తుంది. మొదట ప్రతీకలు అర్థమయితేగాని కవి ఉద్దేశించిన భావం బోధపడదు. కొన్నిచోట్ల వేదాంతం బయలుదేరి మనసు తాత్త్వికమార్గంవైపు మళ్లిస్తుంది. కవి ప్రకృతిని పదేపదే చెప్పకనే ఒక ప్రతీకగా గ్రహించి చెప్పడం పరిపాటి అయింది. కవితలో ఆవృత్తమయ్యే ప్రతీకలు విషయాన్ని దృశ్యాత్మకం చేస్తాయి. సంకేతం కవిత్వానికి ప్రాణమయింది. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తేగాని ఆ కవి ప్రయోగించిన సంకేతం పరిధి అవగతం కాదు. ఉదాII నకు- చీకటి అజ్ఞానానికి, వెలుతురు జ్ఞానానికి, వసంతం జన్మకు, శిశిరం మృత్యువుకు ప్రతీకలుగా నిలిచాయి. ఎడారినిచూస్తే ఇంపులేని ఒంటరి బ్రతుకు, ఎండు కొమ్మను చూస్తే మోడు బ్రతుకు స్ఫురణకు రావడం ఈ ప్రతీక వాదానికి ఆలంబనం అయింది.

పై విధంగా ఆలోచిస్తే ఆధునిక కవిత్వం అంతటా ఇట్టి ప్రతీకలు చాలా ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. దాదాపు నూటికి డెబ్బది పాళ్లు సంప్రదాయ మార్గాన్ని అనుసరించిన అభ్యుదయ కవిత్వంలోనూ ప్రతీకతత్త్వం అత్యధికంగా కన్పిస్తుంది. కానీ ఆధునిక కవులు తీసుకొన్న ప్రతీకలు సామాజిక చైతన్యానికి దోహదం చేసేవి. సామాన్య మానవుని జీవితమే వారికి కవితావస్తువులైనాయి. తాము చెప్పదలచు కొన్న వస్తుతత్త్వాన్ని తీవ్రతరం చేయడానికి దానికి సంబంధించిన ప్రతీకలనే తీసుకొనేవారు. దీనివల్ల కవిత్వమంతా ప్రతీకలతో నిండిపోయింది. ఈ విధమైన ప్రతీక వాద కవిత్వాన్ని వెలయించిన అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, బైరాగి, రెంటాల, సోమసుందర్, నారాయణబాబు మొదలైనవారు అగ్రగణ్యులు.

ఆధునిక యుగంలో ప్రతీక వాద కవిత్వాన్ని రచించిన వారిలో ఆరుద్రకు ఒక ప్రత్యేక స్థానంవుంది. సామాజిక పరిస్థితుల కనుగుణంగా ప్రతీకలను తీసుకొని వాటి ద్వారా వస్తుతత్త్వాన్ని తెలియజేయడంలో అతనికతడే సాటి. అందుకే ఆరుద్ర ధోరణిని అపూర్వమైన టెక్నిక్‌గా భావించడం జరిగింది. ఇతని రచనల్లో 'త్వమేవాహం' అత్యంత ప్రసిద్ధమయింది. సామాజిక చైతన్యానికి, సమసమాజ నిర్మాణానికి అద్దంపట్టిన ప్రతీకాత్మ రచనతో కూడినట్టిది త్వమేవాహం. ఇందులోని ప్రతి ఖండిక ఆరుద్రలోని ప్రతీకవైచిత్రిని తెలియజేస్తూవుంది. సమాజంలోని అట్టడుగు ప్రజల దుస్థితిని, ధనికవర్గాల ఔన్నత్యాన్ని, మధ్యతరగతి అయోమయ పరిస్థితిని తెలపడానికి ఈ కవి తీసుకొన్న ప్రతీకలు నిత్యనూతనమైనవి. ఇంతకు ముందెన్నడూ ఏ కవి ప్రయోగించనిరీతిలోను. ఇతనితర్వాత ఎవ్వరూ చెప్పలేనంత విశిష్టధోరణిలోను ప్రతీకలను తీసుకొని కవిత్వం వెలయించినాడు. అభ్యుదయకవులు చాలమటుకు సంప్రదాయ ప్రతీకలనే తీసుకొని వాటిని ఇప్పటి పరిస్థితుల కనుగుణంగా ఆధునికమైనరీతిలో చెప్పడం పరిపాటి. కాని ఆరుద్ర పద్ధతి అది కాదు. అతడు తీసుకొన్న ప్రతీకలు ఇతరుల కన్నా భిన్నమైనవి. వాటిని ప్రయోగించిన తీరేవేరు. ఆ ప్రతీకలు ఒక్కొక్కప్పుడు పాఠకుని ఇబ్బంది పెట్టవచ్చు, కానీ అవి అవగతమైన తర్వాత అతడు పొందే అనుభూతి చెప్పనలవికానిది. ఇదియే ఆరుద్ర ప్రతీకాత్మక రచనలోని ప్రత్యేకత.

"త్వమేవాహం" కావ్యాన్ని మూడు భాగాలుగా విభజించి పరిశీలించవచ్చును. ఒకటి - పర్వతదశ. రెండవది - ఉపనదులు. మూడవది - ప్రవాహదశ. దీనినిబట్టి కావ్యమంతా ఏదో ప్రవాహాన్ని సూచిస్తున్నట్లు స్పష్టమవుతూవుంది. కావ్యంలోని శీర్షికలను గడియారం, దానికి సంబంధించిన వాటినే సూచిస్తున్నాయి. పెద్ద ముల్లు - చిన్న ముల్లు - సెకండ్లముల్లు ఉండే గడియారం ఆధునిక మయింది. నీటి-ఇసుక గడియారం ప్రాచీనమయింది. ఇక్కడ స్వరూపంలోనే భేదం తెలుస్తూవుంది. మొత్తానికి వీటిని కాలాన్ని కొలిచే సాధనాలుగా పరిగ

జేందాలి. కాగా ఈ శీర్షికలవలన కావ్యం అంతటా కాలప్రవాహం ప్రతి పాద్యవస్తువుగా స్వీకరించబడింది. తెలుగులో ప్రతీకవాద కవిత్వానికి ఒక ప్రత్యేకతనుతెచ్చిపెట్టి శరీర, వృక్ష, గణిత నౌకా మొదలైన శాస్త్రాలనుండి పారిభాషిక పదాలను గ్రహించి సరిక్రొత్త ప్రతీకలను సృష్టించినాడు.

"ఆరుద్ర త్వమేవాహం" కావ్యాన్ని ప్రవాహానికి పర్యాయంగా ఊహించినారు. ఘనీభవించిన పర్వతదశ ప్రారంభమై ఈ కావ్యం మధ్యమధ్య ఉపనదులను చీల్చుకొని ప్రవాహదశతో అంతమవుతుంది. ఈ కావ్యంలో తీసుకొన్న ప్రతి సంకేతం ఒకమారు సామాజిక వ్యవస్థను, మరోమారు వివిధ వర్గాలవారి మానసిక అవస్థను తెలియజేస్తుంది. చివరికి కవి సమాజంలోని అస్తవ్యస్థ పరిస్థితికి పరిష్కార మార్గం చూపడంకోసం లోహాలను ప్రతీకలుగా గ్రైకొంటాడు. లోహాల్లో ఇనుము ధనవంతులకు ప్రతీక. రాగి మధ్యతరగతికి, తుత్తునాగం కార్మిక వర్గానికి ప్రతీకలు. రాగి, తుత్తునాగాల ద్వారా జనించిన విద్యుత్తు (విప్లవం) వలన ఇనుము అయస్కాంతంగా మారుతుందని, అదే ప్రగతి శీలమవుతుందని కవి భావన.

'త్వమేవాహం' కావ్యంలో గడియారం ప్రధానంగా పేర్కొనబడింది. ఇది ప్రధాన ప్రతీకగా భావించబడి దానిద్వారా సమాజవ్యవస్థ స్థితిగతులను వివిధరూపాల్లో తెలియజేయబడింది. కాలానికి సంకేతం గడియారం. ఆ గడియారాన్నే సమాజానికి ప్రతీకగా తీసుకొంటాడు ఆరుద్ర. ఇక్కడ గడియారం ఒక వ్యవస్థకు ప్రతీకగా గ్రహించబడింది. అట్లే మరోచోట వికసిత పుష్పం సమాజాని కంతటికీ ప్రతీకగా గ్రహించబడింది. ఆటు తర్వాత ఆరుద్ర తీసుకొన్న గడియారాలు మూడు రకాలైనవి. ఇందులో ఇసుక, నీటిగడియారాలు గతకాల మనస్తత్వానికి ప్రతీకలు. మరలా దానిలో ఇసుకగడియారం యురోపియన్ల ప్రభావంగల భారతీయుల మనస్తత్వానికి, నీటిగడియారం చాందసులైన భారతీయుల మనస్తత్వానికి ప్రతీకలుగా చెప్పబడినాయి.

ఇక్కడొక ముఖ్యమైన విషయం గమనించవలసి వుంది. ఆరుద్ర అందరివలే ఒక్కొక వస్తువిశేషాన్ని చెప్పడానికి ఒక్కొక ప్రతీకను ప్రత్యేకంగా తీసుకోలేదు. సమాజంలోని అన్ని విషయాలను తెలపడానికి ఒక ప్రధానమైన ప్రతీకను తీసుకొని అందుండి మరల కొన్ని ప్రతీకలను సృష్టించి చెప్పదలచుకొన్న విషయాన్ని వివిధ ప్రతీకల ద్వారా దృశ్యాత్మకం చేయడం గొప్ప విశేషం.

గడియారాన్ని మన సమాజాని కంతటికి ప్రతీకగా తీసుకొన్నాడు. ఇక్కడ గడియారాన్ని ఒక ప్రధానమైన ప్రతీకగా మనం భావించాలి. అటుతర్వాత సమాజంలోని శ్రామిక, మధ్యతరగతి, పెట్టుబడిదారి వర్గం అని వివిధ వర్గాలున్నాయి. వీటి పరిస్థితిని తెలియజేయడానికి గడియారం కాక ఇతరత్రా ఏమీ తీసుకోలేదు. ప్రధాన ప్రతీక అయిన గడియారంలోని భాగాలనే ( సెకండ్లు- నిముషాలు- గంటలు) ప్రతీకగా తీసుకొని అట్టడుగు, మధ్యతరగతి, ధనిక వర్గాలవారి పరిస్థితులను తెలియజేసినాడు. ప్రతీకాత్మక రచనలో ఇదో కొత్తరకమైన పద్ధతిగా భావించవచ్చును.

గడియారంలోని గంటలు- నిముషాలు- సెకండ్లు కాలగమనాన్ని తెలియజేస్తాయి. దీనిని సూచించే పరికరాలు చిన్నముల్లు- పెద్దముల్లు- సెకండ్లముల్లు. వీటిని ప్రతీకలుగా తీసుకొని సమాజ వ్యవస్థను వ్యక్తీకరించడం జరిగింది. 'గంటలు' (పుట . 29) పెట్టుబడి దారి వ్యవస్థకు ప్రతీకగా గ్రైకొనబడింది. గంటలను తెలియజేసే 'చిన్నముల్లు' ( పుట-17) పెట్టుబడిదారి మనస్తత్వానికి ప్రతీక. 'నిముషాలు' (పుట.31) మధ్యతరగతి వర్గానికి ప్రతీకగా తీసుకోబడింది, దానినితెలియజేసే 'పెద్దముల్లు' (పుట . 15) మధ్యతరగతి మనస్తత్వానికి ప్రతీక. 'సెకండ్లు' (పుట . 25) కష్టించి, చెమటోడ్చి పనిచేసే శ్రామిక వర్గానికి ప్రతీకగా గ్రహించబడింది. సెకండ్లను తెలిపే 'సెకండ్లముల్లు' ( పుట . 16) వానలో తడిసి, ఎండకు ఎండి శ్రమకోర్చి కష్టించే శ్రామిక వర్గ మనస్తత్వానికి ప్రతీక.

ఆరుద్ర గడియారాన్ని సంకేతంగా తీసుకొని సామాజిక స్థితిగతులను వివిధ రకాలుగా. బహిర్గతం చేయడమే గాక సామ్యవాదంలోని నగ్న సత్యాన్ని చాటి చెప్పడానికి వృక్ష శాస్త్రంలోని 'పరపరాగ సంపర్కం' అనే అంశాన్ని ప్రతీకగా తీసుకొని పెట్టుబడిదారి వ్యవస్థను బాగా అర్థమయ్యే రీతిలో చెప్పినాడు.

మన మానవ సమాజమొక<br>
పూరా విప్పారిన పుష్పం.<br>
అట్టడుగున పరిశ్రమించే జనావళి<br>
మనకందరికి రక్షక పత్రావళి.<br>
కడుపుమంట సైరింపనిశాఖ<br>
కీటకాల నాకర్షించే పతాక<br>
అవకాశాంవల్ల తలెత్తిన వర్గం<br>
పరాగప్రాప్తి నోచుకునే కీలాగ్రం<br>
శ్రీలుపొంగిన కేసరాలధర్మం<br>
విక్రాంతి పరపరాగ సంపర్కం. (పుట.150)

'పూరా విప్పారిన పుష్పం' మన సమాజానికి ప్రతీకగా పేర్కొన్నాడు. కానీ ఈ ఒక ప్రతీకతోనే విషయం దృశ్యాత్మకం కాలేదు. ఇదొక ప్రధానమైన ప్రతీక మాత్రమే. తర్వాత సమాజంలోని వివిధ వర్గాల మనస్తత్వాన్ని తెలియజేయడానికి ఆ ప్రధాన ప్రతీకలోంచి మరికొన్ని ప్రతీకలను సృష్టించి తద్వారా విషయం దృశ్యాత్మకం గావించినాడు.

పుష్పం అడుగు భాగాన వుండేవి రక్షక పత్రాలు. ఇవి ఎండలో వానలో తడిసి పువ్వును రక్షిస్తాయి. కానీ వాటికి పర పరాగ సంపర్కం వుండదు. కీల్కాగ్రానికే పరపరాగసంపర్కం ప్రాప్తిస్తుంది. ఇందులో రక్షక పత్రాలు శ్రామిక వర్గానికి సంకేతం. ఇదొక ప్రతీక. శ్రామికులు కండలు విరిచి కష్టపడి పనిచేస్తేనే పెట్టుబడి దారులు నిలబడ గలరు. హాయిగా పైపైన తేలియాడే శ్రీమంతునికే ఐశ్వర్య ప్రాప్తి. అతడు అనుభవించే ఆనందం అంతులేనిది. ఇక్కడ కీల్కాగ్రం పెట్టుబడిదారి వర్గానికి ప్రతీక. ఇదొక ప్రత్యేకమైన ప్రతీక. పై విషయ సారాంశాన్ని పరిశీలిస్తే మన సమాజానికి 'పూరా' విప్పారిన పుష్పం ఒక ముఖ్య ప్రతీక అయితే అందులోని భాగాలైన 'కీల్కాగ్రం' పెట్టుబడిదారి వర్గానికి, 'రక్షక పత్రాలు' శ్రామిక వర్గానికి ప్రతీకలైనాయి. 'పర పరాగ సంపర్కం' ఐశ్వర్యానికి సంకేతం. ఈ ఐశ్వర్యం శ్రామికుల కష్టాం ఫలితంగా వస్తుంది. అది పెట్టుబడి దారులకే చెందుతుంది. వారే ధనవంతు లవుతున్నారనే విషయం పై ప్రతీకలవల్ల ద్యోతక మవుతోంది;

ఈ విధంగా ఒక ప్రధాన ప్రతీక తీసుకొని అందు కొన్ని ప్రతీకలను సృష్టించి వాటి ద్వారా సమాజంలోని స్థితిగతులను, తారతమ్యాలను తెలియజేయడంలో ఆరుద్రలో గల ప్రతీకాత్మక రచనా వైవిధ్యం ప్రస్ఫుటమవుతోంది,

## ఉపకరించిన పుస్తకాలు


1. ఆధునికాంధ్ర కవిత్వము.
   సంప్రదాయములు - ప్రయోగములు.
2. త్వమేవాహం.
3. ఆరుద్ర కవితా పరామర్శ.
   (ఎం . ఫిల్ సిద్ధాంత వ్యాసం).
4. భారతి – అక్టోబరు – 1983,
5. స్రవంతి – జనవరి . 1983.
6. సింబాలిజమ్
7. ది హెరిటేజి ఆఫ్ సింబాలిజమ్ .
8. కన్వెన్షన్ అండ్ రివోల్ట్ ఇన్ పొయెట్రి.


డా॥ జి. శంకరరెడ్డి

## గ్రామ నామాలు

శ్రీ ఎ. వి. దత్తాత్రేయ శర్మగారి వ్యాసం - కృష్ణాజిల్లా గ్రామనామాలు ఒక పరిశీలన (1984 ఫిబ్రవరి భారతి, 61, 2, పేజి 63)లో శ్రీకాకుళం (ది) ను గురించి మరికొంత సమాచారమును పాఠకులకు తెలియజేయుటకు ఈ ఉత్తరమును వ్రాయుచున్నాను.

'శ్రీకాకుళం' అనే పేరు ఆ ఊరుకు కలుగుటకు పండిత పామరులలో వివిధాభిప్రాయములు గలవు. ఈ విషయమై శ్రీకాకుళ వాస్తవ్యులైన శ్రీ శృంగారం శ్రీనివాస రంగాచార్యులుగారికి బాగుగా తెలియును. ఇటీవల నేను అచ్చటకు వెళ్ళినప్పుడు పై విషయమై ప్రశ్నించగా అయన వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయములను కూడా యిచ్చట వ్రాయుచున్నాను.

శ్రీకాకుళం ప్రస్తుతం కృష్ణాజిల్లా మొవ్వతాలుకాలో నున్నది. శ్రీకాకుళంను గురించి ఎక్కువగా బౌద్ధ వాఙ్మయంలో చెప్పబడినది. "ప్రజ్ఞా పారమిత" అనే శాస్త్రాన్ని బౌద్ధులు యిచ్చట అభ్యసించారని పేర్కొనబడినది. "సిరికా" అను పేరు గల బౌద్ధమత స్త్రీ యిచ్చట ఒక కొలను త్రవ్వించెనట. అందువల్ల ఈ ఊరికి ఆమె పేరుమీదుగా 'సిరికాకొలను' అని పేరు వచ్చినదని బౌద్ధ గ్రంథములలో వ్రాయబడినది. సిరికాకొలను కాలక్రమమున వాడుక బాషలో పండితపామరుల నోళ్ళల్లోబడి శ్రీకాకులము, శ్రీకాకుళము మొదలగు రూపాంతరములను చెందినదట. ప్రస్తుతం శ్రీకాకుళంలో ఆంధ్రమహావిష్ణువు దేవాలయమునకు ఎదురుగా కొంతదూరములో ఒక కొలనుగలదు. కానీ దానిని 'సిరికా' అనే ఆమె త్రవ్వించినట్లు ఆధారములు (శాసనములు) ఏవియు అచ్చటలేవు. అయితే శ్రీకాకుళం కొంత మంది రాజులకు ముఖ్యనగరముగా ఉండినదని బౌద్ధ గ్రంథముల ద్వారా తెలియుచున్నది. బ్రహ్మాండ పురాణంలో చెప్పబడిన సుచీంద్రుని రాజధాని కృష్ణాజిల్లా శ్రీకాకుళం అని ఆర్యమంజుశ్రీ "మూలకల్పము"ను బౌద్ధ గ్రంథము తెలియజేయుచున్నది. (ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర- యేటుకూరి బలరామమూర్తి - 1953. విశాలాంధ్ర ప్రచురణాలయం మరియు శ్రీకాకుళం చుట్టుప్రక్కల గ్రామములైన ఘంటసాల, చోరగుడి బట్టిప్రోలు మొదలగు ప్రాంతములలో బౌద్ధ మత విశేషములు త్రవ్వకములలో బయల్పడుట గమనింపదగినది.

ఆంధ్రరాజులు (శాతవాహనరాజులు) శ్రీకాకుళం ప్రాంతమును పరిపాలించుటకు పూర్వం నాగజాతి పాలించుచుండెడిది. వారిలో కాకుల నాగేంద్రుడను నతడు కృష్ణా నదీ తీరమున ఒక నగరమును కట్టించెనట. అతని పేరుమీదుగా ఆ పట్టణమునకు 'శ్రీకాకుళము' అని పేరు వచ్చినదని జనప్రతీతి. ఈ విషయం 'సత్యప్రభ' (లోగడ 'పూర్ణ అను పేరున ఈ నవల భారతిలో ప్రచురించ బడినదట. దానిని

వ్రాసినవారు శ్రీ వాసిష్ఠ గణపతిగారు, ఆయన గతించుట వలన ఆ నవల మధ్యలో ఆగిపోయినదట. దానిని వారి కుమారులైన శ్రీ మహదేవ శాస్త్రిగారు పూర్తి చేశారని శ్రీ శృంగారం శ్రీనివాస రంగాచార్యులుగారు అంటున్నారు( అను నవలలో ప్రస్తావించబడినది. అందులో - ఆంధ్రేశ్వరుడైన కాకుల నాగేంద్రుడును, చిత్రకూటేశ్వరుడైన మందనాథ నాగేంద్రుడును, మగధరాజు మహాపద్మనందునిచే ఓడింపబడి వారి రాజ్యములను కోల్పోవగా, కౌండిన్య గోత్రజుడైన కమలేశ్వరుని కుమారుడు పర్వతస్వామి తన బంధుమిత్రులసాయంతో నాగరాజులు పోగొట్టుకొనిన ప్రాంతములను మహాపద్మనందుని నుంచి తిరిగి రాబట్టుకుని, శ్రీకాకుల నగరంను తన రాజధానిగా జేసుకుని పాలించెనని వ్రాయబడినది. అతని రాజ్యంలో ప్రస్తుత పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు నెల్లూరు, చిత్తూరు జిల్లాలే వుండినవని పై నవలలో వ్రాయబడినది. మన చరిత్రలో శ్రీ పర్వతాంధ్రులని ప్రస్తావన గలదు. వారు బహుశ ఈ రాజ్యస్థాపకుడైన పర్వతస్వామి వారసులని భావింపవచ్చునేమో అను విషయమును పరిశీలించవలసియున్నది.

మరియు భాగవతాది పురాణములలో మరీచి, కశ్యపాది నవ బ్రహ్మలు కృష్ణానదీ తీరములో శ్రీ మహావిష్ణువుని ప్రత్యక్షమునకై తపమొనరించిరని, వారి తపస్సుకు మెచ్చిన దేవదేవుడు ప్రత్యక్షమవగా వారు ఆయనను విగ్రహరూపమున ఆ ప్రాంతమందు వెలవమనగా, శ్రీ మహావిష్ణువు నవబ్రహ్మల కోరికపై అట్లే వెలసెనట. అంత నవబ్రహ్మలు మహావిష్ణువుని విగ్రహమును పూజించి అచ్చటనే ప్రతిష్టించిరట అని చెప్పబడినది. అప్పటినుండి ఆయన శ్రీకాకుళాంధ్రదేవుడు, ఆంధ్ర మహావిష్ణువు అను పేర్లతో పిలువబడుచున్నాడు. ఇది ఇచ్చటి వాడుకలోనున్న స్థలపురాణ గాథలలో నొకటి. కృష్ణానదీ తీరప్రాంతమందు నవబహ్మలు తపమొనరించుటచే ఆ ప్రాంతమునకు – ('క' బ్రహ్మలచేత; 'ఆ కులము' - వ్యాపించబడినది, 'శ్రీ' అనునది గౌరవసూచకముగా చేర్చబడినదని - శ్రీ శృంగారం శ్రీనివాస రంగాచార్యులుగారి అభిప్రాయము )– శ్రీకాకులము అని పేరువచ్చినది. కాలక్రమమున శ్రీకాకులము, శ్రీకాకుళముగా మారినదని జనప్రతీతి.

ఈ సందర్భములో శ్రీకాకుళమును గురించి మరికొంత చెప్పట అవసరమని తలచుచున్నాను. (ఎందువలననగా - నేను శ్రీకాకుళంలో వివాహము చేసుకున్నాను. ఆ సమయమందు నాకు తెలిసిన వారు చాలామంది, ముఖ్యముగా విజయవాడలో నివసించేవారు, 'శ్రీకాకుళము' అనగానే "ఏమిటీ చాలా దూరం పోయారే!" అన్నారు- (మా స్వగ్రామం సూళూరుపేట)– అప్పుడు నేను ఆ శ్రీకాకుళం (జిల్లా కేంద్రం) గాదు - విజయవాడ దగ్గర, కృష్ణానదీ తీరాన వున్న శ్రీకాకుళం- శ్రీకృష్ణదేవరాయలు సందర్శించిన ఊరు, శ్రీకాసుల పురుషోత్తమకవి రచించిన 'ఆంధ్రనాయక శతకం. ఆ ఊరిలోని ముఖ్యదేవాలయమైన ఆంధ్ర మహావిష్ణువును గురించియే- అని అలా అడిగిన ప్రతివారికి చెప్పవలసి వచ్చినది. విజయవాడలో నివసించు వారికే ఆ ఊరి గురించి తెలియకపోవుట శోచనీయము). అష్టోత్తరశత (108) దివ్యక్షేత్రములలో ఈ శ్రీకాకుళం నలుబది ఆరవది (46)గా పురాణములలో పేర్కొనబడినది.

విష్ణు పురాణంలో చెప్పబడిన బలిపుచ్ఛకు (శ్రీముఖుడు) ని తమ్ముడు కృష్ణుడనునతడు. తన అన్న తరువాత కొంతకాలము పరిపాలించెనట. ఆయన మరణానంతరం. ఆయన జ్ఞాపక చిహ్నంగా ఒక విగ్రహమును (ప్రజలు)చేయించిరట. కాలక్రమాన ఆకృష్ణుని విగ్రహం ఆంధ్ర మహావిష్ణువుగా పూజింపబడుతున్నదని శ్రీ శృంగారం శ్రీనివాస రంగాచార్యులుగారు చెప్పుచున్నారు. ఈ శ్రీకాకుళంలో చాలామంది ప్రసిద్ధ కవులు జన్మించారు. చోరశాస్త్రమును రచించిన కర్ణీసుతుడను నతడు ఈ గ్రామవాసియే. కృష్ణ కర్ణామృతమును వ్రాసిన లీలా సుకయోగీంద్రుడు (బిల్వ మంగళుడు) నూ ఈ గ్రామములోనే నివసించెనట. చింతామణి - బిల్వమంగళుల వృత్తాంతము జరిగిన ప్రాంతము ఇదేనట. కాలకూట నారాయణరావు గారు 'చింతామణి' వృత్తాంతమును నాటకముగా వ్రాసినారు. మరెందరో భక్తులు శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువుపై క్షేత్రమాహాత్మ్యములను, స్తోత్రములను వ్రాసినారు. భోజరాజీయము అనుకావ్యమును అనంతామాత్యుడు ఇక్కడ ప్రభుత్వోద్యోగిగా పని చేయుచున్నప్పుడు వ్రాసెనట.

సుమతీ, కృష్ణదేవరాయులు మొదలగు వారు శ్రీకాకుళమందు బసచేసి యిచ్చటి స్వామిని సేవించి, దేవాలయాభివృద్ధికై తమ రాజ్యములలోని భూములను దానముగా యిచ్చెనట. శ్రీ కృష్ణదేవరాయలు, కళింగ రాజ్యదండయాత్రలో మార్గమధ్యమున యిచ్చట విడిది చేసెనట. ఆయన కలలో శ్రీ ఆంధ్రమహావిష్ణువు కనుపించి 'ఆముక్త మాల్యద అను గ్రంథమును రచించి, శ్రీ వేంకటేశ్వరునికి అంకితమివ్వ' మని చెప్పెనట. ఆ విషయము ఆముక్తమాల్యదలోని పీఠికలో రాయలు వారు పేర్కొనివున్నారు. అదే విషయము యిచ్చట నున్న శాసనములలోనూ ఆయన చెక్కించినారు.

శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమును గురించి బ్రహ్మాండపురాణంలో చెప్పబడిన ఓ వైఖానస అర్చకుని కథకు ఆముక్తమాల్యదలోని ముఖ్య వృత్తాంతమునకు కొలది పోలికలు గలవు. శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువుకు తల వెనుక వెంట్రుకలు మొలచినవి. అవి కొంతకాలం తదుపరి నశించి పోయినవని చెప్పుకుంటారు. యిచ్చటి ప్రజలు దీనిని గురించిన కథే బ్రహ్మాండ పురాణంలో చెప్పబడినదని శ్రీ శృంగారం శ్రీనివాసరంగాచార్యులు అంటున్నారు. చరిత్ర ప్రసిద్ధమైన పురాణ ప్రసిద్ధమైన ఈ క్షేత్రమును గురించి చెప్పుకొనుటకు చాలా విశేషములు గలవు.

శ్రీ కందాళ శ్రీనివాసాచార్య

# గ్రంథ విమర్శలు

## త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం

[రచన : శ్రీ ఆకెళ్ళ. అచ్యుతరామం, డెమ్మీసైజు 10 + 56 పేజీలు. వెల రూ. 8 లు. ప్రకాశకులు - యువభారతి, సాహితీ సాంస్కృతిక సంస్థ 6 కింగ్స్‌వే, సికిందరాబాదు-3]

తమ కవితా ప్రాభవంవల్ల భగవంతుణ్ని సంతృప్తి పరచి తరించిన భక్తవరులు భారతదేశంలో లేకపోలేదు. అట్టివారిలో ఆంధ్రులకూ ఉత్తమ స్థానం ఉన్నది. అట్టివారిలో భాగవతాన్ని రచించిన బమ్మెరపోతన్న, కీర్తనలు రచించిన రామదాసు నామమున ప్రసిద్ధుడు కంచెర్ల - గోపన్న, కాకర్ల త్యాగయ్య మిక్కిలి ప్రసిద్ధులు. తమ సాహితీ సంపదను సులభమైన కీర్తనలలో ప్రకటించి గానం చేసిన గోపన్న త్యాగయ్యల కీర్తనలను వినని వారుండరు. ఆ యిద్దరిలో కర్నాటక సంగీత విద్యా త్రిమూర్తులలో ప్రథముడైన త్యాగయ్యగారి సాహిత్యం లేనిదే కర్నాటక సంగీతమే లేదని చెప్పాలి. అట్టి త్యాగయ్య (త్యాగరాజస్వామి) భక్తి కవితా వైభవం ఈ చిన్న పుస్తకంలో సంగ్రహంగా వివరించబడినది.

రచయిత - అచ్యుతరామంగారి వృత్తికీ, సంగీత విద్యకూ ఏమాత్రమూ సంబంధం లేదు. అయినా ఆయనకు గల సహజ సంగీత సాహిత్యాలపై గల అభిమానమే వారి కృషికి దోహదమైనది. త్యాగరాజస్వామి కృతులను విని అందరూ ఆనందిస్తారేకాని, ఆయన కవితా వైభవాన్ని అర్థం చేసుకునేవారు అరుదు. కొన్నియేళ్ళ క్రిందట త్యాగరాజ కీర్తనలకు విశేష వివరణతో కూడా కల్లూరి వీరభద్రశాస్త్రి గారు పరిష్కరించగా, శ్రీ బి.వి. యస్. యన్. మణిగారు ఉదార హృదయంతో తమ "స్వధర్మ స్వారాజ్య సంఘంపక్షాన" ప్రకటించారు. అవి రెండు సంపుటాలు, అందరికీ అందుబాటులో ఉండవు. అచ్యుతరామంగారు సంగ్రహంగా కొలది కీర్తనలనే తీసుకుని అందలి కవితా వైభవాన్ని విపులంగా చూపారు. ఈ చిన్న పుస్తకంలో 'పంచరత్న కీర్తనలు, 'నగుమోము'-! 'నారద గానలోల', 'ప్రక్కల నిలబడి' 'ముమ్మూర్తులు', 'కారువేల్పులు,' 'పాహిరమారమణా'. 'చల్లరేరామ చంద్రునిపై పూల,' 'సినామ రూపములకు - మంగళం' అనే శీర్షికలలో ఆయా కీర్తనలలోని కవితా వైభవం వివరించబడింది. మొదట 'సం-గీతం-రసానందం' అనే శీర్షికలో సంగీతం వల్ల కలిగేరసానుభూతి వివరించబడింది. ఇది సంగ్రహ రూపంగా, తక్కువ వెలకు లభించుట వల్ల అందరికీ అందుబాటులో ఉన్నదని గ్రహించాలి. యువభారతి ప్రధాన సంపాదకులు డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యంగారి 'కృతి-సుకృతి' అనే పీఠిక దీనికి మెరుగు పెడుతున్నది.

ఉత్తమ సాహితిని ప్రకటిస్తూ, సంస్కృతికి సర్వవిధాలా ఎనలేని కృషి చేస్తున్న 'యువభారతి' సంస్థవారు దీనిని ప్రకటించడం ముదావహం.

## శ్రీ వేంకటేశ సారస్వత వినోదిని

[కర్త : శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యం. డెమ్మీసైజు 202 పేజీలు. వెల రూ 20 (తపాలుచార్జితో) ప్రతులకు - రచయిత - 4-49-20బి శాంతిసందు, ముత్యాలరెడ్డిపల్లిరోడ్డు, తిరుపతి-517502]

సాహిత్య శాస్త్రవేత్తలు కావ్యాన్ని మూడు విధాలుగా విభజించారు ఉత్తమ కావ్యం, మధ్యమకావ్యం అధమకావ్యమని. కావ్యానికి జీవితం వ్యంగ్యం. వ్యంగ్యం ప్రధానమైనది ఉత్తమం; వ్యంగ్యం అప్రధానంగా ఉన్నది మధ్యమం. వ్యంగ్యం లేనిది అధమ మంటే నీచమని అర్థంకాదు. దానినే చిత్రకావ్యం అని అంటారు. కావ్యానికి ప్రాణభూతమైన వ్యంగ్యం లేకపోయినా చిత్రకవిత్వం చమత్కారంగా ఉండటం వల్ల అది ప్రజల ఆమోదాన్ని చూరగొంటూనే ఉంటుంది. చిత్రకావ్యాలలో కథాంశం ఉండదు. విభిన్న విషయాలకు చెందిన పద్యాలు మాత్రం ఉంటాయి. అట్టి చిత్రకావ్యాల కోవకు చెందినదే "శ్రీవేంకటేశ సారస్వత వినోదిని."

ఇందులో మనోజ్ఞప్రకరణం, అర్థభేద (అర్థవైచిత్రి) ప్రకరణం. సృజనాత్మకశక్తి ప్రకరణం, భాషా సౌందర్య ప్రకరణం, శ్రీవేంకటేశ ప్రకరణం - అని అయిదు ప్రకరణాలున్నవి. ఈ ప్రకరణాలలో ఉన్నవన్నీ సీస పద్యాలే! ఎత్తు గీతి చివరిపాదం "దేవ! శ్రీ వేంకటేశ: పద్మావతీశ!" అనే మకుటంతో ఉన్నది. దీని పఠనం వల్ల ఐహికమైన ఆనందమే కాక - శ్రీ వేంకటేశ పద్మావతుల స్మరణవల్ల పారలౌకికానందం కూడా లభిస్తుందని రచయిత తెలుపుతున్నారు.

ప్రతి పద్యానికి ఒక శీర్షిక ఉన్నది. గర్భకవిత్వం, దాగుడు పదాలు, ఇతరములైన చేర్పుడు పదాలపై ఆధారపడిన పద్యాలు, సమస్యలకు సమాధానాలిచ్చే పద్యాలు- చిత్రవిచిత్రంగా కూర్చబడినవి ఇందులో ఇంపు కూరుస్తున్నవి. ప్రతిపద్యానికీ అధస్సూచికలో సులభగ్రాహ్యమైన వివరణ కూడా ఉన్నది. అందరూ సులభంగా అర్థంచేసుకునే సులభశైలిలో పద్యరచనసాగింది. సర్వసాధారణంగా తెలుగు గ్రంథాలు ద్వితీయ ముద్రణకు నోచుకోవు. కాని యిది ఇప్పటికి ఏడు ముద్రణలను పొందినదంటేనే దీని ప్రాశస్త్యం వెల్లడి అవుతున్నది.

సుప్రసిద్ధ మధురకవి కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి శుభాశంసనం కూడా దీనికి లభించింది.

చిత్రకవిత్వం మరుగు పడుతున్న యీ కాలంలో ఇట్టి గ్రంథం వెలువడడం హర్షించదగినది.

బులుసు వేంకటరమణయ్య

# సంస్కృతంలోని ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు

[రచయిత : డాక్టర్ అ. పున్నారావుగారు, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్ - 522510. డెమ్మీ సైజు–18 + 478 పుటలు వెల రు. 40=లు. ప్రతులకు – పద్మా ప్రచురణలు శివ పార్వతీ సదనం, బి. 72. శ్రీనివాసనగర్, గుంటూరు – 522006.]

శాస్త్రవిషయాలు కంఠస్థాలయినప్పుడే వాటిని అవగాహన చేసుకొనుట సులభం : అందువల్లనే ప్రాచీనులు సంగ్రహంగా సూత్రాలలోనూ, శ్లోకాలలోనూ సంస్కృతంలో వాటిని రచించారు. సంస్కృత పద్ధతిని అనుసరించే తెలుగు వ్యాకరణ గ్రంథాలు సంస్కృత శ్లోకాలలోనూ, సూత్రాలలోనూ రచింపబడినవి. వీటిలో నన్నయ భట్టరచితమని ప్రసిద్ధమైన ఆంధ్రశబ్దచింతామణి, సీతారామాచార్యకృతమైన "వికృతి వివేకం" సంస్కృతశ్లోకాల్లోనే ఉన్నవి. చింతామణి వ్యాఖ్య అహోబల పండితీయం సంస్కృతంలోనే ఉన్నవి. ఆంధ్ర కౌముది సూత్రరూపంలో ఉన్నది. సౌలభ్యం కోసం బాలవ్యాకరణానికి హరికారికావళి, ప్రౌఢవ్యాకరణానికి హరికారికా శేషసర్వస్వం శ్లోకానువాదాలు వచ్చాయి. చింతామణి, వికృతి వివేక, అహోబలపండితీయాలకు గల ప్రకారం తక్కినవాటికి లేకపోయింది. ఆంధ్రవ్యాకరణాలను గురించి పరిశోధించి డాక్టర్ పట్టంకోసం సిద్ధాంత వ్యాసం వ్రాయ సంకల్పించిన పున్నారావుగారు ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకాల పుట్టుపూర్వోత్తరాలను గురించిన యీ బృహద్రచనను సాగించి పరీక్షకుల ఆమోదాన్ని పొంది డాక్టర్ పట్టం సంపాదించారు. ఆ ముఖ్యవిషయంతో పాటు ప్రసక్తాను ప్రసక్తంగా తెలుగు వ్యాకరణాలను అవలోడించి గ్రహించిన అంశాలను కూడా వివరించారు. దీనికై రచయిత సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథాలను పెక్కింటిని పరిశీలించారు.

నాలుగు భాగాలు గల యీ గ్రంథంలోని మొదటి భాగంలో చింతామణిని గూర్చి ప్రాచీనుల, నవీనుల అభిప్రాయాలు, చింతామణి కర్తృత్వ చర్చ ఉన్నవి. రెండవ భాగంలో చింతామణి స్వరూప, స్వభావాలు ప్రధానాంశాలు. తృతీయభాగంలో చింతామణి వ్యాఖ్యలను గురించీ, వికృతి వివేకాన్ని గురించీ వివరించబడినది. ఇతర వ్యాకరణాలను గూర్చికూడా ఉన్నది. చతుర్థభాగంలో అనంతర వ్యాకరణాలపై చింతామణి ప్రభావం చూపబడింది. సూరకవి "కవిసంశయవిచ్ఛేదం"తో పాటు, గతశతాబ్దిలోని పట్టాభిరామ పండితీయం మున్నగువాటి ప్రస్తావన ఉన్నది.

చింతామణి, వికృతి వివేకాలను గురించిన సమగ్ర విషయాలను గ్రహించుటకు ఈ గ్రంథం ఎంతో ఉపయోగకరమైనది.

# శ్రీ రామాయణ తరంగిణి

[రచయిత : శ్రీ పోలూరి హనుమజ్జానకిరామశర్మ, ప్రాచ్యభాషావిభాగాధ్యక్షులు: శ్రీవెంకటగిరి రాజా-కళాశాల, నెల్లూరు, డెమ్మీ సైజు 18 + 182 పుటలు, వెల 12-00రూ॥లు, ప్రకాశకులు- శ్రీరామకృష్ణ సేవాసమాజము, కాసుఖేలవారి అగ్రహారం, నెల్లూరు. ప్రతులు దొరకుచోట్లు, 1. శ్రీశంకర్ పబ్లిషింగ్ హౌస్, నవాబుపేట, నెల్లూరు. 2. శ్రీవివేకానంద విద్యాలయం, 4/120 ముకుందపురం, నవాబుపేట, నెల్లూరు-2.]

రచయిత సంస్కృతాంధ్రాంగ్లాలలో గట్టి విద్వాంసులు, వ్యాకరణాలంకార వేదాంత శాస్త్రాలలో సమర్థులైన పండితుల వద్ద అంతేవాసులై, ఆ శాస్త్రాలలో పరినిష్ఠిత జ్ఞానాన్ని సంపాదించారు. రామాయణంపై వీరికి అభినివేశం ఎక్కువ, దాన్ని సుతీక్ష్ణంగా పరిశీలించి ఎన్నో విశిష్ట విషయాలను తెలుసుకొన్నారు. నెల్లూరులోని శ్రీరామకృష్ణ సేవాసమాజం వారి కోరికపయి శ్రీమద్రామాయణాన్ని గురించి 51 ఉపన్యాసాలిచ్చి, సత్కారాన్ని, బహుజనామోదాన్ని పొందారు. ఆ ఉపన్యాసాలు పన్నెండు "వాల్మీకితీర్థం" అనే ప్రథమ భాగంగా, శ్రీరామకృష్ణ సేవాసమితివారి చేతనే ప్రకటింపబడింది. తరంగిణి అవగాహనకు తీర్థం ఎంతో అవసరమైనది. ఈ నామకరణం సముచితమై ఉన్నది.

హనుమజ్జానకిరామశర్మగారు అధ్యాపకులయి ఉన్నందున విషయాన్ని సులభంగా బోధించుటలో అనుభవం కలిగి ఉన్నందున జనసామాన్యాన్ని ఆకర్షించే విధంగా ఉపన్యసించగలరు. ఏ విషయాన్ని గురించి వివరించినా, దానికి ప్రమాణం తప్పక చూపుతూఉంటారు. అందువల్ల వీరు చెప్పినవన్నీ ప్రామాణికాలే అని గ్రహించాలి.

ఈ సంపుటం వాల్మీకి తీర్థమనే తొలితీర్థాన్ని మాత్రమే వివరిస్తున్నది. రచయిత చేసిన ప్రకటనను బట్టి, మరి ఇరవై మూడు తీర్థాలు ప్రకటనకు సిద్ధంగా ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ గ్రంథరూపంలో ఉన్న వాల్మీకి తీర్థంలో తొమ్మిది ఉపశీర్షికలున్నవి. అవి- కల్యాణ

గుణములు, వేదసమ్మితత్వం, కర్తవ్యపాలన ఘట్టం, కవిత్వావిర్భావం, ఆదికావ్యోదయ ఘట్టం, శ్లోక, సర్గ వివరణ, కావ్యశ్రవణ ఘట్టం, సీతాశపథఘట్టం, బ్రహ్మ దేవోపదేశ ఘట్టం-అనేవి. ఈ తీర్మానికి రామాయణంలోని బాలకాండ, ఉత్తరకాండ ఆధారాలు. ఆయా సందర్భాలలో ఆ కాండద్వయంలోని శ్లోకాలే అధికంగా ప్రమాణంగా స్వీకరించబడినవి. వాల్మీకి రామాయణాన్ని గురించిన పరిశీలన గ్రంథాలలో ఇదే బృహత్తమంగా కానవస్తున్నది. దీనిని శ్రద్ధతో పఠిస్తే అనేక విషయాలను తెలుసుకోవచ్చును. రచయిత పరిశీలన ప్రశంసింప దగినది. దీని తరువాత సంపుటాలు కూడా త్వరలోనే వెలువడగలవని ఆశిస్తున్నాను.

"ఆంగీరస"

# హంస ఎగిరిపోయింది

[కుందుర్తి కవిత వెల :-రు-5-00 ప్రతులకు :-కె. సత్య మూర్తి ; ఎమ్. సి. మలక్ పేట కాలనీ హైదరాబాద్ - 500 036]

కుందుర్తి షష్టిపూర్తిని ఒక ఉత్సవంగా జరిపి ఆనాటికి ఈ కావ్యాన్ని అచ్చువేసి ఆయనకు బహూకరించే ప్రయత్నంలో జరిగిన విషాదం ఆలోపునే కుందుర్తి మరణించటం" ఆ పుస్తకాన్ని అంతకు కొన్ని నెలల క్రితమే భార్య శ్రీమతి సుందరమ్మ మరణించినప్పుడు రాశారు. ఇది వ్యక్తిగత అనుభూతికి సంబంధించిన రచనే అయినప్పటికీ కవితాపరంగా దీని కున్న విలువల దృష్ట్యా. ఆయన కోరుకున్న విధంగా ఆయన షష్టి పూర్తి జరగ వలసివున్న రోజున యీ పుస్తకాన్ని అచ్చువేసి విడుదల చేయాలని నిర్ణయించాం" అని సన్మాన సంఘం వారు చెబుతున్నారు.

కుందుర్తిని గురించి కవిగా ఈ రోజున పాఠకులకు కొత్తగా చెప్పబోవటం అంత హాస్యాస్పద విషయం మరొకటి లేదు. ప్రాచీన సంప్రదాయంలోంచి అధునిక సంప్రదాయంలోకి వచ్చి ఆయన వచన కవితలో చెయ్యని ప్రయోగం లేదు. ఆయన ప్రయోగం ఏదీ ఉత్త ప్రయోగంగానే మిగిలిపోలేదు. పోగా ఒక తరం కవులు. తమ తరువాతి తరం కవుల్ని అంతగా ఆదరించినట్లు చెప్పకో తగ్గ సాక్ష్యాలు లేవు. (ఇస్తే ఆశీస్సులు లేకపోతే శాపనార్థాలూ తప్ప కుందుర్తి కవిత్వంలో ఎప్పుడూ యువకుడే. యువతరాన్ని ఆయన అలక్ష్యం చెయ్యలేదు, తన పీఠాన్ని ఆయన ఎప్పుడూ ఉన్నతంగా ఊహించుకొందీ లేదు. 'హంస ఎగిరిపోయింది' ఎలిజీగీతం వేదన వ్యక్తిగతమైనా అది అక్షర రూపం పొందేటప్పటికి సర్వకాలికమూ, సర్వ జనీనమూ అవుతుంది. ఏ అను భూతి అయినా వ్యక్తిదే; అది కళాత్మక రూపం పొందటంలో కళా కారుడి నైపుణ్యం వల్లనే సమిష్టికి చెందుతుంది.

ఎక్కబోతున్న కుటుంబపు గుర్రం
వెనక్కాళ్ళతో చాచి తంతున్నప్పుడు
భోగం భోగందనీ,, త్యాగం ధర్మపత్ని వంటిదనీ
పోల్చి నేను కవిత్వంలో బోధ చేస్తున్నప్పుడు
హంసల తెలుపు అంతరించి
కాకి రంగు బ్రతుకునిండా కమ్ముకున్నప్పుడు
నాతో పాటు చెరి సగంగా బరువు మోసి
నాతో పాటు చెరి సగంగా కరువుమేసి.........
న అర్ధాంగి మరణించినప్పుడు ఎవరికైనా భావుకత ఉన్నవాడు.

వెళ్ళండి వెళ్ళండి, బండెడు కట్టెలు పిలుస్తున్నాయి.
స్మృతులు గుండెను తలుస్తున్నాయి
కంట్లో కడివెడు కన్నీళ్ళు నిలుస్తున్నాయి
వెళ్ళండి వెళ్ళండి
మధ్యాహ్నం 12 గంటల్లోకి మంటల్లోకి

అంటాడు. కుందుర్తి అదీ అన్నాడు హృదయాన్ని మెరికలు తిప్పే ఎలిజి కావ్యం ఇది.

# లయ - కవితా సంకలనం

[పొయిట్రీ ఫోరమ్ వెల - రు. 3-00 లు ప్రతులకు - కళానికేతన్ - 9-1-18; వేములవాడ - 505302, కరీంనగర్.

ఇది ఐదుగురు యువ కవుల కవితా సంకలనం జింబో; పి. యస్. రవీంద్ర, వారాల ఆనంద్, అలిశెట్టి ప్రభాకర్, వఝుల శివకుమార్ ఈ ఐదుగురు ఏ కాభిప్రాయంతో రాసిన కవితలివి. మినీ కవితా ఉద్యమం కొంత మంది యువకవుల్ని ప్రసవించింది. రాసింది కవిత్వమైనప్పుడు అది మినీ కవితా ? మాక్సీకవితా ? అనే ప్రశ్నే ఉండదు. పేరుకు యువ కవులైనా ఈ సంకలనంలో కవితా పరిపక్వత ప్రదర్శితమైంది. వచన కవిత్వమంటే వచనపుతునకలే ననే అభిప్రాయం బహుళ ప్రచారంలో ఉన్న ఈ రోజుల్లో కవితా స్పృహ, సామాజిక స్పృహ ఉన్న ఇట్లాంటి సంకలనాల అవసరం ఎంతైనా ఉంది.

రోజూ అవేదృశ్యాలు
ఒక దాన్ని మించి మరోటి
సంఘర్షణ పేరుతో హత్యలు
గంగా జలంతో పవిత్రం చేస్తున్న కళ్ళు
లాకప్పుల్లో బెడ్ రూములు
మేధావుల మెదళ్ళలో చెదలు
సిరాలో సాలీడుల ఆత్మహత్యలు
ఈ దృశ్యాల్లో
నా కళ్ళల్లో సముద్రపు అలలు

నాపిడికిట్లో బిగుసుకున్న పెనుతుఫాను పై పాదాల్లో ప్రతి పాదంలోనూ ఉన్న ధ్వని ఈ సంకీర్ణ, సంక్లిష్ట సమాజపు అవలక్ష ణాలు, అవగాహన అయిన ప్రతి వ్యక్తికి అర్థం అవుతుంది. ఆలోచింప చేస్తుంది.

రెండు ప్రపంచాల వ్యత్యాసాన్ని, రెండు జీవితాల తార తమ్యాన్ని, రెండు బతుకుల విధానాల స్వరూపాన్ని ఈ కవులు వర్ణించిన పద్ధతిలో ఉన్న కవితాత్మ గొప్పది.

మాకు మీలా సేఫ్టీలాకర్లలో
వసంతాన్ని బంధించడం చేతకాదు
వ్యధల్ని గుండెల్లో బంధించు కోవడం తప్ప
మాకు వెన్నెల్లో రమించడం తెలీదు
సూర్యుడులో వెన్నెల్ని కోరుకోవడం తప్ప
ఊహా విహాయసంలో గంధర్వ
విపంచి వినిపించదు
పేగు తీగల వేదనా సహిత గీతం తప్ప
కారణం
మీరు మా చెమటని
మేం మా ఆకల్ని తిని బతుకుతాం

ఇలా ఈ సంకలనంలో ప్రతి గేయం - ప్రతి ఘటనా లక్ష్యంగా, ఈ వ్యవస్థపై తిరుగుబాటే ధ్యేయంగా, కవిత్వ లక్ష ణానికి అపకారం జరగకుండా ఉండటం కవితాభిమానులకు, సామా జిక పురోగమన వాదులకు తృప్తినిచ్చే లక్షణం.

టి. యల్. కాంతారావు

# త్రిదశి. పద్యకావ్య సంకలనము

[జనమంచి వేంకటరామయ్య, వెల - రు. 10-00లు ప్రతులకు :- జనమంచి కామేశ్వరరావు : బా-బాపూ భవనం; వీర భద్రపురం - రాజమండ్రి - 533105]

వేంకటరామయ్యగారు 1872 పుట్టి 1933లో కాలధర్మం చెందారు. వారి పుత్రులు కామేశ్వరావుగారు 80 ఖండికల ఈ కవితా సంకలనాన్ని ప్రచురించి పితౄణం కొంత తీర్చుకొన్నారు. ఈ సంకలనానికి మల్లంపల్లి శరభయ్యగారు విపులమైన పీఠికరాసి ఈ కవిత్వాన్ని ఎలా అర్థం చేసుకోవాలో చెప్పారు. కవిగారు వారి దృక్ప థాన్ని ఈ విధంగా చెప్పారు,

"ఒక యీశ్వరు కృప నందఁబ
మొక యోడనె యెక్కి దాఁటి యొక సంద్రమునే
యొకతీరమె చేరఁగవలె
నిఁక నీసంశయములేల యిచ్చట మనకున్"

ఇది బతుకు పట్ల వారి దృష్టి. కవికి ఏదో ఒక భావం లీలగా మెదులుతుంది. క్రమంగా ఆ భావమే మనస్సునిండా ఆక్రమించి కవిత్వరూపంలో వస్తుంది. కవిత్వరచన కోసం వృథా ప్రయాస లన వసరమని కవిగారి అభిప్రాయం.

"కవితాతత్త్వ విశారదుండగుటకై
కాశీనవద్వీప వా
స వృథా యానములేల ? పూర్వభవ
సంస్కారంబు వాణీప్రసా
ద విశేషంబును, గల్గ, మూఁగయు
వసంత శ్రీ సమారంభ వే
ళవనీ పాళిఁ బికంబువోలె
మధురాలాపంబుఁ గావించెడున్"

అని చెబుతారు. అవధాన ప్రక్రియ తెలుగు కవిత్వం సొంతం అవధానాలలో తెలుగు కవిత్వాన్ని ఊరూరా ఊరేగించిన కవులు తెలుగులో ఎక్కువగానే ఉన్నారు. అవధానం ఈ నాటికీ తెలుగునాట ప్రసిద్ధంగానూ, ప్రశస్తంగానూ ఉన్న ప్రక్రియ అవధాన ప్రక్రియపై కవిగారికి చిన్న చూపుఉంది. ఆయన ఇట్లా అంటారు.

"పరమానంద రసానుభూతికై
ప్రాప్తం బైన యోగంబు దొ
మ్మరి విద్దెల్ ప్రకటింపబడిన
సామాన్యానం కవిత్వంబు కొం
దటి నోళ్ళంబడి యాశుధారల వధానంబుల్
మొదల్గల్గుచూ
న్వరసాకార వికారముల్ గని
స్వకీయౌన్నత్యమున్ వీడెడున్"

అనేక భావాలతో వీరు కవిత్వంరాశారు. కవితత్త్వానికి కావ్యం దర్పణం. "శ్రుతి సుఖము చెడని నిర్మాణ సౌష్ఠవమును అస్వాదించు టకు సాహిత్యరసములో మాగిన శ్రవణేంద్రియము తప్పక యుండవలయును. జనసామాన్యమున కదియుండదు." అంటున్నారు శరభేశ్వర శర్మగారు. ఇది కొంచెం వివాదగ్రస్తమైన అంశం. వేంకట రామయ్యగారి కవితా తత్త్వాన్ని వారి ముందుమాటలో అంచల వారీగా విశదీకరించి పాఠకులకు ఉపకారం చేశారు. ఇది చదవ తగ్గ పుస్తకం, ఇది చదవనవసరం లేని పుస్తకం అని చెప్పటానికి సమీక్షకునికి గ్యారంటీ అధికారం ఏమీ లేదు. ఎవరి సంస్కారం వారిది.

# కేళాకుళి

[మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, వెల రు. 8-00 లు, ప్రతులకు- రచయిత, త్యాగరాజనగర్; రాజమండ్రి-533 101]

మధునాపంతుల వారిపేరు కవిత్వలోకంలో వినని వారుండరు. గృహనామంలో వలెనే వారి కవిత్వంలోనూ మధువుంది. అది పాఠకునికి భావోద్రేకపు మత్తును కలిగిస్తుంది. ఈ కేళాకుళి అనే కవితా సంకలనంలో అట్లాంటి పద్యాలు చాలా ఉన్నాయి. భావ దారిద్ర్యం లేనివాడు ఎప్పుడూ కొత్త కవిత్వం రాస్తూనే ఉంటాడు. గొప్పకవి అల్పమైన వస్తువుకి అనల్పమైన రసాకృతిని కలిగిస్తాడు. మధునా పంతులవారు అట్లాంటి గొప్పకవి. కన్యాకుమారిలో అరుణోదయం అనే ఖండికలో వారి భావుకత శిఖరాగ్రాన్ని చేరుకున్నది. మామూలు మనిషి ఆ సూర్యోదయంలో ఉన్న అందాన్ని అనుభవించవచ్చు. కాని ఆకృతిని ఇవ్వలేడు గదా!

"సప్తాశ్వములకుఁ బ్రస్థానావసర వేళ
రంగైన కుచ్చుతురాయి తీర్చి
చెలువారు దాసానచెట్ల కొమ్మల రెమ్మ
లం దెట్టి విరుల కన్పిందుఁ గూర్చి
పద్మరాగ మణిప్రభా జనిస్థానమౌ
రోహణాద్రికిఁ చేళలోహలిచ్చి
తామ్రపర్ణీ సైకతములందు మెఱసెడి
కొస ముత్తెముల రంగుపసలు తెచ్చి
నా యొకని కోసమట్లు ప్రాణస్పృశంబు
తలఁపుగా, సన్న సన్న మేల్కొలుపుగాఁగఁ
గడలి కూడలిఘోష మాగధుల గీతి
నాదమై ప్రొద్దుపొడిచెఁ గన్యాకుమారి"

అడవి గాసిన వెన్నెల అనే పలుకుబడి నిష్ప్రయోజనార్థంలో మనం ఉపయోగిస్తాం. కాని సత్యనారాయణగారు వెన్నెల కాసిన అడవులు అని దాన్ని తిరగవేసి నూతనార్థంలో రసరామణీయకంగా చెప్పిన తీరు ప్రశస్తమైనది.

"అపుడు వెన్నెల కాసిన యడవి సొంపు
లడవిఁ గాసిన వెన్నెలలగుట కాదు;
రస గహన వీథిన్ దుహినతోరణము తెఱచి
యను పదము సాఁగుమో భావనాద్వసిన !
శ్రీ కమనీయముల్ చివురుఁ చేతులఁ
బర్ల కుటీర వాటికన్
వాకిట సంజదీప మిడవచ్చిన
కణ్వుని ముద్దు బిడ్డకున్
గూఁ కటి వేణిలో, దుఱుముకో
సరవిచ్చిన సూది మొగ్గగాఁ
దాఁకిన వెల్లురేక భరత క్షితి
కానుపు తియ్యతన్పు పాలా"

మంచు బొట్లను, తొలకరి చినుకులను ఆయన వర్ణించిన పద్ధతిలోనే ఊహాశక్తి, కవితారక్తి, వెల్లడవుతాయి.

"ఎప్పటెప్పటివో జగం చేరినట్లు
చెలంగి వచ్చు తలంపు పచ్చికబయళ్ళు
నించి తళ తళలగు నును మంచుబొట్లు
జీవితాశాక్త మౌక్తిక శేఖరములు"
"యుగ యుగమ్ములుగాఁ బ్రపంచోత్సవములఁ
బాల్గొనుచు నాడుకొనుచును పాడుకొనుచు
నిభృత రీతి వినోదించు నిర్విషాద
లలితజీవుల కొజ్జబంతులము మేము"

మధునా పంతుల వారి ఆంధ్రమన్నా, ఆంధ్రులన్నా ఎన లేని ప్రేమ. అది మేర మీరిన ప్రాంతీయాభిమానం కాదు. తన భాషమీద, తన జాతిమీద ఉన్న స్వాభిమానం మాత్రమే.

"ఇరువదేండ్ల పురామధుస్మృతి దురాప
హర్ష సంజాత రోమహర్షాంకురములఁ
దన తనూవల్లి పొంగె; సంతతి తెలుంగు
లొక్కఁడై యెక్కడెక్కడ నున్నవారు
కొసరి పాడిరి బాసలోఁ గోటికోటి
కంఠ వాటీ నవాంబరోత్కంఠగీతి"

ఇలా ఉదహరించుకుంటూ పోతే ఈ కావ్యంలో ప్రతి పద్యమూ ఉదహరించ బుద్ధివేస్తుంది. మధునా పంతులవారు ఇటీవల రాసిన కావ్యం ఇది. వారి గత కీర్తిని ఇనుమడింప చెయ్యటానికి ఈకావ్యం ఒక నూతన సృష్టి.

# శ్రీ చందనము

[బొడ్డు బాపిరాజు. వెల : రు. 5-00లు (ప్రతులకు:- 1) బొడ్డు ఉమామహేశ్వరరావు; బొడ్డు బాపిరాజు శిల్క్ క్లాత్ షాపు : మెయిన్ రోడ్డు - ఏలూరు, 2) కార్యదర్శి : రామరాజభూషణ సాహిత్య పరిషత్ భీమవరం.]

ఒక్కొక్క కవి పేరు ప్రసిద్ధంగా వినబడుతుంది. ఒక్కొక్క కవి పేరు వినబడదు. ప్రసిద్ధంగా వినబడే వాళ్ళంతా మంచి కవులని, వినబడని వారంతా మంచి కవులు కారనే దుర్భ్రమలో పాఠకులు ఉండవలసిన అవసరం లేదు.

బొడ్డు బాపిరాజుగారు మంచి సంప్రదాయకవి. అంటే సనాతనుడు అని నా అర్థం కాదు. విషయాన్ని ప్రాచీన ఛందో మార్గంలో చెప్పిన కవిని సంప్రదాయ కవి అంటే తప్పులేదు కదా!

"ఈ కవి రసికాగ్రణి ఎంతటి సంప్రదాయ ప్రవణుడో అంతటి పరమాధునిక పట్టభద్రుడు. వస్తుస్వీకరణము నందును, నిర్వహణ శిల్పము నందును, భాషయందును, ఛందస్సునందును, భావము నందును, నియో క్లాసిజం (పునర్నవ సంప్రదాయవాదము) రొమాంటిసిజమ్ (కాల్పనిక వాదం) - ఈ రెండిటి కండబలము కలిగిన కమ్మని కవిత్వమీయనిది" అన్న ఆచార్య ఎస్వీ. జోగారావుగారి మాటల్లో అక్షర సత్యం ఉంది. బాపిరాజుగారి పద్యపు నడక ఆయనదే. శబ్దాల శోభాశింపు ఆయనదే అయన్నూ చదువుతుంటే మరొక కవి జ్ఞాపకం రాకపోవటం ఆయన కవిత్వ ప్రత్యేకత పరిపూర్ణమైన మానవ కళా హృదయం బాపిరాజు గారిది ప్రకృతికి, దాని వికృతికి కూడా స్పందించే హృదయం ఆయనది.వెన్నెల వర్ణనలో దేశ దౌర్భాగ్యాన్ని బాపిరాజుగారు మరచి పోలేదు.

"లేదు పదార్థ దృష్టిలవ
 లేశము పీడిన దక్కినన్, మతో
న్మాదము గాక తన్మహిత
 మార్గ సమాదృతి లేదు, స్వార్థసం
పాదన తప్పినన్ మతికి
 బట్టదపే సుఖ శాంతి బీజమూ
సోదర మానవో పకృతి
 చూడు ప్రభూ ! జగమెట్లు పోవునో"

అని లోక గమనాన్ని గురించి తపన, వేదన ఉన్న మనస్సు ఆయనది.

ఆయన పద్యపునడకలో ఎంత సొంత దనమున్నదో ఎంత ధారాశుద్ధి ఉన్నదో ఈ క్రింది పద్యం చెబుతుంది

"అనుపమబుద్ధగాథలు
 గుహాంతర భిత్తిక లందు చిత్రలే
ఖనముల వ్రాయువేళల
 నిగారపు కుంచెల రంగు లీతటో
ర్పని విదిలించి యుండెదరులే
 యటగాక విచిత్ర వర్ణ శో
భన హృదయం గమమ్ము లెటు
 భాసిలు సిచ్చట గడ్డి పువ్వులున్"

ఎంతటి కళాహృదయ మోకాని ఇంతటి పద్యాలు రాయలేదు. కవిగారు లేకపోయినా వారి కవిత్వాన్ని వెలుగులోకి తెచ్చిన "రామరాజభూషణ సాహిత్య పరిషత్" భీమరం వారు అభినందనీయులు.

పుష్యమి



*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247.*








అమృతాంజన్‌కే
తెలుసు
ఒంటి నొప్పులు
మరియు
బెణుకుల బాధ

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ







1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.

**అమృతాంజన్**

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 6777 TG